





# కథలు

## ఉపాఖ్యానము

# ధ్రువోపాఖ్యానం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010004980



**SaiRealAttitudeManagement**(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ ర స్తు

# ధ్రు వో పా ఖ్యా న ము

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము



చె న్న పు రి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము

1953.



శ్రీ ర స్తు.

# ధ్రు వో పా ఖ్యా న ము

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము

---

క. విను నిఖిలభువనపరిపా
లనమునకై చంద్రధరకళాకలితుం డై
వనజజునకు స్వాయంభువ
మను వపు డుదయించెఁ గీర్తిమంతుం డగుచున్. 1

టీక. నిఖిల=సమస్తమైన, భువన = లోకములయొక్క, పరిపాలనమునకై = పాలనఁ జేయు నిమిత్తము, వనజజునకున్ = బ్రహ్మదేవునికి, చంద్రధర = ఈశ్వరునియొక్క, కళా = అంశముతో, కలితుండై = ఒప్పుచున్నవాఁడై, కీర్తిమంతుండగుచున్ = కీర్తికలవాఁడగుచు, స్వాయంభువమనువు, అపుడు, ఉదయించెన్ = జన్మించెను. విను = వినుము.

తాత్పర్యము. సమస్త లోకరక్షణార్థమై యీశ్వరుని యంశమునందు స్వాయంభువమను వనువాఁడు ప్రకాశించుచు బ్రహ్మకు జన్మించెను.

తే. రూఢి నమ్మనువుకు శతరూపవలన
భూసుతు లగుప్రియవ్రతోత్తానపాదు

లనఁగ నిద్దఱు పుత్రు లై రందులోన
భవ్యచారిత్రుఁ డుత్తానపాదునకును. 2

టీ. రూఢిన్ = ప్రసిద్ధముగా, అమ్మనుపురున్ = ఆస్వాయంభువునకు, శతరూపవలన=శతరూపయను భార్యనుండి, భూనుతులగు = జనులచే స్తోత్రము చేయఁబడునట్టి, ప్రియవ్రత ఉత్తానపాదులు అనఁగన్, ఇద్దఱుపుత్రులైరి = ఇరువురు పుత్రులు కలిగిరి. అందులోనన్=అయిరువురిలో, భవ్య=మంగళప్రదమైన, చారిత్రుఁడు = చరిత్రకల, ఉత్తానపాదునకును = ఉత్తానపాదుఁ డనువానికి.

తా. ఆస్వాయంభువునకు శతరూప యనుభార్యనుండి ప్రియవ్రతోత్తానపాదు లను నిరువురుపుత్రు లుద్భవింప, వారిలో సచ్చారిత్రము కల యుత్తానపాదుఁ డనువానికి.

క. వినుము సునీతియు సురుచియు
నను భార్యలు గలరు వారియందును ధ్రువునిం
గనినసునీతియు నప్రియ
యును సురుచియుఁ బ్రియయు నగుచు నున్నట్టియెడన్. 3

టీ. సునీతియుం = సునీతియను, సురుచియుం=సురుచియను భార్యలు, కలరు=ఉన్నారు. వారియందును = వారిద్దఱిలో, ధ్రువునిన్, కనిన = కన్న, సునీతియుం = సునీతియనునది, అప్రియము = ఇష్టురాలుకానిదియు, సురుచియుం = సురుచియనునది, ప్రియయును = ఇష్టురాలుగను, అగుచున్, ఉన్నట్టియెడన్ = ఉన్నసమయమునందు.

తా. ఆయుత్తానపాదునకు ధ్రువునిం గనిన సునీతి యప్రియగను, సురుచి యను రెండవభార్య ప్రియగను నుండియున్నసమయమున.

సీ. ఒకనాఁడు సుఖలీల నుత్తానపాదుండు
- నెఱిఁ బ్రియురా లైన సురుచిగన్న

కొడుకు నుత్తముఁ దనతొడలపై నిడికొని
యుపలాలనము సేయు చున్న వేళ
నర్థిఁ దదారోహణాపేక్షితుం డైన
ధ్రువునిఁ గనుంగొని తివక యాద
రింప కుండుటకు గర్వించి యాసురుచియు
సవతిబిడ్డం డైనధ్రువునిఁ జూచి
తే. తండ్రితొడ నెక్కు వేడుక దగిలెనేనిఁ
బూని నాగర్భమున నాఁడు పుట్ట కన్య
గర్భమునఁ బుట్టి కోరినఁ గలదె నేఁడు
జనకుతొడయెక్కు భాగ్యంబు సవతికొడుక. 4

టీ. ఒకనాఁడు=ఒకదినమున, సుఖలీలన్ = విలాసముగా, ఉత్తాన పాదుఁడు = ఉత్తానపాదమహారాజు, నెఱిన్ = సంతోషముతో, ప్రియుం రాలైన = తనకిష్టురాలైన, సురుచి గన్నకొడుకున్ = సురుచికనినపుత్త్రుని, ఉత్తమున్ = ఉత్తముండనువానిని, తనతొడలపైన్ = తన తొడలమీఁద, ఇడికొని = ఉంచుకొని, ఉపలాలనము = ఓదార్పు, చేయుచున్నవేళన్ = చేయుచున్న సమయమునందు, అర్థిన్ = ప్రీతితో, తదారోహణాపేక్షితుం డైన = ఆతండ్రితొడపైఁ గూర్చుండఁ గోరుచున్న, ధ్రువునిన్ = ధ్రువుఁ డనుబాలుని, కనుఁగొని = చూచి, తివక = తీయక, ఆదరింపకుండుటకు = ఆదరింపక పోవుటకు, గర్వించి = గర్వమునొంది, ఆసురుచియు, సవతిబిడ్డం డైన ధ్రువుని=సవతికి బిడ్డఁడైన ధ్రువుఁడనువానిని, చూచి, సవతికొడుకా= ఓసవతికుఱ్ఱవాఁడా ! తండ్రితొడన్ = తండ్రియొక్కతొడపై, ఎక్కు వేడుక తగిలెనేనిన్=ఎక్కుటకు కోరికయున్నయెడల, పూని=ప్రయత్నించి, నాఁడు=నీవు పుట్టినపుడు, నాగర్భమునన్ = నాగర్భమునందు, పుట్టక, అన్య గర్భమునన్=మఱియొకతె గర్భమునందు, పుట్టి=జన్మించి, కోరినన్ = కోరిన

యెడల, నేడు=ఈదినమున, జనకుతొడ యొక్కభాగ్యంబు = తండ్రితొడ యొక్కనట్టి యదృష్టము, కలదే = కలుగునా !

తా. ఒకదినమున నుత్తానపాదుఁడు తన ప్రియురాలైన సురుచి పుత్రుని నుత్తముఁ డనువానిని దనతొడలపై నుంచికొని ముద్దులాడుచుండఁ దన కప్రియురాలగు సునీతికొడుకగు ధ్రువుఁ డనుకుఱ్ఱవాఁడుకూడఁ దన తండ్రి తొడమీఁదఁగూర్చుండ నపేక్షించుచుండ నాధ్రువుని సవతితల్లి యగు సురుచి మిక్కిలి గర్వముగా నీవు తండ్రియంకారోహణము నపేక్షించిన యెడ నాగర్భమున నే జన్మించియుందువు. అట్లుగాక నీ వితరగర్భమునఁ బడి నవు డిట్టిభాగ్యము నీ కెట్లు కలుగునని యాబాలుఁడగు సవతిపుత్రుఁ డైన ధ్రువునితోఁ బైరీతిని వక్కాణించెను.

క. అదిగాన నీవధోక్షజు
 పదపద్మము లాశ్రయింపు పాయక హరి నా
 యుదరమునఁ బుట్టఁజేయును
 వదలక య ట్లయిన ముదము వడసెద వనఘా ! 5

టీ. అదిగానన్ = అందువలన, అనఘా = ఓపుణ్యాత్ముఁడా! నీవు, అధోక్షజు = విష్ణుమూర్తియొక్క, పదపద్మములు = పాదపద్మములను, ఆశ్రయింపు = కొలువుము. పాయక = విడువక, హరి = విష్ణువు, నాయుదరమునన్ = నాయొక్క గర్భమునందు, పుట్టఁజేయును = పుట్టునటులఁజేయును, వదలక = తప్పక-నిక్కముగా, అట్లయినన్ = అట్లుచేసినయెడల, ముదము = సంతోషము, వడసెదవు = పొందఁగలవు.

తా. అందుచేత ధ్రువుఁడా ! నీవు విష్ణుపాదారవిందముల ధ్యానింపుము. అట్లు ధ్యానము చేసినచో నాహరి నిన్ను నాగర్భమునుండి పుట్టించును. అపుడు సకలసౌఖ్యముల నందెద వని యాసురుచి యాధ్రువునితోఁ జెప్పెను.

క. అని యీరీతి నసహ్యావ
చనములు పినతల్లి యపుడు జనకుఁడు వినఁగాఁ
దను నాడిన దుర్భాషా
ఘనశరములు మనము నాఁటి కాఱియఁ బెట్టన్. 6

టీ. అని = ఇట్లని, ఈరీతిని = పైప్రకారముగా, పినతల్లి = తనపిన తల్లియగు సురుచి, జనకుఁడు = తనతండ్రి, వినఁగాన్ = వినుచుండఁగా, అసహ్యావచనములు = సహింపశక్యముగాని పోటుమాటలు, తనున్ = తన్నుఁగూర్చి, ఆడినన్ = పలుకఁగా, దుర్భాషా=దుర్మార్గపుమాట లనెడు, ఘనశరములు = గొప్పబాణపుములుకులు, మనమున్ = మనస్సునందు, నాఁటి = గుచ్చుకొని, కాఱియన్ = బాధను, పెట్టన్ = కలుగఁజేయుచుండఁగా.

తా. ఈరీతిని పైప్రకార మావిల్లవానితండ్రి వినుచుండఁగా వినుటకైన శక్యముగాని యట్టి దుర్భాషలఁ దనపినతల్లి తన్నాడుటను విని యాబాలుఁడు మనస్సులో మిక్కిలి ఖేదపడుచుండె. అప్పుడు.

క. తను నట్లుపేక్షసేసిన
జనకునికడఁ బాసి దుఃఖజలనిధిలోనన్
మునుఁగుచును దండతాడిత
ఘనభుజగముఁబోలె రోషకలితుం డగుచున్. 7

టీ. (ఆబాలుఁడు), తనున్ = తనను, అట్లు=ఆరీతిని, ఉపేక్షసేసిన= లక్ష్యపెట్టని, జనకునికడన్ = తండ్రిదిక్కును, పాసి = . విడిచి, దుఃఖ జలనిధిలోనన్ = దుఃఖసముద్రమునందు, మునుఁగుచున్ = మునిఁగిపోవుచు, దండ = కఱ్ఱచేత, తాడిత = కొట్టఁబడిన, ఘనభుజగముఁబోలెన్ = గొప్పసర్పమువలె, రోష = రోషముతో, కలితుండు = ఒప్పుచున్నవాఁడు, అగుచున్ =అగుచు.

తా. అపు డాధ్రువుఁ డట్లు తన్ను నిరాకరించిన తండ్రిని వదలి మిగుల దుఃఖమును జెందుచు దండముచేఁ గొట్టఁబడిన పెద్దసర్పమువలె మిగుల రోషము నొందినవాఁడై.

క. ఘనరోదనంబు సేయుచుఁ
గనుఁగవలను శోకబాష్పకణములు దొరఁగన్
జననికడ కేఁగుటయు నిజ
తనయునిఁ గని యాసునీతి దద్దయుఁ బ్రేమన్. 8

టీ. ఘన = గొప్ప, రోదనంబు=మొఱ్ఱ, చేయుంచున్ = పెట్టుచు, కనుఁగవలను=రెండుకన్నులనుండియు, శోక=దుఃఖము సూచించు, బాష్ప= కన్నీటియొక్క, కణములు = బొట్లు, తొరఁగన్ = పడుచుండఁగా, జనని కడకున్=తనతల్లివద్దకు, ఏఁగుటయున్=వెళ్ళినతోడనే, నిజతనయునిన్ = తనకుమారుని, కని=చూచి, ఆసునీతి = ఆతనితల్లియగు సునీతి, దద్దయున్= మిక్కిలి, ప్రేమన్ = ప్రేమతో.

తా. ఆ ధ్రువుఁడు కనుఁగవలనుండి బాష్పకణములు జాఱున ట్లేడ్చుచుఁ దనతల్లికడకుఁబోవ నామె తనతనయునిఁజూచి మిక్కిలి ప్రేమతో

వ. తొడలపై నిడికొని. 9

టీ. తొడలపైన్ = తనతొడలయందు, ఇడికొని = ఆబాలు నుంచికొని.

క. కరమనురక్తిని మోము ని
విరి తద్వృత్తాంత మెల్ల వెలఁదులు నంతగ
పురవాసులు చెప్పిన విని
పలుపుగ నిట్టూర్పు లెసఁగ బాష్పాకుల యై. 10

టీ. కరము=అత్యంతము, అనురక్తిని = అనురాగముతో, మోము= ముఖమును, నివిరి=నెమిరి, తత్ =అచివటకు జరిగిన, వృత్తాంతమెల్లన్ = వృత్తాంతమునంతను, అంతఃపురవాసులు = అంతఃపురమందుండెడు, వెలఁ దులు=స్త్రీలు, చెప్పినన్ = చెప్పినతోడనే, విని, పలుపుగన్ = శీఘ్రముగా,

నిట్టూర్పులు, ఎసఁగఁగా = విజృంభింపఁగా, బాష్ప = కన్నీటిచే, ఆకులయై= వ్యాకులపడుచున్నదై.

తా. ఆమె యట్లేడ్చుచున్న తన కుఱ్ఱవాని మోముతుడిచి యట్లతఁ డేడ్చుట కదివఱకు జరిగిన వృత్తాంతము నంతఃపురస్త్రీలవలనఁ దెలిసికొని నిట్టూర్పులు నిగిడ్చి బాష్పవ్యాకులయై.

తే. సవతియాడినమాటలు సారెఁ దలఁచి
కొనుచుఁ బేర్చినదుఃఖాగ్నిఁ గుములుచుండె
దావపావక శిఖలచేఁ దగిలి కాంతి
వితతిఁ గందినమాధవీలతికవోలె. 11

టీ. సవతి = తన సవతియగు సురుచి, ఆడినమాటలు=తన కుమారు నాడినమాటలను, సారెన్=మఱలమఱల, తలఁచికొనుచున్ = జ్ఞాపకము తెచ్చికొనుచు, పేర్చిన = పేర్చినట్టి, దుఃఖాగ్నిన్ = దుఃఖమనెడు నగ్ని యందు, దావపావక = కాఱుచిచ్చుయొక్క, శిఖలచేన్=కొనలచే, తగిలి= తగులుకొని, కాంతి = కాంతియొక్క, వితతిన్ = సమూహమునుండి, కందిన = వాడిన, మాధవీలతికవోలె = బండి గురివిందతీఁగవలెనే, కుములు చుండెన్ = లోలోనఁ దపించుచుండెను.

తా. సునీతియను నాకుఱ్ఱవానితల్లి తన సవతి యాడినమాటలను బ్రతి క్షణమును జ్ఞాపకము తెచ్చికొనుచు దవాగ్నివహోత్రముతాకునఁ గాంతిలేని గురివెందతీఁగవలె దుఃఖసముద్రమున మగ్నచుండెను.

వ. అంత నాసునీతి బాలకునిం జూచి తండ్రీ దుఃఖింపకు మని యిట్లనియె. 12

టీ. అంతన్ = ఆసమయమునందు, ఆసునీతి, బాలకునిన్ = పిల్ల వానిని, చూచి, తండ్రీ = నాయనా ! దుఃఖింపకుము = ఏడువకుము. అని ఇట్లు = ఈ చెప్పఁబోవురీతిని, అనియెన్ = చెప్పెను.

తా. అప్పుడామె బాలకుని నూరార్చి యిట్లు చెప్పఁ దొడంగెను.

క. అనఘా ! యీదుఃఖమునకుఁ
బనిలే దన్యులకు సొలయ బలవంతం బై
తనపూర్వజన్మదుష్కృత
ఘనకర్మము వెంట నంటఁగా నెవ్వలనన్. 13

టీ. అనఘా = దోషరహితుఁడా ! తన పూర్వజన్మ దుష్కృత ఘన కర్మము = నీముందటిజన్మమునందలి పాపరూపమైనగొప్పకర్మ, ఎవ్వలనన్ = ఏవైపునను (అన్నివైపులందును), బలవంతంబై = బలిమిగలదై - తీఱనిదై; వెంటన్ అంటన్ = వెంబడించి వచ్చుచుండ, సొలయన్=వగచుటకు, పని లేదు = అవసరములేదు.

తా. ఓ చిన్నవాఁడా ! మన మొనర్చినపూర్వజన్మపుఁ బాపకర్మము బలవంతమై మనల నిట్లు వెంబడించి పీడించుచుండఁగా, నీ విపుడు పడినబన్నమునకై యొరుల నని యుపయోగము లేదు.

వ. కావున. 14

టీ. కావునన్ = కాఁబట్టి.

క. పెనిమిటిచేతను బెండ్లా
మని కాదు నికృష్టదాసి యనియును బిలువం
గను జాలనిదుర్భగురా
లనఁ గలనాకుక్షి నుదయ మందినకతనన్. 15

టీ. పెనిమిటిచేతను = భర్తచేతను, పెండ్లాము = భార్య, అని కాదు = ఇట్లని పిలువఁబడుటయుండని, నికృష్ట = నీచురాలయిన, దాసి = పనికత్తె, అనియును=ఇట్లనికూడ, పిలువంగనుజాలని = పిలుచుటకుఁ గూడఁ బనికిరాని, దుర్భగురాలు = దౌర్భాగ్యవంతురాలు, అనన్=అనుటకు, కల=

తగిన, నాకుక్షిన్ = నాకడుపునందు, ఉదయమందినకతనన్ = ఉత్పత్తి నొందిన కారణముచే.

తా. వరునిచేత భార్యయని పిలువఁబడకపోవడమేగాక తుదకు దాసి యనిగూడ పిలువఁబడనంతటి యదృష్టహీనురాల నగు నాకుక్షియందు నీ వుద్భవించిన కారణమున.

క. నిను నాడినయాసురుచివ
చనములు సత్యంబు లగును సర్వశరణ్యుం
డనఁగలహరిచరణంబులు
గను జనకునియంక మెక్కఁగాఁ దలఁతేనిన్. 16

టీ. ఓబాలుఁడా! నినున్ = నిన్నుంగురించి, ఆడిన = పలికిన, ఆసురుచి = అసురుచియొక్క, వచనములు = వాక్యములు, సత్యంబులు = నిజములు, అగును. సర్వ=సమస్తజంతువులసమూహమునకు, శరణ్యుండు = రక్షకుఁడు, అనంగల = అనుటకు సమర్థుఁడయిన, హరి = విష్ణుమూర్తి యొక్క, చరణంబులు=పాదములను, జనకుని=తండ్రియొక్క, అంకము = తొడను, ఎక్కఁగాన్ తలఁతేనిన్=ఎక్కుటకు నీవు తలంచినయెడల, కను= సేవించుము.

తా. ఓకుఱ్ఱవాఁడా! యాసురుచి చెప్పినది నిజము. నీకు నీతండ్రి యంకము నధిష్ఠింపవలెనని కోరికయున్నచో సమస్తచరాచరముల రక్షింపఁ గల యాహరిపాదములను గొలువుము.

వ. కావునం బినతల్లి యైనయాసురుచియాదేశంబున నధోక్షజు నాశ్రయింపు మని వెండియు నిట్లనియె. 17

టీ. కావునన్ = కాఁబట్టి, పినతల్లియైన = నీకుఁ బిన్నతల్లియైన, ఆసురుచి = అసురుచియొక్క, ఆదేశంబునన్ = ఆజ్ఞాప్రకారము, అధోక్షజున్ = శ్రీవిష్ణువును, ఆశ్రయింపుము = సేవింపుము. అని = చెప్పి, వెండియున్ = మఱియు, ఇట్లు = ఈవిధముగా, అనియెన్ = చెప్పెను.

తా. అందువలన నో ధ్రువుఁడా! నీవినతల్లి చెప్పినప్రకారము శ్రీమహా విష్ణువును గొలువుమని మఱల నీవిధముగఁ జెప్పం దొడంగెను.

సీ. పరికింప నీవిశ్వపరిపాలనమునకై
యర్థి గుణవ్యక్తుఁ డైనయట్టి
నారాయణునిపాదనలినముల్ సేవించి
తగ బ్రహ్మ బ్రహ్మపదంబు నొందె
ఘనుఁడు మీఁతాత యామనువు సర్వాంతర
యామిత్వమగు నేక మైనదృష్టిఁ
జేసి యాగముల యజించి తా భౌమసు
ఖములను దివ్యసుఖముల మోక్ష
తే. సుఖములను బొందె నట్టియచ్యుతునిఁ బరుని
వితతయోగీంద్రనికరగవేష్యమాణ
చరణసరసిజయుగళు శశ్వత్ప్రకాశు
భక్తవత్సలు విశ్వసంపాద్య హరిని. 18

టీ. పరికింపన్ = ఆలోచింపఁగా, ఈ=పరిదృశ్యమానమైన, విశ్వ=ప్రపంచముయొక్క, పరిపాలనమునకై=పరిపాలనము చేయుటకై, అర్థిన్=ప్రీతితో, గుణవ్యక్తుఁడైనయట్టి = మాయాగుణములచే స్వరూపమునొందినట్టి, నారాయణుని = విష్ణుమూర్తియొక్క, పాదనలినముల్ = పాదపద్మములను, సేవించి=కొలిచి, తగన్ = ఒప్పునట్లుగా, బ్రహ్మ=నలువ, బ్రహ్మపదమును=మోక్షమును, ఒందెన్=పొందెను. ఘనుఁడు=గొప్పవాఁడగు, మీఁతాత, ఆమనువు, సర్వాంతరయామిత్వముఅగు=అన్నివస్తువులలో నిముడుటయను, ఏకమైన=ఒక్కటియైన, దృష్టిన్ చేసి=దృష్టిచేత, తాను=అతఁడు, యాగములను=క్రతువులను,యజించి=చేసి,భౌమ=భూమియందలి, సుఖములను=సౌఖ్యములను, దివ్య=స్వర్గమునందలి,సుఖములను=సౌఖ్యములను, మోక్ష=మోక్షమునం

దలి, సుఖములను = సౌఖ్యములను, పొందెను. కావున, అట్టి = అటువంటి, అచ్యుతునిన్ = నాశరహితుఁడైనవాని, పరుని=సమస్తవస్తువులకంటె భిన్నుఁడైనవాని, వితత = విస్తారమయిన, యోగీంద్రనికర = యోగులలో నుత్తముల సమూహముచే, గవేష్యమాణ = వెదకఁబడు, చరణసరసిజయుగళున్ = పాదపద్మద్వంద్వముగలవాని, భక్త = స్వభక్తులయందు, వత్సలున్ = ప్రేమ కలవాని, విశ్వ = సమస్తప్రపంచముచే, సంపాద్యున్ = పొందఁదగిన, హరిని = సాక్షాద్విష్ణువును, సేవింపుము. అని ముందుపద్యముతో నన్వయము.

తా. సునీతి యాధ్రువునితోఁ దమపూర్వులు శ్రీహరిని గొల్చి యుత్కృష్టమగు పదవిని బొందిరని చెప్పుచు జ్ఞానోపదేశము చేయుచున్నది. ప్రపంచరక్షణార్థ మవతరించి మాయారూపమును దాల్చిన శ్రీవిష్ణువుయొక్క పాదకమలము లాశ్రయించుటచే బ్రహ్మ పరబ్రహ్మపదమున నైక్యము నొందె ననియు, బ్రహ్మమునందే తదేకాగ్రదృష్టి కలుగుటవలన నామనువు సమస్తభూతములలో నిమిడియుండెననియుఁ, (అనఁగా సాక్షాద్విష్ణురూపముఁ బొందె నని భావము) మఱియుఁ నతఁడు యాగముల నొనర్చి భూసౌఖ్యముల నొందె ననియు, (అనఁగా రాజ్యాధిపత్యము మున్నగునవి యనుభవించె ననియు,) స్వర్గసుఖములను గూడ ననుభవించె ననియు, (అనఁగా రంభాద్యప్సరోగణములతోఁ జిరకాలము క్రీడించుచు దేవత్వము నొందె ననియు) నింతియగాక మోక్షసుఖములఁ బొందె ననియు, (అనఁగాఁ బునర్జన్మములేక శ్రీమహావిష్ణువుయొక్క వేదస్వరూపమునందు లీనమయ్యె ననియు.) గనుక నిట్టిశక్తికలిగినటువంటియు, ఋషీశ్వరు లందఱిచేతను బొందఁదగినట్టియు, భక్తవాత్సల్యము కలిగినట్టియు శ్రీహరిని సేవింపుము.

వ. మఱియును. 19

క. కరసరసీజగృహీతాం
బురుహాయు నరవిందగర్భముఖగీర్వాణుల్

పరికింపంగలలక్ష్మీ
తరుణీమణిచేత వెదకఁ దగుపరమేశున్. 20

టీ. కరసరసిజ = పద్మముతో సమానమయిన హస్తముచేత, గృహీత = పట్టుకొనఁబడిన, అంబురుహాయు = పద్మముకలదియుం, అరవిందగర్భముఖ = బ్రహ్మదేవుఁడు మొదలగు, గీర్వాణుల్ = దేవతలు, పరికింపంగల = ఆలోచింపఁదగిన, లక్ష్మీ = లక్ష్మియనెడు, తరుణీమణిచేతన్ = స్త్రీరత్నముచేతను, వెదకన్ = వెదకుటకు, తగు = సమర్థుఁడైన, పరమేశున్ = సర్వేశ్వరుని, సేవింపుము.

తా. విష్ణుగుణములను సునీతి స్తోత్రముఁజేయుచున్నది.—పద్మముతో సమానమగు తనహస్తముతోఁ బద్మమును ధరించినట్టియుం బ్రహ్మాదిదేవతల చేతను గూడ వెదకఁబడునట్టి లక్ష్మిచేతనుఁగూడ వెదకఁబడునట్టి పరమేశుని (అనఁగా లోకమాతయగు సాక్షాత్పరమేశ్వరునిభార్యయయ్యు నామెకుఁ గూడ మనసీయనివాఁడగు) నారాయణుని సేవింపుము.

ధ్రువుఁడు నారదోపదేశంబు వడసి తపంబుచేయుట

వ. నిజధర్మపరిశోభితం బైనయేకాగ్రచిత్తంబున నిలిపి సేవింపు మమ్మహాత్మునికంటె నీదుఃఖం బపనయించువాఁ డన్యుం డొక్కరుండు గలండే యని పలికినఁ బరమార్థప్రాప్తిహేతుకంబు లైనతల్లివాక్యంబులు విని తన్నుఁ దాన నియమించుకొని పురంబు వెడలి చనునవసరంబున నారదుండు దద్వృత్తాంతం బెఱింగి యచ్చటికిం జనుదెంచి యతనిచికీర్షితంబు దెలిసి పాపనాశకరం బైనతనకరతలంబున నా ధ్రువుని శిరం బంటి మానభంగంబునకు సహింపని క్షత్త్రి

యుల ప్రభావం బద్భుతంబు గదా! బాలకుం డయ్యుఁ బిన తల్లి యాడినదురుక్తులు చిత్తంబునం బెట్టి చను చున్నవాఁ డని మనంబున నాశ్చర్యంబు నొంది యోబాలక! సకల సంపత్సమృద్ధం బగుమందిరంబు దెగడి యొంటి యెందు నేఁగెదవు? స్వజనకృతం బగు నవమానంబుచే నిను సంతప్తుంగాఁ దలంచెద ననిన ధ్రువుం డిట్లనియె. సపత్నీమాతృ వాగిషుక్షతం బగువ్రణంబు భగవద్ధ్యానయోగరసాయనంబున మాపికొందు ననిన విని ధ్రువునికి నారదుం డిట్లనియె.

టీ. నిజ = తనయొక్క, ఏకాగ్ర = కదలని, చిత్తంబునన్ = మనస్సునందు, అతని, నిలిపి = ఉంచికొని, సేవింపుము = కొలువుము. అమ్మహాత్మునికంటె = ఆమహాత్ముఁడగు. హరికంటె, నీ = నీయొక్క, దుఃఖంబు = దుఃఖమును, అపనయించువాఁడు = తొలఁగించువాఁడు, అన్యుం డొక్కరుండు = ఇతరుఁ డొకరుఁడును, కలండే = ఉన్నాఁడా (లేఁడని భావము). అని=ఇట్లు, పలికినన్ = చెప్పినతోడనే, పరమార్థ = మోక్షమును, ప్రాప్తి = చెందుటకు, హేతుకంబులైన = కారణభూతములైన, తల్లివాక్యంబులు = తనతల్లియగు సునీత్యుపదేశములను విని, తన్నుఁ దాన = తనంతటతానే, నియమించుకొని = విడిచిపెట్టి, చను = వెళ్లినట్టి, అవసరంబునన్ = సమయమునందు, నారదుండు = నారదుఁడను పురాతన ఋషి, తద్వృత్తాంతంబు = ఆసంగతిని, ఎఱింగి = తెలిసికొని, అచ్చటికిన్ = ఆస్థలమునకు, చనుదెంచి = వచ్చి, అతని = అతనియొక్క, చికీర్షితంబు = కోరికను, తెలిసి = తెలిసికొని, పాపనాశకరంబయిన = పాపముల నశింపఁజేయు, తనకరతలంబునన్ = తనయొక్కయఱచేతితో, ఆధ్రువునిశిరంబు, అంటి = ముట్టుకొని, మానభంగమునకు = మర్యాదచెడుటకు, సహింపని = ఓర్వని, క్షత్రియుల = రాజులయొక్క, ప్రభావంబు = మహిమము,

అద్భుతంబుగదా = ఆశ్చర్యముగదా, బాలకుండయ్యున్ = పిల్లవాఁడైనను, పినతల్లియాడిన=పినతల్లిచేతఁ బలుకఁబడిన, దురుక్తులు = దుర్భాషలు, చిత్తంబునన్, ఉంచుకొని, చనుచున్నవాఁడు=వెళ్లుచున్నవాఁడు, అని = ఈప్రకారముగా, మనంబునన్ = మనస్సున, ఆశ్చర్యంబునొంది = ఆశ్చర్యపడి, ఓబాలక = ఓకుఱ్ఱవాఁడా! సకల = సమస్తమైన, సంపత్ = సంపదలతో, సమృద్ధంబగు = నిండియున్న, మందిరంబున్ = గృహమును, తెగడి = తుచ్ఛముగఁ దిరస్కరించి, ఒంటిన్=ఒంటరిగా, ఎందున్ = ఎక్కడకు, ఏఁగెదవు= వెళ్లెదవు. స్వజన=బంధువులచేత, కృతంబగు=చేయఁబడిన, అవమానముచేన్ = తిరస్కారమున, నిను, సంతప్తుంగా = పరితపించునట్లుగా, తలంచెదన్ = ఊహించెదను. అనినన్ = ఇట్లనిన తోడనే, ధ్రువుఁడు, ఇట్లు = వక్ష్యమాణప్రకారము (చెప్పఁబోవురీతిని), అనియెన్=చెప్పెను. సపత్నీమాతృ = సవతితల్లియొక్క, వాక్ = మాటలనెడు, ఇషు = బాణములచేత, క్షతంబగు = తగిలిన, వ్రణంబు = గాయము, భగవత్ = షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన విష్ణువుయొక్క, ధ్యానయోగ = ధ్యానయోగ మనెడు, రసాయనంబునన్=దివ్యౌషధముచే, మాపికొందును=పోఁగొట్టుకొనెదను. అనినన్ = అనిన తోడనే, విని, ధ్రువునికి, నారదుఁడు, ఇట్లు = ఈచెప్పఁబోవురీతిని, అనియెన్ = పల్కెను.

తా. సునీతి పైప్రకారము శ్రీవిష్ణుగుణములను స్తుతించి యట్టిపరమేశుని నేకధ్యానమున స్తుతింపుమన, నట్టి తత్త్వోపదేశకములగు తల్లిమాటలను గ్రహించి యాబాలుఁ డట్లనే చేయ నిశ్చయించి పురము వెడలి పోవుచుండ నారదుం డావార్త నెఱిఁగి, యీకుఱ్ఱవాఁడు క్షత్రియుఁడగుటచే నవమానము సహింపక గృహమునుండి దేవతారాధనమునకై పోవుచున్నాఁ డని యాశ్చర్యమునొందుచు నారదుఁ డాధ్రువునియొద్దకు వచ్చి యిట్టిసమస్తసంపత్సమృద్ధంబగురాజ్యమునందాశలేక స్వజను లనినమాట కిట్లు సహింపక యొంటరిగాఁ బోవచ్చునా యని యనఁగనే, యాధ్రువుఁడు సవతితల్లివాక్కును

బాణప్రణమును భగవద్ధ్యానమనెడు దివ్యౌషధము నిచ్చి మాన్పివేసెద నని నారదునకుఁ జెప్పఁగా నారదుఁ డిట్లు చెప్పఁదొడంగెను.

క. విను పుత్రక బాలుఁడవై
యనయంబును గ్రీడలందు నాసక్తమనం
బునఁ దిరిగెడునిక్కాలం
బున నీ కవమానమానములు లే వెందున్. 22

టీ. పుత్రక = ఓకుఱ్ఱవాఁడా ! విను = నామాట వినుము. బాలుఁడవై = కుఱ్ఱవాఁడవై, అనయంబును = ఎల్లప్పుడును, క్రీడలందున్ = ఆటల యందు, ఆసక్త = తగులుకొనిన, మనంబునన్ = మనసుతో, తిరిగెడు = సంచరించునట్టి, ఇక్కాలంబునన్ = ఇటువంటివయఃకాలమునందు, ఎందున్ = ఏవిషయమునను, నీకు, అవమానమానములు = గౌరవము అగౌరవమును, లేవు.

తా. బాలుఁడగు ధ్రువునితో నారదుఁ డిట్లు చెప్పుచున్నాఁడు:— ధ్రువుఁడా ! నీవు పసికుఱ్ఱవాఁడవై యాటలాడుకొనినంత కాలము నీకు మానావమానము లనఁగా నెవ్వి ? (అనఁగాఁ బసివారి కాటపాటలయం దభిలాష తప్ప నెంతమాత్రము మానావమానము లుండ వని తాత్పర్యము.) కాన నామాట వినుము.

తే. కాన మనమునఁ దద్వివేకంబు నీకుఁ
గలిగెనేనియు సంతోషకలితు లయిన
పురుషు లాత్మీయకర్మవిస్ఫురణఁ జేసి
వితతసుఖదుఃఖము లనుభవింతు రెప్పుడు. 23

టీ. కానన్ = కాఁబట్టి, మనమునన్ = మనస్సునందు, తద్వివేకంబు = ఆట్టిజ్ఞానము, నీకున్, కలిగెన్ = కలిగెను. ఏనియున్ = అయినను, సంతోష కలితు లయిన = ఆనందముతో ఒప్పియున్న, పురుషులు, ఆత్మీయ = తమ

సంబంధమయిన, కర్మ = సుకృతదుష్కృతకర్మలయొక్క, విస్ఫురణఁజేసి = ప్రకాశముచేత, వితతసుఖదుఃఖములను = విస్తారమయిన సుఖమును దుఃఖమును, ఎప్పుడు = ఎల్లప్పుడు, అనుభవింతురు = అనుభవించెదరు.

తా. నారదుఁ డిట్లు ధ్రువునితోఁ జెప్పుచున్నాఁడుః—మానావమానము లవసరము లేనికాలమునను నీ కట్టిజ్ఞానమార్గము కుదిరెను. అందుచేఁ గొందఱు జ్ఞానులు తమతమ సుకృతదుష్కృతకర్మలవలన గొప్ప సుఖములను గాని గొప్పదుఃఖములను గాని యనుభవించెదరు.

వ. కావున వివేకంబు గల పురుషుండు తనకుం బ్రాప్తంబు లగు సుఖదుఃఖంబులు దైవవశంబులుగాఁ దలంచి తావన్మాత్రంబునం బరితుష్టుం డగు నీవును దల్లి చెప్పిన యోగమార్గప్రకారంబున సర్వేశ్వరానుగ్రహంబుఁ బొందెద నంటివేని. 24

టీ. కావునన్ = కాఁబట్టి, వివేకంబుగల = జ్ఞానముగల, పురుషుండు, తనకున్, ప్రాప్తంబు లగు=వచ్చిన, సుఖదుఃఖములు దైవవశంబులుగాన్=కర్మవశమున వచ్చినట్లుగా, తలంచి = ఆలోచించి, తావన్మాత్రంబునన్ = అంతమాత్రముచేతనే, పరితుష్టుండు = సంతోషము కలవాఁడు, అగును. నీవును, తల్లిచెప్పిన = నీతల్లి యుపదేశించిన, యోగమార్గప్రకారంబునన్ = యోగమార్గానుసారముగా, సర్వేశ్వర = పరమేశ్వరునియొక్క, అనుగ్రహంబున్ = దయను, పొందెదను = తప్పక పొందుదును, అని, అంటివేని = అనినట్లయిన.

తా. జ్ఞానియగు పురుషుఁడు తా ననుభవించు సుఖదుఃఖములు దైవవశంబులుగాని నావి కావనుచు జ్ఞానబోధముననే సంతసించుచుండును. నీవు నటుల మీతల్లిచెప్పిన జ్ఞానోపదేశక్రమమునఁ బరమేశ్వరునిదయ సంపా

దించెద నని నీవు కోరినయెడ, ఇట్లు చేయవలయునని ధ్రువునితో నారదుఁడు చెప్పుచున్నాఁడు.

సీ. అనఘాత్మ యోగీంద్రు లనయంబు ధరఁ బెక్కు-
జన్మంబులందు నిస్సంగ మైన
మతిని బ్రయోగసమాధినిష్ఠలఁ జేసి
యైనను దెలియ లే రతనిమార్గ
మది గాన నతఁడు దురారాధ్యుఁ డగు నీవు
నుడుగుము నిష్ఫలోద్యోగ మిపుడు
కాక నిశ్శ్రేయసకాముఁడ వగుదేనిఁ
దండ్రి వర్తించు తత్కాలమందుఁ

తే. బూని సుఖదుఃఖములు రెంటిలోన నెద్ది
దైవవశమునఁ జేకుఱుఁ దానఁ జేసి
డెందమునఁ జాలసంతుష్టి నొందువాఁడు
విమలవిజ్ఞాని యన భువి వెలయుచుండు. 25

టీ. అనఘ ఆత్మ = దోషరహితమైన అంతఃకరణము కలవాఁడా! యోగీంద్రులు = మునిశ్రేష్ఠులు, అనయంబు=ఎల్లప్పుడు, ధరన్ = భూమియందు, పెక్కుజన్మంబులందు = అనేకములయిన పుట్టుకలందు, నిస్సంగమైన=ఆసక్తిలేని, మతిని = బుద్ధిచేత, ప్రయోగ = వ్రతాదులందును, సమాధి=ఏకాగ్రతయందును, నిష్ఠలన్=ఉండుటలను, చేసియైనను = చేసినప్పటికిని, అతనిమార్గము = ఆపరమేశునియొక్క త్రోవను, తెలియలేరు = తెలిసికొనుటకు సమర్థులు కారుడిరి. అదిగానన్ = అందుచేత, అతఁడు = ఆపరమేశ్వరుఁడు, నీవు, దురారాధ్యుఁడు = అతికష్టముగా నారాధింపఁదగినవాఁడు, నిష్ఫల = ఫలములేని, ఉద్యోగమున్ = ప్రయత్నమునుండి, ఇపుడు, ఉడుగుము = మఱలుము. కాక = అట్లుగాక, నిశ్శ్రేయస

కాముఁడవగుదేనిన్ = మంగళమును కోరినవాఁడవయిన యెడల, తండ్రి = ఓతండ్రీ ! వర్తించు = ప్రవర్తించునట్టి, తత్కాలమందున్ = ఆకాలము నందు, పూని = పట్టుదలతో, సుఖదుఃఖములు రెంటిలోనన్ = సుఖదుఃఖ ములు రెంటియందును, దైవవశమునన్ =అదృష్టముచే, ఎద్ది=ఏది, చేకుఱున్ = సమకూరునో, దానఁజేసి = దానిచేత, డెందమునన్ = మనస్సునందు, చాలన్ = విస్తారముగా, సంతుష్టినొందువాఁడు = సంతోషమునుఁ బొందు వాఁడు, విమల=నిర్మలమయిన, విజ్ఞాని = విశేషజ్ఞానముగలవాఁడు, అనన్ = అనఁగా, భువిని = భూమియందు, వెలయుచుండున్ = ప్రకాశించు చుండును.

తా. నారదుఁడు ధ్రువునితో నీ పట్టిదయను సంపాదింపలేవు గాన నీ బుద్ధిని ఈతలంపునుండి మరల్పు మనిధ్రువునితోఁ జెప్పుచున్నాఁడు—గొప్ప మునీశ్వరులుసైతము జన్మాంతరములనుండియుఁ బ్రయోగసమాధినిష్ఠలచేసి యును ఇతరసంగానపేక్షితమయిన జ్ఞానమును సంపాదింప లేకుండిరి. కాన దురారాధ్యుఁడగు నాహరిని నీవు కనుఁగొనలేవు గాన నట్టిబుద్ధినుండి మఱ లుము. అట్లుకాక మోక్షమును గోరువాఁడవయినచో దైవవశమునఁ బ్రాప్తించు సుఖదుఃఖముల ననుభవించుచుండుము. అట్లనుభవించుచు సంతోషించువాఁడు విశేషజ్ఞానవంతుఁడుగా భూమియందుఁ బ్రకాశించుచుండును.

వ. మఱియు గుణాఢ్యుం డగువానిం జూచి సంతోషించుచు నాభాసుం డగువానింజూచి కరుణించుచు సమానునియెడ మైత్రి సలుపుచు వర్తించుచున్నవాఁడు తాపత్రయాది కంబులం దొఱంగు నని నారదుండు పలికిన విని ధ్రువుం డిట్లనియె ననఘా యీశమంబు సుఖదుఃఖహతాత్ము లగు పురుషులకు దుర్గమం బని కృపాయత్తుండ వైననీచేత వినం బడె నట్లయినం బరభయంకరం బగుక్షాత్త్రధర్మంబు నొం

దిన యవినీతుండ నగు నేను సురుచిదురుక్తిబాణవినిర్భిన్న
హృదయుండ నగుట మదీయచిత్తంబున శాంతి నిలువదు.
కావునం ద్రిభువనోత్కృష్టంబు ననన్యాధిష్ఠితంబు నగుపదం
బును బొంద నిచ్చించిననాకు సాధుమార్గంబు నెఱింగిం
పుము నీవు భగవంతుం డగునజునియూరువువలన జనించి
వీణావాదనకుశలుండ వై జగద్ధితార్థంబు సూర్యుండునుం
బోలె వర్తింతు వనిన విని. 26

టీ. నారదుఁ డాబాలునితో మఱలఁ జెప్పుచున్నాఁడు:—మఱియుం,
గుణ=గుణములతో, అధ్యుండగువానిన్ = కూడినవానిని, చూచి, సంతో
షించుచు, అభాసుండగువానిన్ = తక్కువయైనవానిని, చూచి, కరుణిం
చుచున్ = దయనుజూపుచు, సమానునియెడన్ = తనతో సమానుఁడైన
వానియొద్ద, మైత్రి సలుపుచున్ = స్నేహముచేయుచు, వర్తించుచున్నవాఁడు =
ప్రవర్తించుచున్నపురుషుఁడు, తాపత్రయాదికంబులన్ = సంసారతాపత్రయ
ములనుండి, తొలంగునని = తొలఁగిపోవు నని, నారదుండు, పలికినన్ =
పలికినతోడనే, విని, ధ్రువుండు, ఇట్లు=వక్ష్యమాణప్రకారము, అనియెన్ =
అనెను. అనఘా = పాపరహితుఁడా! ఈశమంబు = ఈశాంతియనుగుణము,
సుఖదుఃఖహతాత్ము లగుపురుషులకు = సుఖదుఃఖము లనుభవించు పురుషులకు,
దుర్గమంబని=పొందుటకు వీలు కానిదని, కృపాయత్తుండవయిన = దయాయత్త
చిత్తుఁడవయిన, నీచేత=నీమూలమున, వినంబడెను. అట్టయిన = అలాగయినను,
పర భయంకరంబగు = శత్రువులకు భయమును గలుగఁజేయు, క్షాత్ర =
క్షత్రియుల కుచితమయిన, ధర్మంబును = ధర్మమును, ఒందిన = పొందినట్టి,
అవినీతుండ నగు = నీతిలేని, నేను, సురుచి = సవతితల్లి యగు సురుచి
యొక్క, దురుక్తి = చెడుమాటలనెడు, బాణ = బాణములచే, వినిర్భిన్న =
ఛేదింపఁబడిన, హృదయుండ నగుటన్ =మనస్సుగలవాఁడ నగుటచే, మదీయ =

నాసంబంధమయిన, చిత్తంబునన్ = మనస్సునందు, శాంతి=శమగుణము, నిలువదు = ఉండదు. కావునన్ = కాఁబట్టి, త్రిభువన = మూఁడులోకములకంటెను, ఉత్కృష్టంబును = గొప్పదియును, అనన్యాధిష్ఠితంబునగు = ఇతరులచే నధిష్ఠింపఁబడనిదియునగు, పదంబును = స్థానమును, పొందన్ = పొందుటకు, ఇచ్ఛించిన=కోరినట్టి, నాకు, సాధు=మంచిదగు, మార్గంబును=త్రోవను, ఎఱింగింపుము = తెలియఁజెప్పుము. నీవు, భగవంతుండగు = షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగు, అజుని = బ్రహ్మదేవునియొక్క, ఊరువులవలనన్ = తొడలనుండి, జనించి = పుట్టి, వీణావాదనకుశలుండవై = వీణవాయించుటయందు మిక్కిలి నేర్పుగలవాఁడవై, జగత్ = లోకముయొక్క, హితార్థంబు = హితవునిమిత్తము, సూర్యుండునుంబోలె = సూర్యునివలె, వర్తింతువు = ఉందువు, అనినన్ = అనినతోడనే, విని.

తా. నారదుఁడు చెప్పుచున్నాఁడు:—ధ్రువుఁడా! తనకంటె గుణాధ్యునిఁజూచి సంతసించువాఁడును, తక్కువవానిఁజూచి దయతలఁచువాఁడును, సమానునియందు మైత్రి జరపువాఁడును, తాపత్రయాదులనుండి మఱలునని నారదుఁడు చెప్పఁగా ధ్రువుఁ డతనితో శమమనునది యోగులకుఁగూడ కుదురదని తమరే సెలవిచ్చియుంటిరి. మాసవతితల్లి యాడినమాటలకు నా మనస్సు కొంచెమైనను గలఁకదేఱకున్నయది. శత్రుభయంకరమగు క్షాత్ర ధర్మము నొంది యడఁకువ లేకున్నట్టి నాకు నత్యుత్కృష్టంబగు తత్పద మెట్లు లభించునో యావిషయము బ్రహ్మ యూరువులనుండి లోక సంరక్షణార్థ మవతరించి యానందముగా వీణానాదనమునం దతి సమర్థులరైన తమరుతప్ప నితరులు తెలియఁజేయం సమర్థులులేరు. తమ రట్టిపదము లభించు నుపాయము చెప్పవలె నని సూర్యునితో సమానముగాఁ బ్రకాశించుచున్న యానారదుని ధ్రువుఁ డడిగెను.

క. నారదుఁ డిట్లను ననఘ కు
మారక విను నిన్ను మోక్షమార్గంబునకున్

ప్రేరేచినవాఁ డిప్పుడు
ధీరజనోత్తముఁడు వాసుదేవుం డగుటన్. 27

టీ. నారదుఁడు, ఇట్లు = ఈవిధముగా, అనున్ = అనెను. అనఘ = దోషరహితుఁడైన, కుమారక = పిల్లవాఁడా! వాసుదేవుండు = కృష్ణమూర్తి, ధీరజన ఉత్తముఁడగుటన్ = ధీరపురుషులలో శ్రేష్ఠుఁ డగుటచేత, నిన్ను, మోక్ష=ముక్తియొక్క, మార్గంబునకున్ = త్రోవకు, ఇప్పుడు, ప్రేరేచినవాఁడు = ప్రేరేపణ చేయుచున్నవాఁడు, విను=నామాట వినుము.

తా. నారదుఁ డాధ్రువునితో నిట్లు చెప్పుచున్నాఁడు:—ఓకుమారుఁడా! వాసుదేవుఁడు ధీరపురుషులలో నుత్తముఁ డగుటచేత నిపుడు నిను మోక్షమార్గమునఁ బెట్టదలఁచి యుండెను. నామాట దృఢభక్తితో వినుము.

వ. నీవు నమ్మహాత్ముని నజస్రధ్యానప్రవణచిత్తుండ వై భజియింపుము. 28

టీ. నీవును, అమ్మహాత్ముని = ఆపరమేశ్వరుని, అజ...డవై - అజస్ర = ఎల్లప్పుడును, ధ్యాన = ధ్యానమునకు, ప్రవణ = లోఁగిన, చిత్తుండవై = మనస్సుకలవాఁడవై, భజియింపుము = సేవచేయుఁము.

తా. కాఁబట్టి, ఓబాలకా! నీవుగూడ, నిపుడు పరమేశుని ధ్యానించు మనస్సునే కలిగి యాతని స్తుతింపుము.

క. పురుషుఁడు తవిలి చతుర్విధ
పురుషార్థశ్రేయ మాత్మఁ బొందెద ననినన్
ధరఁ దత్ప్రాప్తికి హేతువు
హరిపదయుగళంబు దక్క నన్యము గలదే. 29

టీ. పురుషుఁడు, తవిలి = కోరి, చతుర్విధ = నాలుగు విధములయిన, పురుషార్థ = పురుషార్థములనెడి, శ్రేయము = సంపత్తును,

ఆత్మన్ = మనస్సులో, పొందదననినన్ = పొందదననియనినచో, ధరన్ = భూమియందు, తత్ప్రాప్తికి = ఆచతుర్విధపురుషార్థప్రాప్తికి, హేతువు = కారణము, హరిపదయుగళంబు దక్క = విష్ణుపాదద్వయముతప్ప, అన్యము = ఇతరము, కలదే = ఉన్నదా? (లేదని భావము.)

తా. ఒకపురుషుఁడు ధర్మార్థకామమోక్షము లను చతుర్విధపురుషార్థములను పొందఁదలఁచినచో వాని కాచతుర్విధపురుషార్థములు లభించుటకు హరిపదద్వయసేవ తప్ప వేఱుత్రోవ లేదని భావము.

వ. కావున. 30

టీ. కావున = కాఁబట్టి.

క. వరయమునాతటమునఁ దగు
హరిసాన్నిధ్యంబు శుచియు నతిపుణ్యము నై
పరఁగినమధువనమునకును
సరసగుణా చనుము మేలు సమకుఱు నచటన్. 31

టీ. వర = శ్రేష్ఠమైన, యమునా = యమునానదియొక్క, తట మునన్ = ఒడ్డునందు, తగు = ఒప్పునట్టి, హరిసాన్నిధ్యంబు = హరియొక్క సమీపముకల, శుచియుం = మిక్కిలి పరిశుద్ధమును, అతి = మిక్కిలి, పుణ్య ము నై = పుణ్యముఁకలదియునై, పరఁగిన = ఒప్పుచున్న, మధువనమునకున్ = మధువనమునుగూర్చి, సరసగుణా = మంచి గుణములుగలవాఁడా! చనుము = వెళ్లుము. అచటన్ = అచ్చట, మేలు, సమకుఱున్ = దొరకును.

తా. ఓకుఱ్ఱవాఁడా! శ్రేష్ఠమయిన యమునానదియొడ్డున నతిపరిశుద్ధముగా నుండునట్టియుం పుణ్యమొసఁగునదియుం నై హరిసాన్నిధ్యమునుగల మధువనమునకు నీ విపు డరిగినచో నచట మేలు కలుగును.

క. ఆయమునాతటినీశుభ
తోయములం గ్రుంకి నిష్ఠతో నచ్చట నా

రాయణునకును నమస్కృతు
లాయతమతిఁజేసి సేయు యమనియమములన్. 32

టీ. ఆయమునాతటినీ = ఆయమునానదియొక్క, శుభ = పరిశుద్ధము లైన, తోయములన్ = ఉదకములయందు, క్రుంకి = మునిఁగి, నిష్ఠతోన్ = నీమముతో, అచ్చటన్ = ఆస్థలమునందు, నారాయణునకును = సాక్షాచ్ఛ్రీమన్నారాయణమూర్తికి, నమస్కృతులు = నమస్కారములు, ఆయత = విస్తారమయిన, మతిఁజేసి = జ్ఞానముతో, యమనియమములన్ = బహిరింద్రియమును అంతఃకరణమును జయించుటలను, చేయుం = చేయుము.

తా. ఓబాలకుఁడా! పరిశుద్ధములగు యమునానది నీటియందు మునిఁగి యచట భక్తియుక్తముగా నారాయణుని దలంచి యమనియమములతో జపము చేయుము.

వ. మఱియు బాలుండ వగుటంజేసి వేదాధ్యయనాద్యుచిత కర్మానర్హుండ వయ్యు నుచితంబు లగుకుశాజినంబులంజేసి స్వస్తికప్రముఖాసనంబులం గల్పించికొని త్రివృత్ప్రాణాయామంబులచేతం బ్రాణేంద్రియమనోమలంబు లనుచాంచల్యదోషంబుల హరించి స్థిరం బయినచిత్తంబున. 33

టీ. మఱియుం = ఇంకను, బాలుండ వగుటంజేసి = పసివాఁడ వగుటచేత, వేద = వేదములయొక్క, అధ్యయన = పఠించుట, ఆది = మొదలగు, ఉచిత = తగిన, కర్మ = పనులకు, అనర్హుండవయ్యు = తగనివాఁడ వయినను, ఉచితంబులగు = తత్కాలోచితములగు, కుశ = దర్భలచేతను, అజినంబులంజేసి = చర్మములచేతను, స్వస్తికప్రముఖ = స్వస్తికము మొదలగు, ఆసనంబులన్ = ఆసనములను, కల్పించికొని = తయారుచేసికొని, త్రివృత్ = మూఁడు కాలములయందలి, ప్రాణాయామంబులచేతన్ = వాయుధారణల

చేతను, ప్రాణేంద్రియ=ప్రాణములయొక్కయు,ఇంద్రియములయొక్కయు, మనోమలంబులు = మనస్సునందలికశ్మలు, అను=అనునట్టి, చాంచల్య=చంచలత్వరూపమయిన, దోషంబులన్ = దోషములను, హరించి = పోఁగొట్టికొని, స్థిరంబయిన = ఏకాగ్రముగా నిల్చియున్న, చిత్తంబునన్=మనస్సుతో.

తా. మఱియు నారదుఁడు తత్త్వమార్గసంపాదనసాధనము నుపదేశించుచున్నాఁడు:—ఓ ధ్రువుఁడా! నీవు బాలుఁడవగుటచే వేదములు పఠించుట కర్హుఁడవు కావు, (అనఁగా వేదపఠనమును నీవు చేయఁగూడదని భావము.) అయినను నీకుఁ దగు కుశాజినములు ధరించి స్వస్తికము మొదలగు పేరులుగల కొన్నియాసనముల వేయుటను నేర్చుకొని మూఁడు కాలములయందును బ్రాణాయామము చేయుచు (అనఁగా వాయువును నాసికారంధ్రము నుండి పీల్చి లోపలను స్తంభింపఁజేయుట) ప్రాణములయొక్కయు, నింద్రియములయొక్కయు, మనస్సుయొక్కయుం మలరూపమయిన చాంచల్యరూపదోషము లేకుండఁ జేసికొని యేకాగ్రమగు బుద్ధితో.

సీ. ఆశ్రితసత్ప్రసాదాభిముఖుండును
నిద్ధప్రసన్నాననేక్షణుండు
సురుచిరనాసుండు సుభ్రూయుగుండును
సుకపోలతలుఁడును సుందరుండు
హరినీలసంశోభితాంగుండుఁ దరుణుండు
నరుణావలోకనోష్ఠాధరుండుఁ
గరుణాసముద్రుండుఁ బురుషార్థనిధియును
బ్రణతాశ్రయుండు శోభనపరుండు
తే. లలితశ్రీవత్సలక్షణలక్షితుండు
సర్వలోకశరణ్యుండు సర్వసాక్షి

పురుషలక్షణయుక్తుండుఁ బుణ్యశాలి
యసితమేఘనిభశ్యాముఁ డవ్యయుండు. 34

టీ. ఆశ్రిత = భక్తులకు, సత్ = మంచిదైన, ప్రసాద = అనుగ్రహమునకు, అభిముఖుండును = ఎదురుగా వచ్చువాఁడును, ఇద్ధ = వెలిఁగెడి, ప్రసన్న = తేటలైన, ఆనన=ముఖమును, ఈక్షణుండు = దృష్టి యుఁగలవాఁడును, సురుచిర = బాగుగాఁ బ్రకాశించుచున్న, నాసుండు = ముక్కుకలవాఁడును, సుభ్రూయుగుండును = మంచి రెండుకనుబొమ్మలు కల వాఁడును, సుకపోలతలుఁడును = మంచిచెక్కిళ్లు గలవాఁడును, సుంద రుండు = ఎన్నఁదగిన రూపముగలవాఁడును, వారినీల = ఇంద్రనీలమాణిక్య ముచే, సంశోభిత=ప్రకాశించుచున్న, అంగుఁడు = అవయవములు కలవాఁ డును, తరుణుండు = యౌవనవంతుఁడును, అరుణావలోకన = సూర్యదృష్టి వంటి, ఓష్ఠాధరుండు = అధరోష్ఠముకలవాఁడును, కరుణాసముద్రుండు = దయాసముద్రుఁడును, పురుషార్థ = ధర్మార్థకామమోక్షములకు, నిధియుఁ = గనివంటివాఁడును, ప్రణత = నమ్రులగువారికి, ఆశ్రయుండు = ఆధారమైన వాఁడును, శోభనకరుండు = మంగళము నిచ్చువాఁడును, లలిత = ఒప్పుచున్న, శ్రీవత్స = శ్రీవత్సమనెడు, లక్షణ = మచ్చతో, లక్షి తుండు = ఒప్పియున్నవాఁడును, సర్వ = సమస్తమగు, లోక = ప్రపంచ మునకు, శరణ్యుండు = రక్షకుఁడును, సర్వ = సమస్తమును, సాక్షి = చూచువాఁడును, పురుష = పరమపురుషునియొక్క, లక్షణ = చిహ్నము లతో, యుక్తుండు = కూడినవాఁడును, పుణ్యశాలి = పుణ్యముతో నొప్పు వాఁడును, అసిత = నల్లనైన, మేఘనిభ = మేఘముతో సమానమయిన, శ్యాముఁడు = శ్యామలవర్ణము గలవాఁడును, అవ్యయుండు = నాశరహితుఁ డును, నైన యని మీఁదిపద్యముతో నన్వయము.

తా. నారదుఁడు విష్ణుమూర్తియొక్క స్వరూపమును ధ్రువునకుఁ దెలియునటుల వర్ణించుచున్నాఁడు: — శ్రీహరి త న్నాశ్రయించువారి

యందు దయగలిగియుఁ జెల్లప్పుడును బ్రసన్నమగు చూపుగలిగియుఁ జెన్నుఁ దగిన నాసికా భ్రూకపోలతలములు గలిగి సుందరమూర్తియై యింద్రనీల మాణిక్యమును ధరించి యెట్టినిదృష్టికలిగి కరుణకు సముద్రుఁడేమో యని యనిపించుచు ధర్మార్థకామమోక్షములకుఁ బుట్టినిల్లయి శ్రీవత్సమను మచ్చను ధరించి సమస్తలోకముల రక్షించుచుఁ బుణ్యమూర్తియయి నల్లని మేఘము వంటిశరీరకాంతికలిగి ప్రకాశించునట్టివాఁడును.

వ. మఱియును. 35

టీ. మఱియును = అంతియకాక.

సీ. హారకిరీటకేయూరకంకణ ఘన
భూషణుం డాశ్రితపోషణుండు
లాలితకాంచీకలాపశోభితకటి
మండలుం డంచితకుండలుండు
మహనీయకౌస్తుభమణిఘృణిచారుగ్రై
వేయకుం డానందదాయకుండు
సలలితఘనశంఖచక్రగదాపద్మ
హస్తుండు భువనప్రశస్తుఁ డజుఁడు
తే. క్రమ్రసౌరభవనమాలికాధరుండు
హాతవిమోహుండు నవ్యపీతాంబరుండు
లలితకాంచననూపురాలంకృతుండు
నిరతిశయ సద్గుణుఁడు దర్శనీయతముఁడు. 36

టీ. హార...భూషణుఁడు-హార = ముత్యాలహారమును, కిరీట = కిరీటమును, కేయూర=బాహుపురులను, కంకణ=మురుగులు మొదలగు, ఘన = గొప్పవైన, భూషణుండు=అలంకారములు కలవాఁడును, ఆశ్రిత...ణుండు-

ఆశ్రిత=తనసాశ్రయించినవారిని, పోషణుండు=రక్షించువాడును, లాలి... దలుండు-లాలిత=సొగసైన, కాంచీకలాప=మొలనూలనెడి భూషణము చే, శోభిత = ప్రకాశించుచున్న, కటిమండలుండు = కటిప్రదేశముకలవాడు, అంచితకుండలుండు=ఒప్పుచున్న కుండలములు గలవాడును, మహా...కుండు-మహనీయ = కొనియాడదగిన, కౌస్తుభమణి = కౌస్తుభమాణిక్యముయొక్క-ఘృణి = కాంతులచే, చారు = సుందరమగు, గ్రైవేయకుండు = కంఠాభరణము కలవాడును, ఆనందదాయకుండు = ఆనందమును ఇచ్చువాడును, సల...హస్తుండు-సలలిత=సుందరములైన, ఘన=గొప్పవగు, శంఖ = శంఖము, చక్ర = చక్రము, గదా=గద, పద్మ=పద్మము, హస్తుండు = హస్తము లందు గలవాడును, భువన = లోకమునందు, ప్రశస్తుడు = ఉత్కృష్టతను జెందినవాడును, అజుడు = జన్మములేనివాడును, క్రమ = సుందర మయిన, సౌరభ = పరిమళముగల, వనమాలికా = తులసిమాలికను, ధరుండు= ధరించినవాడును, హృత = పోగొట్టబడిన, విమోహుండు = మోహము గలవాడును, నవ్య = నూతనమయిన, సీత = పచ్చనయిన, అంబరుండు = వస్త్రముకలవాడును, లలిత = సుందరమైన, కాంచన = సువర్ణవికారమయిన (బంగారు వికారమయిన), నూపుర = అందెలచే, అలంకృతుండు = అలంక రింపబడినవాడును, నిరతిశయ = అతిశయములేని, సద్గుణుడు = మంచి గుణములు కలవాడును, దర్శనీయతముడు = చూడదగిన రూపాతిశయము కలవాడును నై యుండెను.

తా. నారదుడు విష్ణురూపమును మరల వర్ణించుచున్నాడు.—విష్ణువు ముత్యాలహారము బాహుపురులు మురుగులు మొదలగు గొప్పయలంకారములను ధరించి సుందరమైన మొలనూలు సౌరునఁ బ్రకాశించుచుఁ గుండలమును వైచికొని కౌస్తుభమాణిక్యమును ధరించి కంఠాభరణమును ధరించి, నాలుగుచేతులయందు శంఖచక్రగదాపద్మముల నుంచుకొని మోహితుడు కాక పచ్చని పట్టువస్త్రమును గట్టుకొని సువర్ణవికారమయిన

యందెలను ధరించియున్న యాతఁడు దండలచేతను స్తుతింపఁదగి యున్నాఁడు.

క. సరసమనోలోచనము
త్కరుఁడును హృత్పద్మకర్ణికానివసితవి
స్ఫురదురునఖమణిశోభిత
చరణసరోజాతుఁ డతులశాంతుఁడు ఘనుఁడున్. 37

టీ. సర...త్కరుఁడును-సరస = సరసమయిన, మనోలోచన = మనసు చేతను కన్నులచేతను, ముత్ = సంతోషమును, కరుఁడును=చేయువాఁడును, హృత్...జాతుఁడు-హృత్పద్మ = హృదయపద్మమునందలి, కర్ణికా = మధ్యమునందు, నివసిత=నివసించిన, విస్ఫురత్=ప్రకాశించునట్టి, ఉరు = గొప్పవైన, నఖమణి = మాణిక్యములవంటిగోళ్లచేత, శోభిత = ప్రకాశించునట్టి, చరణసరోజాతుఁడు=పాదపద్మములు కలవాఁడు, అతులశాంతుఁడు=సమానములేని శాంతగుణము గలవాఁడును, ఘనుఁడున్=గొప్పవాఁడును. (ముందు పద్యముతో నన్వయము.)

తా. నారదుఁ డింకను విష్ణురూపమును వర్ణించుచున్నాఁడు:—విష్ణుమూర్తి యెల్లప్పుడును జేడొకటి యాలోచించుచునే యుండుననియు, తాను దనబొటనవ్రేలితో, పాదమును బట్టికొనుచుండు ననియు, మిక్కిలి శాంతస్వభావుఁ డనియు, నందఱికంటె ఘనుఁడనియు నభిప్రాయము.

వ. అయినపురుషోత్తముం బూజించుచు హృదయగతుండును సానురాగవిలోకనుండును వరదశ్రేష్ఠుండును నగునారాయణు నేకాగ్రచిత్తంబున ధ్యానంబు సేయుచుఁ బరమనివృత్తిమార్గంబున ధ్యాతుండైనపురుషోత్తముని దివ్యమంగళస్వరూపంబు చిత్తంబునం దగిలిన మరల మగుడ నేరదదియునుం గాక యేమంత్రంం బేని సప్తవాసరంబులు పఠి

యించిన ఖేచరులం గనుంగొనుసామర్థ్యంబు గలుగు నట్టి ప్రణవయుక్తం బగుద్వాదశాక్షరకలితంబును దేశకాల విభాగవేది యగుబుధానుష్ఠితంబును నయిన వాసుదేవ మంత్రంబునం జేసి. 38

టీ. అయిన = ఈపైనిచెప్పినరూపముగల, పురుషోత్తముఁ = అపరమ పురుషుఁడైన విష్ణుని, పూజించుచు, హృదయగతుండుచు = హృదయమును పొందినవాఁడును, సాను...నుండును - సానురాగ = అనురాగముగలిగిన, విలోకనుండును = దృష్టికలవాఁడును, వరదశ్రేష్ఠుండును - వర = వరములను, ద=ఇచ్చువారిలో, శ్రేష్ఠుండును = గొప్పవాఁడును, అగు = అగునట్టి, నారాయణుఁ = శ్రీమన్నారాయణమూర్తిని, ఏకాగ్రచిత్తంబునఁ = ఒకే మనస్సుతో, ధ్యానంబుసేయుచు = ధ్యానించుచు, పర...మార్గంబునఁ - పరమ = ఉత్కృష్టమయిన, నివృత్తిమార్గంబునఁ = మోక్షమార్గమునందు, ధ్యాతుండైన=ధ్యానము చేయఁబడిన, పురు......పంబు-పురుషోత్తముని = శ్రీ మహావిష్ణువుయొక్క, దివ్యమంగళ స్వరూపంబు=మిక్కిలి మంచిదగు మంగళ ప్రదమైనస్వరూపము, చిత్తంబునఁ=మనస్సునందు, తగిలినఁ=అంటినచో, మరల, మగుడ సేరదు = తిరుగ సేరదు. అదియునుం గాక, ఏమంత్రంబేని = ఏమంత్రమును, సప్తవాసరంబులు=ఏడుదినములు, పఠియించినఁ=చదివినయెడల, ఖేచరులఁ = దేవతలను, కనుంగొను సామర్థ్యంబు = చూచుటకుఁ దగునట్టి శక్తి,కలుగును—వచ్చునో, అట్టి, ప్రణవయుక్తంబగు-ప్రణవ=ఓంకారముతో, యుక్తంబగు = కూడిన, ద్వాదశాక్షరకలితంబగు = పండ్రెండక్షరములతో కూడినదియు, దేశ...వేదియగు - దేశ = దేశముయొక్కయు, కాల = కాలముయొక్కయు, విభాగ = విభాగమును, వేదియగు= తెలిసినట్టి, బుధ= పండితులచేత, అనుష్ఠితంబును = చేయఁబడునదియు, అయిన, వాసుదేవ = విష్ణుమూర్తియొక్క, మంత్రంబునం జేసి=మంత్రముచేత.

తా. ఏతద్రూప విశిష్టుఁడగు పరమపురుషుని బూజసేయుచు నితర హృదయాభిప్రాయము నెఱిఁగినట్టియుం, వరదులలో నత్యుత్తముఁడగు నా విష్ణుని నేకాగ్రచిత్తమున ధ్యానించుచు మోక్షమును గోరువారిచే ధ్యానము చేయఁబడు నాతని దివ్యమంగళ స్వరూపము జ్ఞాపకముంచుకొనినవారికి మరల నామనస్సెన్నటికిని మారనేరదు. ఇంతియగాక యేమంత్రమును నేడు దినములు శ్రద్ధతోఁ బఠించిన దేవతలనుగూడ జూడ సామర్థ్యము గలుగునో, యట్టి ప్రణవము కూడినట్టియుం ద్వాదశాక్షరకలితం బగునట్టియు దేశకాలవిభాగమును దెలిసిన పండితులచేఁ బఠింపఁబడునట్టిదియు నైన వాసుదేవుని మంత్రంబుచేత.

సీ. దూర్వాంకురంబుల దూర్వాంకురశ్యాము
జలజంబులను జారుజలజనయనుఁ
దులసీదళంబులం దులసికాదాముని
మాల్యంబులను సునైర్మల్యచరితుఁ
బత్త్రంబులను బక్షిపత్త్రునిఁ గడువన్య
మూలంబులను నాదిమూలఘనుని
నంచిత భూర్జత్వగాదినిర్మితవివి
ధాంబరంబులను బీతాంబరధరుఁ

తే. దనరుభక్తిని మృచ్ఛిలాదారురచిత
రూపములయందుఁ గాని నిరూఢమైన
సలిలములయందుఁ గాని సుస్థలములందుఁ
గాని పూజింపవలయు నక్కమలనాభు. 39

టీ. దూర్వాకురంబులన్ = లేఁతగరికెకొనలచేత, దూ...మున్ - దూర్వాంకుర=దూర్వాంకురమువలెనే, శ్యామున్=నల్లనైనవాఁడును, జలజంబులను=పద్మములచే, చారు...నున్-చారు = సుందరమైన, జలజనయనున్ =

పద్మసదృశమైన నేత్రమునుగలవానిని, తుల . లక్ - తులసీ = తులసిచెట్టు యొక్క, దళంబులక్ =ఆకులచే (మీఁద నొకయాకును రెండుప్రక్కలను రెండాకులు నున్నయెడ, దానికి దళమని పేరు), తులసికాదామునిక్ = తులసి పేటను ధరించినవానిని, మాల్యంబులను=పుష్పమాలికలచేత, సునై... రితుక్-సునైర్మల్య=కడునిర్మలమైన, చరితుక్ = చరిత్రకలవానిని, పత్రంబులను=ఆకులచే, పక్షిపత్రుని = గరుడవాహనుని, వన్యమూలంబులను=వనమునందలి దుంపలచే, ఆదిమూ...నిక్ - ఆదిమూల = మొదటి కారణమగు, ఘనునిక్=గొప్పవానిని, అంచి...ఖులను - అంచిత = ఒప్పుచున్న, భూర్జ త్వక్ = భుజపత్రవృక్షములయొక్క తొక్క, ఆది = మొదలగువానిచేత, నిర్మిత=నిర్మింపఁబడిన, వివిధ = అనేకవిధములయిన, అంబరంబులను=వస్త్రంబులచే, పీతాంబరధరుక్ = పచ్చని పట్టువస్త్రమును ధరించినవానిని, తనరు = ప్రకాశించునట్టి, భక్తిని=భక్తితో, మృత్ = మంటితో, శిలా = రాలతో, దారు = కఱ్ఱలతో, రచిత = చేయఁబడిన, రూపములయందును = బొమ్మలయందును, కాని, నిరూఢమైన = ప్రసిద్ధిచెందిన, సలిలములయందుఁగాని = ఉదకములయందుఁగాని, సుస్థలములయందుఁగాని = మంచిస్థలములయందుఁగాని, అక్కమలనాభుక్ = అవిష్ణువును, పూజింపవలయుఁక్ = పూజచేయవలయును.

తా. దూర్వలవంటి మేనిచాయగలవానిని దూర్వలతోను, జలజాక్షుని జలజములతోను, తులసీమాల ధరించినవానిని తులసీదళంబులతోను, నిర్మలచరితునిం బుష్పమాలతోను, పక్షివాహనుఁడైనవానిని బిల్వపత్రములు మున్నగు పత్రములతోను, పీతాంబరధరుఁడైనవానిని భుజపత్రపుఁ బట్టలతోఁజేసిన బట్టలతోను, ఇవ్విధంబున భగవంతుని రూపంబును మంటితోఁగాని, ఱాతితోఁగాని, కొయ్యతోఁగాని చేసిన ప్రతిమలయందును, పవిత్రములయిన తీర్థములందును, పుణ్యస్థలములందును ధ్యానించి పూజింపవలయును.

క. ధృతచిత్తుఁడు శాంతుండు ని
యతపరిభాషణుఁడు సుమహితాచారుఁడు వ
ర్ణితహరిమంగళగుణుఁడును
మితవన్యాశనుఁడు నగుచు మెలఁగఁగ వలయున్. 40

టీ. ధృత = అరికట్టఁబడిన, చిత్తుఁడు = మనస్సుకలవాఁడును, శాంతుండు = శాంతస్వభావుఁడును, నియత=తక్కువైన, పరిభాషణుఁడు = మాటలుగలవాఁడును, సుమహిత=పూజింపఁదగిన, ఆచారుఁడు = ఆచారము కలవాఁడును, వర్ణిత = పొగడఁబడినట్టి, హరి = విష్ణువుయొక్క, మంగళ= శుభమైన, గుణుఁడు=గుణములుగలవాఁడును, మిత=తక్కువయైన, వన్యాశనుఁడును = వనమందలి పదార్థములుగలవాఁడును, అగుచు, మెలఁగఁగ వలయున్ = సంచరింపవలయును;

తా. నారదుఁడు విష్ణువును బూజించువాఁ డిట్లుండవలయునని చెప్పుచున్నాఁడు:—విష్ణుమూర్తిని బూజచేయఁదలంచినవాఁడు తనమనస్సు నితర విషయములయందు సక్తముగాకుండునటుల దృఢపఱచుకొని, శాంతమును బొంది, యతిప్రసంగము లెవరితోను జేయక శిష్టులయాచారము నవలంబించి, కందమూలములు మితముగాఁ దినుచు నెల్లపుడును నా విష్ణువుయొక్క దివ్యగుణస్తుతిని మాత్రమే చేయుచు నుండవలెను.

వ. ఉత్తమశ్లోకుం డగుపుండరీకాక్షుండు నిజమాయాస్వేచ్ఛావతారచరితంబులచేత నచింత్యంబుగా నెద్ది సేయు నద్దియు హృదయగతంబుగా ధ్యానంబు సేయందగు. మఱియుఁ గార్యబుద్ధిం జేసి చేయంబడుపూజావిశేషంబులు వాసుదేవమంత్రంబున సర్వేశ్వరునికి సమర్పింపవలయు నిట్లు మనోవాక్కాయకర్మంబులచేత మనోగతంబగునట్లుగా భక్తియుక్తంబు లయినపూజలచేతఁ బూజింపంబడి సర్వేశ్వరుండు

మాయాభిభూతులు గాక సేవించుపురుషులకు ధర్మాదిపురుషార్థంబులలోన నభిమతార్థంబు నిచ్చు. విరక్తుండగువాఁడు నిరంతరభావం బయినభక్తియోగంబునం జేసి మోక్షంబు కొఱకు భజియించు నని చెప్పిన విని ధ్రువుండు నారదునకుం బ్రదక్షిణపూర్వకంబుగా నమస్కరించి మహర్షిజన సేవ్యంబై సకలసిద్ధుల నొసంగుచు భగవత్పాదసరోజాలంకృతం బైన మధువనంబునకుం జనియె నంత. 41

టీ. ఉత్తమ = గొప్పవారిచేత, శ్లోకుండగు = స్తుతింపఁబడునట్టి, పుండరీక = పద్మములవంటి, అక్షుండు = నేత్రములుగల విష్ణువు, నిజ = తన యొక్క, మాయా = మాయారూపమున, స్వేచ్ఛా = ఇష్టప్రకారమెత్తిన, అవతార = జన్మములయొక్క, చరితంబులచేతన్ = చరిత్రలచేత, అచింత్యంబుగాన్ = చింతింపఁదగనిదిగా, ఎద్ది = ఏది, చేయున్ = చేయునో, అద్దియ = అటువంటిదియే, హృదయగతంబు గాన్ = హృదయమును బొందునట్లు, ధ్యానంబు, చేయందగు. మఱియును, కార్యబుద్ధిం జేసి = కార్యముయొక్క బుద్ధిచేత, చేయంబడు, పూజావిశేషంబులు, వాసుదేవ = విష్ణుమూర్తియొక్క, మంత్రంబునన్ = మంత్రముచేత, సర్వేశ్వరునికిన్ = విష్ణువునకు, సమర్పింపవలయున్ = ఒప్పగింపవలెను. ఇట్లు = ఈవిధముగ, మనస్ = మనస్సుయొక్కయును. వాక్ = వాక్కుయొక్కయును, కాయ = శరీరముయొక్కయును, కర్మంబులన్ = పనులచే, మనోగతంబగు నట్లుగా = మనస్సును బొందునట్లు, భక్తియుక్తంబులయిన = భక్తితోఁగూడిన, పూజలచేత, పూజింపఁబడి = పూజచేయఁబడి, సర్వేశ్వరుండు, మాయా = మాయచేత, అభిభూతులుగాక = తిరస్కరింపఁబడనివారై, సేవించు = సేవచేయునట్టి, పురుషులకున్, ధర్మాది = ధర్మము మొదలగు, పురుషార్థంబులలో (అనఁగా ధర్మార్థకామమోక్షము లను పురుషార్థంబులలో నని యర్థము.) అభిమత =

ఇష్టమైన, అర్థంబు = పురుషార్థమును, ఇచ్చున్ = ఇచ్చును. విరక్తుం డగు వాఁడు = ఈధర్మాది పురుషార్థములయం దిచ్ఛలేనివాఁడు. నిరంతరభావం బయిన = ఏకాగ్రభావమును జెందిన, భక్తియోగంబునం జేసి=భక్తియోగము చేత, మోక్షంబుకొఱకున్ = ముక్తికొఱకు, భజియించును = సేవచేయును. అని, చెప్పినన్ = నారదుఁడు చెప్పఁగా, విని, ధ్రువుండు, నారదునకున్, ప్రదక్షిణపూర్వకంబుగాన్ = ప్రదక్షిణము ముందుఁగలుగునట్లు, నమస్కరించి, మహర్షి జన=గొప్పమహర్షులచేత, సేవ్యంబై = ఆశ్రయింపఁబడునదై, సకల = సమస్తజనులకును, సిద్ధులనొసంగుచున్ =కార్యసిద్ధులనిచ్చుచు, భగవత్ =విష్ణువు యొక్క, పాదసరోజ = పాదపద్మములచేత, అలంకృతంబైన = అలంకరింపఁ బడిన, మధువనంబునకు, చనియెన్ =వెళ్లెను. అంతన్ =ఆసమయమునందు.

తా. ఉత్తములచేఁ బూజింపఁబడుచున్న సాక్షాద్విష్ణువును నతని యవతారములయందలి చరిత్రవర్ణనలమూలమున స్తోత్రముచేయం దగును. అట్లు స్తుతించి వాసుదేవమంత్రము నుచ్చరించుచు నా విష్ణువున కర్పింపవల యును. ఇట్లు మనోవాక్కాయములచే స్తుతింపఁబడిన విష్ణువు వారికి ధర్మార్థ కామమోక్షములలో నేది కావలయునో యది తప్పక యిచ్చును. అట్లు పురుషార్థములనే కోరక సంసారసుఖములను విసర్జించి విరక్తిఁ జెందినవానికి నెన్నఁటికి నెడతెగని మోక్షమునే యిచ్చునని నారదుఁడు చెప్పఁగా, ధ్రువుఁడు విని, యాతనికిఁ బ్రదక్షిణనమస్కారము లొనర్చి యాయన యాజ్ఞాప్రకారము మునిజనసేవితంబును గామితఫలదాయియు నగు మధు వనంబునకుం జనియె.

తే. పద్మభవసూనుఁ డుత్తానపాదుకడకు
నరిగి యారాజుచే వివిధార్చనముల
నంది సంప్రీతుఁడై యున్న తాసనమున
నెలమిఁ గూర్చుండి యాతనివలను చూచి. 42

వ. ఇట్లనియె. 43

టీ. పద్మభవ = బ్రహ్మదేవునియొక్క, సూనుఁడు = కుమారుఁడగు నారదుఁడు, ఉత్తానపాదుకడకున్ = ధ్రువునితండ్రియగు నుత్తానపాదుని యొద్దకు, అరిగి = వెళ్లి, ఆరాజుచేన్ = ఆయుత్తానపాదునిచే, వివిధ = అనేకవిధము లయిన, అర్చనములన్ = పూజలను, అంది = కైకొని, సంప్రీతుఁడై = సంతోషించినవాఁడై, ఉన్నత = ఎత్తయిన, ఆసనమునన్ = సింహాసనము నందు, ఎలమిన్ = సంతోషముతో, కూర్చుండి, అతని = ఉత్తానపాదుని యొక్క, వలను = దిక్కునకు, చూచి, ఇట్లు = చెప్పఁబోవు తెఱఁగున, అనియె.

తా. ధ్రువుఁడు మధువనమునకు వెళ్లినతరువాత నారదుఁ డాతని తండ్రియగు నుత్తానపాదునికడ కేగి యాతనిచేఁ జేయఁబడిన యతిథిసత్కారముల నంది సంతసించి యున్నతాసనమునఁ గూర్చుండి యుత్తానపాదుని మోము చూచి యిట్లనియె.

క. భూనాయక నీ విపు డా
మ్లానాస్యుఁడ వగుచుఁ జాల మదిలోఁ జింతం
బూనుట కేమికతం బన
నానారదుతోడ నాతఁ డనియెన్ మరలన్. 44

టీ. భూనాయక = ఓరాజా! నీవు, ఇపుడు, ఆమ్లాన = మిగులవాఁడిన, ఆస్యుఁడవగుచున్ = ముఖముగలవాఁడవగుచు, చాలన్ = విస్తారముగా, మదిలోన్ = మనస్సునందు, చింతంబూనుటకున్ = విచారము నొందుటకు, ఏమికతంబు = కారణమేమి? అనన్ = అనఁగానే, ఆనారదుతోడన్ = ఆనారదునితో, మరలన్ = తిరిగి, అతఁడు = ఆఉత్తానపాదుఁడు, అనియెన్ = చెప్పెను.

తా. ఓరాజా ! నీ విపుడు ముఖమున కాంతిలేక విచారగ్రస్తుఁడవగు టకుఁ గారణమెద్దియని నారదుఁ డడుగఁగా, నుత్తానపాదుఁడు మరల నారదునితోఁ జెప్పుచున్నాఁడు.

క. మునివర వివేకశాలియు
నసఘుఁడు నైదేండ్లబాలుఁ డస్మత్ప్రియనం
దనుఁ డదయుఁడ నగునాచే
తను బరిభవ మొంది చనియెఁ దల్లియుఁ దానున్. 45

టీ. మునివర = మునిశ్రేష్ఠుఁడైన నారదా ! వివేక = జ్ఞానముతో, శాలియు = ఒప్పువాఁడును, అనఘుఁడు = దోషరహితుఁడును, ఐదేండ్ల = ఐదేండ్లుమాత్రమేకల, బాలుఁడు=కుఱ్ఱవాఁడును, అస్మత్ = నాకు, ప్రియ = ఇష్టుఁడైన, నందనుఁడు = కుమారుఁడు, అదయుఁడనగు = ఇంచుకంతయు దయలేని (కఠినహృదయుఁడనగు), నాచేతను, పరిభవమొంది = తిరస్కారమును జెంది, తానుక్ = కుఱ్ఱవాఁడును, తల్లియుఁక్ = ఆకుఱ్ఱవానితల్లియును, చనియెక్ = వెళ్లిపోయిరి.

తా. ఉత్తానపాదుఁడు తాను దుఃఖించుటకుఁ గారణమును నారదునితోఁ జెప్పుచున్నాఁడు:—ఓనారదా ! మిక్కిలి తెలివితేటలు గలవాఁడును పాప మన నెఱుంగనివాఁడు నైదేండ్లవయస్సుగలవాఁడును నైన నాకుమారుఁడు కఠినహృదయుఁడ నగు నేను తిరస్కరించుటచే తల్లియును తానును బోయిరి.

మ. చని యుగ్రాటవిఁ జొచ్చి యచ్చటఁ బరిశ్రాంతుండు
క్షుత్పీడితుండును సంమ్లానముఖాంబుజుండు ననఘుండుఁగా
బాలకుం డైనమ, త్తనయుఁగ ఘోరవృకాహిభల్లముఖ
సత్వశ్రేణి భక్షించెనో, యని దుఃఖించెద నాదుచిత్త
మున నార్యస్తుత్య యిట్లాటకున్. 46

టీ. చని = వెళ్లి, ఉగ్ర = భయంకరమయిన, అటవిన్ = అరణ్యమును, చొచ్చి = ప్రవేశించి, అచ్చటన్ = ఆస్థలమునందు, పరిశ్రాంతుండు = అలసినవాఁడును, క్షుత్ = ఆఁకలిచేత, పీడితుండును = నొప్పింపఁబడినవాఁడును, సంమ్లాన = బాగుగా వాడిన, ముఖాంబుజుండును = పద్మమువంటి ముఖముగలవాఁడును, అనఘుండును = దోషరహితుఁడును, బాలకుండైన = పసివాఁడును నైన, మత్తనయున్ = నాకుమారుని, ఘోర = భయంకరమైన, వృక = తోఁడేళ్లు, అహి = సర్పములు, భల్ల = ఎలుగుబంట్లు, ముఖ = మొదలగు, సత్వ = జంతువులయొక్క, శ్రేణి = పంక్తి, భక్షించెనో = తినివేసెనో, అని, ఆర్యస్తుత్య = ఆర్యులచేఁ బొగడఁబడువాఁడా! ఇట్లాటకున్ = ఈప్రకారముగా నగుటకు, నాచిత్తమునన్ = నామనస్సులో, దుఃఖించెదన్ = దుఃఖించుచున్నాను.

తా. ఉత్తానపాదుఁడు చెప్పుచున్నాఁడు:— అట్టిపుత్త్రవాఁడు ఘోరారణ్యము చొచ్చి మిక్కిలి యలసిపోయి యాఁకలిచే బాధపడుచు, నచ్చటనుండు నెలుగుబంట్లు తోఁడేళ్లు మొదలగు నేక్రూరజంతువులచే భక్షింపఁబడెనో యని నామనస్సునఁ బరితపించుచుంటిని.

తే. అట్టియుత్తమబాలు నాయంకపీఠ
మందుఁ గూర్చుండ నీక నిరాకరించి
యంగనాసక్తచిత్తుండ నైనయట్టి
నాదు దౌరాత్మ్య మిది మునినాథచంద్ర! 47

టీ. అట్టి = అటువంటి, ఉత్తమ = ఉత్తముఁడైన, బాలున్ = పుత్త్రవానిని, నాయంకపీఠమందున్ = నాతొడయందు, కూర్చుండనీక = కూర్చొననియ్యక, నిరాకరించి = అవమానించి, అంగనా = స్త్రీయందు, ఆసక్త = అంటుకొనిన, చిత్తుండనైన యట్టి = మనస్సుకలిగిన, నాదు = నాయొక్క, దౌరాత్మ్యమిది = దుర్మార్గపుస్వభావమిది, మునినాథచంద్ర = నారదుఁడా!

తా. ఉత్తానపాదుఁడు చెప్పుచున్నాఁడు:—ఓనారదుఁడా! అవిధముగానున్న యత్యుత్తముఁడైన పసికుమారుని నాయంకపీఠియం దుంచుకొని ముద్దులాడక దుర్మార్గుఁడనయిన నేను స్త్రీసక్తుఁడనై పిల్లవాని నిరాకరించితిని సుమా!

ఉ. నా విని నారదుండు నరనాథున కిట్లను నీకుమారుఁ డా
దేవకిరీటరత్నరుచిదీపితపాదసరోజుఁ డైన రా
జీవదళాక్షురక్షితుఁ డశేషజగత్పరికీర్తనీయకీ
ర్తివిభవప్రశస్తసుచరిత్రుఁడు వానికి దుఃఖ మేటికిన్. 48

టీ. నాన్ = అనఁగా, నారదుండు, విని, నరనాథునకున్ = ఉత్తానపాదునకు, ఇట్లు = ఈ చెప్పఁబోవు ప్రకారము, అనున్ = అనెను. దేవ = దేవతలయొక్క, కిరీట = కిరీటములందలి, రత్నరుచి = రత్నకాంతులచేత, దీపిత = ప్రకాశింపఁజేయఁబడిన, పాదసరోజుఁడైన = పాదపద్మములుగల, రాజీవదళ = పద్మపురేకులవంటి, అక్ష = నేత్రములు గలవిష్ణువుచేత, రక్షితుఁడు = రక్షింపఁబడినవాఁడై, అశేష = సమస్తమయిన, జగత్ = ప్రపంచముచే, పరికీర్తనీయ = కొనియాడఁదగిన, కీర్తి = కీర్తియొక్క, విభవ = సంపదచేత, ప్రశస్త = ప్రాశస్త్యముగల, సుచరిత్రుఁడు = మంచి చరిత్రగలవాఁడు నీ కుమారుఁడు, వానికిన్ = వానివిషయమై, దుఃఖమేటికిన్ = దుఃఖింపనేల ?

తా. నారదుఁడు చెప్పుచున్నాఁడు:—ఇట్లుత్తానపాదుఁడు పలుకుమాటలను విని నారదుఁ డుత్తానపాదునితో నీకుమారుని దేవతలచే సాష్టాంగదండప్రణామము లందునట్టి విష్ణువే రక్షించుచున్నాఁడు. ఇంతియగాక యాబాలుఁడు లోకమున ఖ్యాతికెక్కునంతటి కీర్తివైభవము గలిగి మంచి చరిత్రకలవాఁడగును గాన, వానివిషయమై యించుకంతయును నీవు దుఃఖింప నవసరము లేదు.

ఉ. కావున నమ్మహాత్ముఁడు సుకర్మముచేత సమస్తలోకపా
లావళి కందరానిసముదంచితనిత్యపదంబునం బ్రభు
శ్రీ విలసిల్లఁ జెందుఁ దులసీదళదాము భజించి యాజగ
త్పావనుఁ డైననీసుతుప్రభావ మెఱుంగవు నీవు భూవరా!

టీ. కావునన్ = కాఁబట్టి, అమ్మహాత్ముఁడు = ఆధన్యుఁడు, సుకర్మముచేతన్ = మంచికర్మమువలన, సమస్త = సమస్తమయిన, లోకపాల = ఇంద్రాదులయొక్క, ఆవళికిన్ = పంక్తికి, అందరాని = దొరకని, సముదంచిత=ప్రకాశమానమయిన, నిత్యపదంబునన్ = మోక్షమునందు, ప్రభుశ్రీ = ప్రభులక్ష్మి, విలసిల్లన్ = ప్రకాశించుచుండఁగా, తులసీదళదామున్ = విష్ణుమూర్తిని, భజించి = స్తుతించి, చెందున్ = చేరును. ఆజగత్పావనుఁడైన = ఆలోకమునంతను బవిత్రతనొందించునట్టి, నీసుతుప్రభావము = నీ కుమారునియొక్క సామర్థ్యము, భూవరా = రాజా! నీవు, ఎఱుంగవు = తెలిసికొనఁ జాలవు.

తా. నారదుఁడు చెప్పుచున్నాఁడు:—ఓరాజా! అందువలన నీ కుమారుఁడు పూర్వసుకర్మవశమున, విష్ణువు నారాధించి ఇంద్రాదులు గూడ నందలేని నాశరహితమైన మోక్షమునందు ప్రభులక్ష్మితోఁ గూడి యుండును. అట్టి నీసుతుయొక్క ప్రభావ మించుకంతయుం నీకుఁ దెలియదు గదా!

వ. అదియునుం గాక. 50

టీ. అదియునుంగాక = అంతమాత్రమే కాకుండ.

క. నీకీర్తియు జగములయం
దాకల్పము నొందఁజేయు నంచితగుణర
త్నాకరుఁ డిట కేతెంచును
శోకింపకు మతనిఁగూర్చి సుభగచరిత్రా! 51

టీ. సుభగ = మంచి, చరిత్రా = చరిత్రకలయోరాజా ! నీకీర్తియు = నీయొక్కకీర్తిని, జగములయందుఁ = లోకములయందు, ఆకల్పము=కల్పాంతమువఱకు, ఒందఁజేయు = పొందఁజేయునట్టి, అంచిత = ఒప్పుచున్న, గుణ = సద్గుణములకు, రత్నాకరుఁడు = సముద్రమువంటి, నీకొడుకు, ఇటకుఁ = నీయొద్దకు, ఏతెంచును = వచ్చును, అతనిఁగూర్చి = ఆపిల్లవాని విషయమై, శోకింపకు=దుఃఖమును జెందకుము.

తా. నారదుఁడు చెప్పుచున్నాఁడు:—ఓరాజా ! తనకీర్తియే గాక నీకీర్తినిగూడ సమస్తలోకములయందును కల్పాంతములవఱకును వ్యాపింపఁ జేయునట్టి సద్గుణసముద్రుఁడయిన నీకొడుకు నీయొద్దకు వచ్చునుగాన వాని విషయమై దుఃఖింపకుము.

క. అని నారదుండు పలికిన
విని మనమున విశ్వసించి విభుఁడును బ్రియనం
దనుఁ జింతించుచు నాదర
మునఁ జూడం డయ్యె రాజ్యమును బూజ్యముగన్. 52

టీ. అని = ఈవిధముగా, నారదుండు, పలికినఁ = చెప్పఁగా, విని, మనమునఁ = మనస్సునందు, విశ్వసించి = ప్రియమును జెంది, విభుఁడును = రాజును, ప్రియనందనుఁ=ప్రియుఁడైన పిల్లవానినిగూర్చి, చింతించుచుఁ = విచారించుచు, ఆధరమునఁ = గౌరవముతో, రాజ్యమును = రాజ్యభారమును, పూజ్యముగఁ=పూజింపఁదగినదిగా, చూడఁడయ్యెఁ = పాలింపఁడయ్యెను.

తా. ఇట్లు నారదుండు పలుక రాజు విని మనస్సున నానందించియుఁ, కుమారునికై చింతించుచు నప్పటినుండి యతిగౌరవముతో రాజ్యభారముఁ బూజ్యముగా వహింపఁ డయ్యెను.

వ. అంత నక్కడ నాధ్రువుండు. 53

టీ. అంతన్ = ఆసమయమున, అక్కడ = ఆమధువనమున, ఆధ్రువుండు.

క. చని ముందటఁ గనుఁగొనె మధు
వనమును మునిదేవయోగివర్ణితగుణపా
వనమును దుర్భవజలదప
వనమును నిఖిలైకపుణ్యవరభవనంబున్. 51.

టీ. చని = కొంతదూర మరిగి, ముందటన్ = తానుబోవుమార్గమున, ముని = మునీశ్వరులచేతను, దేవ = దేవతలచేతను, యోగి = యోగీశ్వరుల చేతను, వర్ణిత = వర్ణింపఁబడిన, గుణ = గుణములుగలిగి, పావనమును = పవిత్రమైనదియు, దుర్భవ = పాడుసంసారమనెడి, జలద = క్రొక్కాఱు మబ్బునకు, పవనమును = గాలియైనదియు, నిఖిల = అందఱకు, ఏక = ముఖ్యమయిన, పుణ్య = పవిత్రమగు, వర = శ్రేష్ఠమయిన, భవనంబున్ = ఉనికిపట్టును, అగు, మధువనమును, కనుంగొనెన్ = చూచెను.

తా. ఆధ్రువుఁ డట్లు పోవుచు మునిదేవయోగులచే స్తుతింపఁబడునట్టిదియు, మబ్బును తుపానువలె సంసారమును జెదరఁగొట్టునదియు, యోగుల కందఱకు మేటి యునికిపట్టు నగుమధువనమును జూచెను.

వ. అట్లు గని డాయంజని యమునానదిం గృతస్నానుండై నియతుండును సమాహితచిత్తుండును నై సర్వేశ్వరునిధ్యానంబు సేయుచుం ద్రిరాత్రత్రిరాత్రంబుల కొక్క మాఱు కృతకపిత్థబదరీఫలపారణుం డగుచు దేహస్థితి ననుసరించి యొక్కమాసంబు హరిం బూజించి యంతనుండి యాఱేసి దినంబుల కొక్కపరి కృతజీర్ణతృణపర్ణాహారుం డగుచు రెండవమాసంబున విష్ణుసమారాధనంబు సేసి యంతనుండి నవరాత్రంబుల కొకమాఱు ఉదకభక్షణంబు సేయుచు మూఁ

డవమాసంబున మాధవు నర్చించి యంతనుండి ద్వాదశ
దినంబుల కొకమాఱు వాయుభక్షణుం డగుచు జితశ్వా
సుండై నాలవమాసంబునం బుండరీకాక్షుని భజియించి
యంతనుండి మనంబున నలయక నిరుచ్ఛ్వాసుండై యేక
పదంబున నిలిచి పరమాత్మం జింతించుచు నచేతనం బైన
స్థాణువుంబోలె నైదవమాసంబున జరపె నంత. 55

టీ. అట్లు = ఆప్రకారము, కని = చూచి, డాయక = దాపునకు, చని = వెళ్లి, యమునానదిఁ = యమునానదిలో, కృత = చేయఁబడిన, స్నానుండై = స్నానముకలవాఁడై, నియతుండును = నియమముగలవాఁడును, సమాహితచిత్తుండును = ఏకాగ్రచిత్తముగలవాఁడును, ఐ, సర్వేశ్వరుని, ధ్యానంబుసేయుచు, త్రిరాత్రత్రిరాత్రంబులకు=ప్రతిమూఁడేసిరాత్రులకు, ఒక్కమాఱు, కృత = చేయఁబడిన, కపిత్థ=వెలఁగపండ్లయొక్క, బదరీ = రేగుపండ్లయొక్కయు, పారణుండగుచు=ఆహారముకలవాఁడగుచు, దేహస్థితి ననుసరించి, ఒక్కమాసంబు = ఒకనెలరోజులు, హరిఁ = విష్ణువును, పూజించి, అంతనుండి = అప్పటినుండి, ఆఱేసిదినంబులకుఁ=ఆఱురోజులకు, ఒకపరి = ఒకపర్యాయము, కృత = చేయఁబడిన, జీర్ణ = ఎండిన, తృణ= గడ్డియొక్క, పర్ణ = ఆకులయొక్కయుం, ఆహారుండయి = ఆహారముకల వాఁడగుచు, రెండవమాసంబునఁ=రెండవనెలలో, విష్ణుసమారాధనంబు=విష్ణు పూజను, చేసి, అంతనుండి=అప్పటినుండి, నవరాత్రంబుల కొకమాఱు=తొమ్మిది రాత్రుల కొకపర్యాయము, ఉదకభక్షణంబుసేయుచుఁ = నీటినిమాత్రము త్రాఁగుచు, మూఁడవమాసంబునఁ = మూఁడవనెలలో, మాధవునర్చించి = మాధవునిపూజ యొనర్చి, అంతనుండి = అప్పటినుండి, ద్వాదశదినంబుల కొకమాఱు = పన్నెండుదినముల కొకసారి, వాయుభక్షణుండగుచుఁ=గాలిని మాత్రము పీల్చుచు, జితశ్వాసుండై = శ్వాసను జయించినవాఁడై, నాలవ

మాసంబునన్ = నాల్గవమాసమునందు, పుండరీకాక్షుని భజియించి = విష్ణుపూజ యొనర్చి, అంతనుండి = అప్పటినుండి, మనంబునన్ = మనసులో, అలయక = అలసిపోక, నిరుచ్ఛ్వాసుండై = ఉచ్ఛ్వాసను మానినవాఁడై, ఏక పదంబున నిలిచి = ఒంటికాలిమీఁద నిలఁబడి, పరమాత్మఁజింతించుచున్ = పరమేశ్వరధ్యానముచేయుఁచు, అచేతనంబైన = జ్ఞానములేని, కదలికలేని, స్థాణువుఁబోలె = మోడువలె, ఐదవమాసంబున, జరపెను = కడపెను, అంతన్ = ఆసమయమున.

తా. ఆ ట్లాధ్రువుఁడు యమునానదిలో స్నానముచేసికొని నియమము గలిగి యేకాగ్రచిత్తుఁడై దేవుని ధ్యానించుచు మూఁడురోజుల కొక్కొకసారి వెలఁగపండ్లు రేఁగుపండ్లును దినుచు మొదటిమాసమును నడపి, యంతటనుండి యాఱేసిదినముల కొక్కొకసారి జీర్ణించిన గడ్డిని నాకులను భక్షించి విష్ణుపూజఁజేయుచు రెండవమాసమును గడపి, అప్పటినుండి తొమ్మిదిదినముల కొక్కొకసారి యుదకభక్షణము సేయుచు విష్ణుపూజచే మూఁడవమాసమును గడపి, అప్పటినుండి పన్నెండుదినముల కొకపర్యాయము వాయుంభక్షణముఁ జేయుచు శ్వాసను జయించి విష్ణుపూజచే నాల్గవమాసమును గడపి, యప్పటి నుండి యుచ్ఛ్వాసమును దీయుట మాని మోడువలెఁ గదలక తదేకాగ్రముగా నైదవమాసము జరుపఁగా.

సీ. సకలభూతేంద్రియాశయ మగుహృదయంబు
నందు విషయములఁ జెంద నీక
మహదాదితత్త్వసమాజమ్ములకును నా
ధారభూతమును బ్రధానపూరు
షేశ్వరుఁ డై నట్టిశాశ్వతబ్రహ్మంబుఁ
దనదైనహృదయపద్మమున నిలిపి

హరిరూపమునకంటె నన్యంబు నెఱుఁగక
చిత్త మవ్విభునందుఁ జేర్చి యున్న
తే. కతన ముల్లోకములు చాలఁ గంప మొందె
వెండియును బేర్చి యయ్యర్భకుండు ధరణి
నొక్కపాదంబు చేర్చి నిల్చున్న వేళఁ
బేర్చి యబ్బాలునంగుష్ఠపీడఁ జేసి. 56

టీ. సకల = అన్నింటినుండి, భూత = శబ్దస్పర్శరూపరసగంధముల కును, ఇంద్రియ = ఇంద్రియములకును, ఆశయము = ఉనికిపట్టు, అగు, హృదయమునందు, విషయములను = ఇతరవిషయములను, చెందనీక = రానియ్యక, మహదాది = మహత్తు మొదలుగాఁగల, తత్త్వసమాజములకున్ = తత్త్వములకు, ఆధారభూతమును = ఆధారమయినదియు, ప్రధానపురుష = ప్రధానప్రకృతికి, ఈశ్వరుఁడైనట్టి = ప్రభువైనట్టి, శాశ్వత=నాశనము లేని, బ్రహ్మంబు=పరబ్రహ్మమును, తనదైన=తన, హృదయపద్మమునన్ =కమలమువంటి హృదయమునందు, నిలిపి=ఉంచికొని, హరిరూపమునకంటెన్ = విష్ణురూపమున కంటె, అన్యంబు నెఱుఁగక=ఇతర మైనది తెలియక, అవ్విభునందున్ =ఆపరమేశుని యందు, చిత్తముఁ జేర్చియున్న = మనస్సు పెట్టియుఁన్న, కతనన్ =కారణమున, ముల్లోకములు=మూఁడులోకములు, చాలన్ = విస్తారముగ, కంపమొందెన్ = వణఁకును జెందెను. వెండియును = మఱియును, పేర్చి = భక్తిగలిగి, అయ్యర్భ కుండు=ఆబాలుండగు ధ్రువుఁడు, ధరణిన్ = భూమియందు, ఒక్కపాదంబు చేర్చి=ఒక్కపాదమునుమాత్రమే నిలిపి, నిల్చున్న వేళన్ = నిలుచున్న సమయ మున, అబ్బాలున్ = ఆకుఱ్ఱవానియొక్క, అంగుష్ఠపీడఁ జేసి = బొటనవ్రేలి పీడచే.

తా. ఆధ్రువుఁడు తనహృదయమును నితరవిషయములయందు వ్యాపింపనీక మహదాదితత్త్వములకు నాధారభూతమయినట్టి ప్రధానమయిన

శాశ్వతపరబ్రహ్మను ధ్యానించుచు హరిరూపముకంటె వేఱు లేదని తలంచు చుండ, మూఁడులోకము లొక్కుమాఱుగాఁ గంపించుచుండెను. అట్టిసమయమున నా బాలుఁ డొక్కపాదమునసే బొటనవ్రేలిపై నిలిచి తపస్సుచేయుం చుండెను.

తే. వసుమతీతల మర్ధము వంగఁ జొచ్చె
భూరిమదదుర్ణివారణవారణేంద్ర
మెడమఁ గుడి నొరగఁగ నడుగడుగునకును
జలన మొందుచు నడఁగెడుకలముఁబోలె. 57

టీ. వసుమతీతలము=భూమి, అర్ధము=కొంతభాగము, భూరి=విస్తారమయిన, మద = మదముకలుగుటచే, దుర్ణివారణ = అడ్డులేని, వారణేంద్రము = మదపుటేనుఁగు, ఎడమక్ =ఎడమవైపునకు, కుడిక్ =కుడివైపుకు, ఒరగఁగక్ = ఒరుగుచుండఁగా, అడుగడుగునకును, చలన మొందుచుక్ =చలించుచు, అడఁగెడు=అణఁగిపోవునట్టి, కలముఁబోలెక్ =ఓడవలె, వంగఁజొచ్చెను.

తా. ఎవరికి లొంగని మదపుటేనుఁగెక్కి ముందుకు వెనుకకుఁ బోవుటచే మాటిమాటికిఁ గదలుచున్న యోడవలె సాధ్రువుని బొటనవ్రేలి యదుముచే భూమి సగము క్రుంగెను.

చ. అతఁడు ననన్యదృష్టిని జరాచరదేహిశరీరధారణా
స్థితిగలయీశునందుఁ దనజీవితముక్ ఘటియింపఁజేసి యే
కతఁగన దన్నిరోధమునఁ గైకొని కంపము నొందె నీశ్వరుం,
డతఁడు చలింప నిజ్జగము లన్నియుఁ జంచల మయ్యె
భూవరా ! 58

టీ. భూవరా=ఓరాజా! అతఁడును = ఆధ్రువుఁడు, అనన్యదృష్టిని= ఇతరవిషయములయందు సక్తముకాని దృష్టితో, చర=సంచలించునట్టియు,

అచర = చలింపక స్థాణుభూతములయినట్టివియుఁ, దేహి = ప్రాణులయొక్క,
శరీర=శరీరముయొక్క, ధారణాస్థితిగల = ధరించి పోషించునట్టి, ఈశు
నందున్=పరమాత్మునియందు, తనజీవితమున్=తనప్రాణము, ఘటియింపఁజేసి =
కూర్చి, ఏకతన్=ఐక్యమునొందుటకు, కనన్=చూచుచుండ, తత్=అధ్రువుని
యొక్క, నిరోధమునన్=నిరోధముచేత, కైకొని=స్వీకరించి, ఈశ్వరుఁడు,
కంపమునొందెన్ = వణఁకెను. అతఁడు చలింపన్ = ఆయన చలింపఁగా,
ఇజ్జగములన్నియున్ = ఈలోకములన్నియును, చంచలమయ్యెన్ = కదలినవి.

తా. ఓరాజా! ఆధ్రువుఁ డన్యవిషయములఁ ద్యజించి యేకాగ్ర
దృష్టితో నీశునందే తనజీవితమునంతను జేర్చిపెట్టి యైక్యమునొందుటకై
యత్నించుచుండ. వానిదార్ఢ్యమును జూచి యీశ్వరుఁడు సైతము చలిం
చెను. అట్లాయన చలింప ముజ్జగములును నొక్కమాఱు చలించినవి.

క. ఆలోకభయంకరమగు
నాలోకమహావిపద్దశాలోకను లై
యాలోకపాలు రందఱు
నాలోకశరణ్యుఁ గాన నరిగిరి భీతిన్. 59

టీ. ఆలోక = చూచుటకు, భయంకరమగు = భయమును గలుగఁ
జేయునట్టి, ఆలోక = అజనులయొక్క, మహావిపద్దశా = గొప్పవిపత్తును,
ఆలోకనులై = చూచినవారై, లోకపాలు రందఱు = ఇంద్రాదులెల్లరును,
ఆ, లోకశరణ్యున్=లోకమును రక్షించువిష్ణుని, కానన్=చూచునిమిత్తము,
భీతిన్ = భయముతో, అరిగిరి = వెళ్లిరి.

తా. జగంబులకెల్ల సంభవించినట్టిదియు, చూపరకు దిగులుపుట్టించు
నదియు నగు గొప్పయాపదంగాంచి దిక్పాలురందఱు లోకములఁ గాపాడు
నట్టి మహావిష్ణువుఁ జూడ నేగిరి.

వ. అట్లరిగి నారాయణునుద్దేశించి కృతప్రణాములై కరంబులు ముకుళించికొని యి ట్లనిరి. 60

టీ. అట్లు = ఆవిధముగా, అరిగి = వెళ్లి, నారాయణునుద్దేశించి = నారాయణునిఁ దలఁచి, కృతప్రణాములై = నమస్కరించినవారై, కరంబులు = హస్తములు, ముకుళించికొని = జోడించుకొని, ఇట్లు = వక్ష్యమాణప్రకారము, అనిరి=పలికిరి.

తా. అట్లు భయముతోఁ బోయిన లోకపాలు రందఱును నామధువనంబున కరిగి యచ్చట పరమేశునకు భక్తిపూర్వకముగా నమస్కరించి స్తోత్రము చేయ మొదలిడిరి.

చ. హరి పరమాత్మ! కేశవ! చరాచరభూతశరీరధారివై
పరఁగుదు వీవు నిట్టులుగఁబ్రాణనిరోధ మెఱుంగ మెందుముం
దిరవుగ దేవదేవ! జగదీశ్వర! సర్వశరణ్య! నీపదాం
బురుహము లర్థిమై శరణువొందెదమార్తిహరించి కావవే.

టీ. ఓహరి=పరమేశ్వరా! నీవును, చరాచర = జంగమస్థావరాత్మకములయిన, భూత = పంచభూతములయొక్క, శరీర = శరీరమును, ధారివై = ధరించినవాఁడవై, హరి = హరియనియు, పరమాత్మ = పరమాత్మయనియు, కేశవ = కేశవ యనియుం నామముల, పరఁగుదువు = వ్యవహరింపఁబడుచున్నావు. ముందు=మునుపు, ఇరవుగన్ = నిశ్చయముగా, ఇట్టులుగన్=ఈ విధమున, ప్రాణనిరోధమున్ = ప్రాణవాయువుయొక్క నిరోధమును, ఎఱుంగము. ఎందున్ =ఎచటను తెలియంగము. దేవదేవ = దేవతలకు దేవుఁడా! జగత్ = ప్రపంచమునకు, ఈశ్వర = ప్రభువైనవాఁడా! సర్వ = సమస్తమును, శరణ్య = రక్షించువాఁడా! నీపదాంబురుహములు = నీపాదపద్మములు, అర్థిమైన్ = ప్రీతితో, శరణువొందెదము=శరణొందెదము. ఆర్తిన్ = దుఃఖమును హరించి=పోఁగొట్టి. కావవే=రక్షింపుమా!

తా. ఓపరమేశ్వరా! నీవు జంగమస్థావరరూపుండవై కేశవాదినామములం బరఁగుచుంటివి. ఇంతకుముం దిట్టిప్రాణనిరోధము నెఱుంగము. కాన నిన్ను శరణుఁజొచ్చి కొలిచెదము. మాదుఃఖములను బాపి మమ్ము రక్షింపుము.

వ. అని దేవతలు విన్నవించిన నీశ్వరుండు వారల కిట్లనియె నుత్తానపాదుం డనువానితనయుండు విశ్వరూపుఁడ నయిన నాయందుఁ దనచిత్తం బైక్యంబుసేసి తపంబు గావించుచుండ దానంజేసి భవదీయప్రాణనిరోధం బయ్యె నట్టిదురత్యయం బైనతపంబు నివర్తింపంజేసెద వెఱవక మీమీనివాసంబులకుం జనుం డని యానతిచ్చిన నాదేవతలు నిర్భయాత్ములై యీశ్వరునకుం బ్రణామంబు లాచరించి త్రివిష్టపంబునకుం జనిరి తదనంతరంబ. 62

టీ. అని, దేవతలు, విన్నవించినన్ = మనవిచేయఁగా, ఈశ్వరుండు, వారలకు, ఇట్లు=ఈవిధముగా, అనియెను. ఉత్తానపాదుం డనువాని = ఉత్తానపాదుఁ డనువానియొక్క, తనయుండు = కుమారుఁడు, విశ్వరూపుఁడ నయిన=ప్రపంచస్వరూపముగల, నాయందు, తనచిత్తంబు = అతనిమనస్సు, ఐక్యంబుచేసి = ఏకత్వమునొందించి, తపంబుగావించుచుండఁగ్ = తపస్సు చేయుచుండఁగా, దానంజేసి = ఆతపస్సుచేత, భవ...నిరోధంబు అయ్యెను- భవదీయ = మీదైన, ప్రాణ = చైతన్యము, నిరోధంబు అయ్యెను = అరికట్టఁబడెను. అట్టి, దురత్యయంబైన = తుదిలేనిదగు, తపంబు = తపస్సునుండి, నివర్తింపంజేసెదన్ = అతనిని మళ్లించెదను. వెఱవక = భయపడక, మీమీనివాసంబులకున్ = మీమీగృహములకు, చనుండు=నడువుఁడు. అని, ఆనతిచ్చినన్ = ఆజ్ఞాపించినతోడనే, ఆదేవతలు, నిర్భయాత్ములై = మనసున భయము లేనివారై, ఈశ్వరునకున్ = పరమేశునకు, ప్రణామం

కులు ఆచరించి = నమస్కారములొనర్చి, త్రివిష్టపంబునకున్ = స్వర్గము నకు, చనిరి = వెళ్లిరి. తదనంతరంబ = అనంతరమున.

తా. పరమేశునితో దేవత లట్లు మనవిచేయఁగాఁ బరమేశ్వరుఁడు వారి నూఱడించి యుత్తానపాదునికుమారుఁడు ఘోరతపస్సుచేయుటచే మీ కిట్లు శరీరచైతన్యములు తప్పినవి. నేను వాని నాతపస్సునుండి మళ్లింపఁజేసెద. మీరు భయపడక మీగృహముల కేగుఁడని యాజ్ఞాపింప, దేవతలు పరమేశు నకు ననేకవందనము లర్పించి నిర్భయముగా స్వర్గమున కేగిరి. ఆవెంటనే.

సీ. హరి యీశ్వరుండు విహంగకులేశ్వర
యానుఁడై నిజభృత్యుఁడైనధ్రువునిఁ
గనుఁగొను వేడుక జనియింప నామధు
వనమున కప్పుడు సని ధ్రువుండు
పరువడి యోగవిపాకతీవ్రంబైన
బుద్ధిచే నిజమనోంబురుహముకుళ
మందుఁ దటిత్ప్రభాయతమూర్తి యటఁ దిరో
ధానంబునను నొంది తత్క్షణంబ
తే. తనపురోభాగమందు నిల్చినను బూర్వ
సమధికజ్ఞాననయనగోచరసమగ్ర
మూర్తిఁ గనుఁగొని సంభ్రమమునను సమ్మ
దాశ్రుపులు రాలఁ బులకీకృతాంగుఁ డగుచు. 63

టీ: ఈశ్వరుండు = ప్రభువైన, హరి = విష్ణుమూర్తి, విహంగకులే శ్వరయానుఁడై = గరుడవాహనుఁడై, నిజభృత్యుఁడైన = తన్ను సేవించునట్టి, ధ్రువుని, కనుఁగొను వేడుక = చూచునట్టికోరిక, జనియింపన్ = పుట్టఁగా, ఆమధువనమునకు, అప్పుడు, చని = వెళ్లి, ధ్రువుండు, పరువడిన్ = క్రమ ముగా, యోగ = వాయునిరోధముయొక్క, విపాక = పరిపాకముచే

తీవ్రంబయిన = తీక్ష్ణమయిన, బుద్ధిచే, నిజమనోంబురుహముకుళమందుఁ = తామరమొగ్గవంటి తనహృదయమందు, తటిత్ = మెఱుపుయొక్క, ప్రభా = కాంతివలెనే, ఆయత = పొడవగు, మూర్తి = రూపము, అటఁ = అచ్చటను, తిరోధానంబునను = అంతర్ధానమును, ఒంది = చెంది, తత్క్షణంబ = ఆక్షణముననే, తనపురోభాగమందుఁ = తనముందట, నిల్చినను = నిలువఁగా, పూర్వ = ముందటికంటె, సమధిక = ఎక్కువయిన, జ్ఞాన = జ్ఞానమును, నయన = నేత్రమునకు, గోచర = విషయమయిన, సమగ్ర మూర్తిఁ = పూర్ణాకారమును, కనుఁగొని = చూచి, సంభ్రమమునను = తత్తరపాటుతో, సమ్మదాశ్రువులు = ఆనందబాష్పములు, రాలఁ = రాలఁగా, పులకీకృత = పులకరింపఁబడిన, అంగుఁడగుచు = అవయవములు కలవాఁడగుచును, వైవద్యముతో నన్వయము.

తా. అంతట గరుడవాహనారూఢుఁడై విష్ణువు ధ్రువునిఁ జూచు నుద్దేశమున మధువనమునకు విచ్చేసి ధ్రువునిముందట నిలువ, ధ్రువుఁడు యోగనిద్రలోనుండి కొంతవఱకుఁ దెలియకపోయినను, తుదకు సమ్మహావిష్ణువు, తన జ్ఞాననయనమునకు గోచరముకాఁగా గనులవిచ్చిచూచి యాపరమేశుని దర్శించి సంతోషబాష్పములు రాల నానందసముద్రమున మునిఁగినవాఁడై.

సాక్షాత్కరించినభగవంతుని ధ్రువుండు స్తుతించుట

తే. నయనముల విభుమూర్తిఁ బానంబుసేయు
పగిదిఁ దనముఖమునను జుంబనము సేయు
లీలఁ దగ భుజములను నాలింగనంబు
సేయుగతి దండనన్నమస్కృతు లొనర్చె. 64

టీ. నయనములఁ = నేత్రములచే, విభుమూర్తిఁ = విష్ణుమూర్తి రూపాకారమును, పానంబుసేయుపగిదిఁ = పానముచేయురీతిని, తనముఖమునను = తన మోముతో, చుంబనముసేయులీలఁ = ముద్దుపెట్టుకొనుతీరున,

తగఁక్ = ఒప్పునట్లు, భుజములను = బాహువులతో, ఆలింగనంబుసేయం గతిఁక్ = కౌఁగిలించురీతిగాను, దండవత్ = కఱ్ఱవలె, నమస్కృతు లొనర్చె = నమస్కారముల నొనర్చెను.

తా. అప్పుడా ధ్రువుఁడు తననేత్రములతో విష్ణుమూర్తియాకారమును బానముచేసెనో యనురీతిగాను, తనమోముతో ముద్దుపెట్టుకొనుచుండెనో యనునట్లుగాను, తనభుజములతో నాలింగనమొనర్చెనా యనునట్లుగాను కఱ్ఱవలెఁ జలింపక నమస్కారములఁ జేసెను.

వ. ఇట్లు దండప్రణామంబు లాచరించి కృతాంజలియై స్తోత్రంబు సేయ నిశ్చయించి స్తుతిక్రియాకరణసమర్థుండు గాకయున్న ధ్రువునకును సమస్తభూతంబులకు నంతర్యామి యైన యీశ్వరుం డాతనితలం పెఱింగి వేదమయం బయినతనశంఖంబుచేత నబ్బాలునికపోలతలం బంటిన జీవేశ్వరనిర్ణయజ్ఞుండును భక్తిభావనిష్ఠుండును నగుధ్రువుండు నిఖిలలోకవిఖ్యాతకీర్తిగలయీశ్వరుని భగవత్ప్రతిపాదితంబు లగుచు వేదాత్మకంబు లైనతనవాక్కుల నిట్లని స్తుతియించె దేవా నఖిలశక్తిధరుండవు నంతఃప్రవిష్టుండవు నైననీవు లీనంబు లైనమదీయవాక్యంబులం బ్రాణేంద్రియంబులం గరచరణశ్రవణత్వగాదులను జిచ్ఛక్తిచేఁ గృపఁజేసి జీవింపంజేసిన భగవంతుండవును బరమపురుషుండవును నైననీకు నమస్కరింతు నీవొక్కరుండ వయ్యు మహదాద్యం బైనయీయశేషవిశ్వంబు మాయాఖ్యంబయిన యాత్మీయశక్తిచేతం గల్పించి యందుం బ్రవేశించి యింద్రియంబులందు వసించుచుం దత్తద్దేవతారూపంబులచే నానాప్రకారంబుల దారువులందున్న వహ్నిచందంబునం బ్రకాశింతు వదియునుం గాక.

టీ. ఇట్లు = ఈవిధముగా, దండప్రణామంబులాచరించి = సాష్టాంగ నమస్కారములు చేసి, కృతాంజలియై = దోసిలిపట్టి, స్తోత్రంబుసేయ నిశ్చయించి = స్తుతింపఁదలఁచి, స్తుతిక్రియాకరణ సమర్థుండుఁగాకయున్న = స్తోత్రముచేయుటకు సామర్థ్యములేకయున్న, ధ్రువునకును, సమస్తభూతంబులకున్ = అన్నిప్రాణులకు, అంతర్యామియైన = లోపలసంచరించుచున్నట్టి, ఈశ్వరుండు, ఆతనితలంపెఱింగి = ధ్రువునియుద్దేశమును దెలిసికొని, వేదమయంబయిన = వేదరూపమయిన, తనశంఖంబుచేత, అబ్బాలుని కపోలతలంబు అంటినన్ = ఆధ్రువుని గండస్థలమును ముట్టినతోడనే, జీవేశ్వరనిర్ణయజ్ఞుండును = జీవేశ్వరుల నిర్ణయమును దెలిసినవాఁడును, భక్తిభావనిష్ఠుండును = భక్తియందు నిలుకడ కలవాఁడును, అగు = అగునట్టి, ధ్రువుండు, నిఖి...గల-నిఖిలలోక = సమస్తలోకములయందు, విఖ్యాత = ఖ్యాతిని జెందిన కీర్తిగల, ఈశ్వరుని = భగవంతుని, భగవత్ప్రతిపాదితంబులగు = ఆభగవంతునిచే ననుగ్రహింపఁబడిన, వేదాత్మకంబులైన = వేదస్వరూపములగు, తనవాక్కులన్ = తనవాక్యములచేత, ఇట్లని = ఈవిధముగా, స్తుతియించెన్ = స్తోత్రముచేసెను. దేవా! నిఖిలశక్తిధరుండవును = అన్ని సామర్థ్యములు కలవాఁడవును, అంతఃప్రవిష్టుండవును = అందఱిలోనఁ జొచ్చినవాఁడవును, ఐన నీవు, లీనంబులైన = నీయందుఁ జేరిన, మదీయ వాక్యంబులన్ = నాయొక్క మాటలను, ప్రాణేంద్రియంబులన్ = ప్రాణమును జ్ఞానేంద్రియములను, కర...దులను-కర = హస్తములు, చరణ = పాదములు, శ్రవణ = శ్రోత్రములు, త్వగాదులను = చర్మము మొదలగువానిని, చిచ్ఛక్తిచేన్ = జ్ఞానశక్తిచే, కృపఁజేసి = ఒసఁగి, జీవింపంజేసిన = బ్రతుకఁజేయునట్టి, భగవంతుండవును, పరమపురుషుండవును, ఐన, నీకు, నమస్కరింతు. నీవొక్కరుండవయ్యు = నీవొక్కఁడవుగనున్నను, మహదాద్యంబయిన = మహత్తత్త్వము మొదలగు, ఈఅశేషవిశ్వంబు = ఈకనఁబడుప్రపంచమునంతను, మాయాఖ్యంబయిన = మాయ యను పేరుగల, ఆత్మీయ శక్తిచేతన్ = తనసామర్థ్యముచేత,

కల్పించి = సృజించి, అందుఁ = ఆప్రపంచమునందు, ప్రవేశించి, ఇంద్రియంబులందుఁ = మనస్సు మొదలగువానియందు, వసించుచు, తత్తద్దేవతారూపంబులచేఁ = ఆయాదేవతల రూపములచే, నానాప్రకారంబులఁ = అనేకవిధములుగా, దారువులందున్న = కట్టెలయందున్నట్టి, వహ్నిచందంబునఁ = అగ్నివలె, ప్రకాశింతువు = ప్రకాశించెదవు. అదియునుంగాక = అంతమాత్రమేగాక.

తా. ఇట్లాబాలుఁడు చేతులు మొగిడ్చి యెదుటనున్న విష్ణుమూర్తిని స్తుతించుటకు నిశ్చయించియు, నట్లు స్తుతింపఁజాలకయున్న ధ్రువునిఁ బరమేశ్వరుఁడు తెలిసికొని తన వేదరూపమయిన శంఖమును ధ్రువునిగండస్థలమున నుంచినతోడనే, యాధ్రువుఁడు గొప్పజ్ఞానముగలవాఁడై వేదచోదితములగు వాక్యార్థములచే నాపరమేశుని నిత్తెఱఁగున స్తుతింపఁదొడఁగెను.

చ. వరమతి నార్తబాంధవ భవద్ఘనబోధసమేతుఁడై భవ
చ్చరణముఁ బొందినట్టివిధిసర్గము సుప్తజనుండు బోధమం
దరయఁగఁ జూచురీతిఁ గను నట్టిముముక్షుశరణ్యమైననీ
చరణములం గృతజ్ఞుఁ డగుసజ్జనుఁ డెట్లు తలంప కుండెడున్.

టీ. ఆర్తబాంధవ = దీనరక్షకుఁడా! వర = శ్రేష్ఠమయిన, మతిఁ = బుద్ధిని, భవ... మేతుఁడై-భవత్ = నీయొక్క, ఘన = గొప్పదైన, బోధ = జ్ఞానబోధతో, సమేతుఁడై = కూడినవాఁడై, భవచ్చరణముఁ బొందినట్టి = నీపాదపద్మమును సేవించునట్టి, విధిసర్గము = బ్రహ్మసృజించినయీలోకమును, సుప్తజనుండు = నిద్రించుచున్న మనిషి, బోధమందు = తెలివినొందఁగనే అరయఁగఁ = బాగుగ, చూచురీతిఁ = తెలిసికొనువిధమున, కనుఁ = చూచును. అట్టి ముముక్షు శరణ్యమైన = ఆలాటిమోక్షమును గోరువారికి రక్షకమయిన, నీచరణములఁ = నీపాదములను, కృతజ్ఞుఁడగు = కనికరగల, సజ్జనుఁడు = మంచివాఁడు, ఎట్లు = ఏవిధమున, తలంపకుండెడుఁ = తలంపకుండును?

తా. ఓదీనరక్షకా! బ్రహ్మచే సృష్టమైన యీసకలప్రపంచజనము నీ యనుగ్రహంబువలనఁ గలిగిన దివ్యజ్ఞానమునొంది, కలగన్నవాఁడు మేల్కాంచి యంతయు నెఱుఁగునట్లు, వాస్తవవస్తువు నెఱుఁగును. అట్టి భక్తులకు రక్షకుఁడవయిన నిన్నే పుణ్యాత్ముఁడు ధ్యానింపకుండును? కృతజ్ఞత గలయందఱును ధ్యానింతురు.

సీ. మహితాత్మ మఱి జన్మమరణప్రణాశన
        హేతుభూతుండవు నిద్ధకల్ప
    తరువవు నగునిన్నుఁ దగ నెవ్వ రే నేమి
        పూని నీమాయావిమోహితాత్మ
    లగుచు ధర్మార్థకామాదులకొఱకుఁ దా
        మర్చించుచును ద్రిగుణాభమైన
    దేహోపభోగ్యమై దీపించుసుఖముల
        నెనయంగ మదిలోన నెంతు రట్టి
తే. విషయసంబంధజన్యమై వెలయుసుఖము
    వారికి నిరయమందును వఱలు దేవ
    భూరిసంసారతాపనివారగుణక
    థామృతాపూర్ణ యీశ మాధవ ముకుంద. 67

టీ. మహిత ఆత్మ = కొనియాడఁదగిన అంతఃకరణము కలవాఁడా! మఱి, జన్మ...తుండవు - జన్మ = పుట్టుకకును, మరణ = మృతికిని, ప్రణాశన = నాశనమునకు, హేతుభూతుండవు = కారణమైనవాఁడవు, ఇద్ధ = పెద్దదైన, కల్పతరువవు = కల్పవృక్షమువంటివాఁడవు, అగు, నిన్నున్, తగన్, ఎవ్వరేనేమి = ఎవరైననేమి, పూని = ప్రయత్నముతో, నీమాయా... లగుచు - నీ = నీయొక్క, మాయా = మాయచేతను, విమోహిత = మోహపెట్టఁబడిన, ఆత్మలగుచున్ = అంతఃకరణముకలవారగుచు, ధర్మార్థ

కామాదులకొఱకున్ = ధర్మము అర్థము కామము మొదలగువానికై, తాము, అర్చించుచును = పూజించుచును, త్రిగు ..మై-త్రిగుణ=సత్త్వరజస్తమోగుణములతో, ఆఢ్యమైన = ప్రకాశించుచున్న, దేహ=దేహముచే, ఉపభోగ్యమై= భోగింపఁదగినదై, దీపించు=ప్రకాశించు, సుఖములను, ఎనయంగన్ = అనుభవించుటకు, మదిలోనన్ = మనస్సునందు, ఎంతురు = ఎంచెదరో, అట్టి, విషయసంబంధజన్యమై = ఐహికభోగములవలనఁ బుట్టి, వెలయుం=ప్రకాశించు, సుఖము, వారికిన్=అట్లుకోరువారికి, నిరయమందును = నరకమునందును, దేవ= దేవుఁడా! భూరి ..పూర్ణ-భూరి = విస్తారమయిన, సంసార=సంసారమునందలి, తాప = తాపమును, నివార = నివారణచేయు, గుణకథా = గుణకథలనెడు, అమృత=అమృతముతో, ఆపూర్ణ=అంతటనిండినవాఁడా! ఈశ! మాధవ! ముకుంద! వఱలును=కలుగును.

తా. ధ్రువుఁడు, విష్ణుని స్తుతిచేయుచున్నాఁడు:—ఓదేవుఁడా! ఎంత గొప్పవారయినను నీమాయకు లోఁబడినవారై, ధర్మార్థకామాదులమాత్రమే కోరుచు సత్త్వరజస్తమోగుణస్వరూపమైన యీశరీరసౌఖ్యములను కోరుచు, సృష్టిస్థితిలయములకు హేతుభూతుఁడవై, వాంఛలఁ దీర్చుటకుఁ గల్పవృక్షమైనవాఁడవును, సంసారతాపత్రయనివారకుఁడవు నగు నిన్ను నుతింపక శరీరము నిత్యమని తలంచుచుందురు. వారికిఁ దుదకు నరకమే వాటిల్లును.

మ. అరవిందోదర తావకీనచరణధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణనజాతభూరిసుఖముల్ స్వానందకబ్రహ్మమం
దరయన్ లే వఁట దండభృద్భటవిమానాకీర్ణులై కూలునా
సురలోకస్థులఁ జెప్ప నేల సుజనస్తోమైకచింతామణీ. 69

టీ. అరవిందోదర = ఓవిష్ణుదేవుఁడా! తావ . సుఖముల్ - తావకీన=నీసంబంధమయిన, చరణ=పాదములయొక్క, ధ్యాన = ధ్యానమునందలి, అనురాగ = ప్రేమతో, ఉల్లసత్ = ప్రకాశించునట్టి, చరిత = చరిత్రము

యొక్క, ఆకర్ణన = వినుటచే, జాత = పుట్టిన, భూరి = విస్తారమయిన సుఖముల్ = సుఖములు, స్వానందక బ్రహ్మానందుర్ =క స్వానందింపఁజేయు పరబ్రహ్మమునందుర్, అరయక్ =విచారింపఁగా, లేవఁట, సుజన=సత్పురుషుల యొక్క, స్తోమ = సమూహమునకు, ఏకచింతామణీ = ముఖ్యమైనవాఁడా! దండ...కీర్ణులై-దండభృత్ =యమునియొక్క, భట=భటులయొక్క, విమాన = విమానమునందు, ఆకీర్ణులై = ఈడ్వఁబడి, కూలు = పడిపోవునట్టి (నరకమును జెందునట్టి), అసురలోకస్థులక్ =రాక్షసలోకములనుండు వారింగుఱించి, చెప్ప, నేల = చెప్పనవసరము లేదు.

తా. ఓపద్మగర్భుఁడా! నీపాదపద్మధ్యానమునందలియనురాగముచేతఁ బ్రకాశించుచరిత్రలు వినుటచేఁ గలిగిన గొప్పసుఖములు, స్వానందక బ్రహ్మమందుఁ గూడ లేవుసుమా. వారిసంగతి యిట్లుండ, ఇఁక యమభటుల విమానము లెక్కి యధోగతికిఁ బోవురాక్షసులగతి చెప్పఁబని లేదు.

చ. హరి భజనీయమార్గ నియతాత్మకులై భవదీయమూర్తిపై
వఱలినభక్తియుక్తులగువారలసంగతిఁ గల్గఁజేయుస
త్పురుషసుసంగతిక్ వ్యసనదుస్తరసాగర మప్రయత్నతక్
సరసభవత్కథామృతరసంబున మత్తుఁడనై తరించెదన్. 69

టీ. హరి = విష్ణుఁడా! భజనీ...త్మకులై-భజనీయ = సేవింపఁదగిన, మార్గ = దారియందు, నియత = నిలుపఁబడిన, ఆత్మకులై = మనస్సుగలవారయి, భవదీయమూర్తిపై = నీరూపమునందు, వఱలిన = ప్రకాశించిన, భక్తియుక్తులగువారల సంగతిక్ = భక్తిగలిగినవారితో సాంగత్యమును, కల్గఁజేయు, సత్పురుషసుసంగతిక్ = సజ్జనులతోడి చేరికచే, వ్యసన దుస్తర సాగరము = సంసారవ్యసనములనెడి దాఁటరాని సముద్రమును, అప్రయత్నతక్ =ప్రయత్నము లేకయే, సరస = రసవంతములయిన, భవత్ = నీయొక్క, కథామృతరసంబునక్ = కథలనెడు నమృతపురసముచే, మత్తుఁడనై = మదించినవాఁడనై, తరించెదక్ = దాఁటెదను.

తా. ఓవిష్ణుఁడా ! నిన్నుభజించుమార్గమునందు మనసు నిలిపి నీరూప
మును దెలిసికొనిన భక్తులసాంగత్యము నొందించు సత్పురుషసాంగత్యము
వలన సంసార మనుసముద్రమును నీకథామృతరస మనునావచేత దాఁటి
మోక్షము నొందెదను.

చ. నిరతముఁ దావకీనభజనీయపదాబ్జసుగంధలుబ్ధులై, య్వరి
మది వొందఁగాఁ గలుగు వారలు తత్ప్రియమర్త్యదేహ
ముఁ, అరయఁ దదీయదారతనయాదిసుహృద్గృహబంధు
వర్గముఁ, మఱతురు విశ్వతోముఖ! రమా! హృదయేశ!
ముకుంద! మాధవా! 70

టీ. విశ్వతోముఖ = అంతట వ్యాపించినవాఁడా! రమాహృదయేశ =
లక్ష్మికి భర్తయైనవాఁడా ! ఓముకుంద ! ఓమాధవా ! నిరతముఁ = ఎల్లప్పుడు,
తావ...లుబ్ధులు - తావకీన = నీసంబంధమగు, భజనీయ = పొందఁదగిన,
పదాబ్జ = పాదపద్మములయొక్క, సుగంధ = పరిమళమునందు, లుబ్ధులు =
ఆసక్తులు, ఎవ్వరిమది = ఎవరియొక్క మనస్సు, పొందఁగాఁగలుగుఁ =
పొందుటకుఁ గోరునో, వారలు, తత్ప్రియ = వారలకిష్టమైన, మర్త్యదేహ
ముఁ = మానవదేహమును, అరయుఁ = ఆలోచింపఁగా, తదీ ..ర్గముఁ -
తదీయ=వారి, దార = భార్యలను, తనయాది = బిడ్డలు మొదలగువారిని,
సుహృత్ = స్నేహితులను, గృహ=గృహములను, బంధువర్గముఁ = బంధు
వులను, మఱతురు = మఱచిపోవుదురు.

తా. ధ్రువుఁడు పరమేశుని స్తుతించుచున్నాఁడు:—ఓ పరమేశ్వ
రుఁడా! ఎల్లప్పుడును నీపాదపద్మములనే సేవించుపురుషులు ఆపాదపద్మముల
మకరందాస్వాదాతిశయమున తమదేహమును, భార్యలను, పిల్లలను, గృహమును,
స్నేహితులను, బంధువులను గూడ మఱచిపోవుదురు

సీ. పరమాత్మ మర్త్యసుపర్వతిర్యఙ్మృగ
దితిజసరీసృపద్విజగణాది

సంవ్యాప్తమును సదసద్విశేషంబును
గైకొని మహదాదికారణంబు
నైనవిరాడ్విగ్రహంబు నే నెఱుఁగుదుఁ
గాని తక్కినసుమంగళము నైన
సంతతసుమహితైశ్వర్యరూపంబును
భూరిశబ్దాదివ్యాపారశూన్య
తే. మైనబ్రహ్మస్వరూప మే నాత్మ నెఱుఁగఁ
బ్రవిమలాకార సంసారభయవిదూర
పరమమునిగేయ సంతతభాగధేయ
నలిననేత్ర రమాలలనాకళత్ర. 71

టీ. ప్రవిమల ఆకార = మిక్కిలి నిర్మలమైనరూపముకలవాఁడా! సంసార భయవిదూర = సంసార దుఃఖము నశింపఁజేయువాఁడా! పరమ ముని గేయ = గొప్పమునులచే గానముచేయఁదగినవాఁడా! సంత... ధేయ - సంతత=నిత్యమైన, భాగధేయ = అదృష్టముకలవాఁడా! నలిననేత్ర = పద్మములవంటి కన్నులుగలవాఁడా! రమాలలనాకళత్ర-రమా=లక్ష్మియనెడి, లలనా= స్త్రీ, కళత్ర=భార్యగాఁగలవాఁడా! పరమాత్మ = పరమేశ్వరుఁడా! మర్త్య... వ్యాప్తమున్ - మర్త్య = మనుష్యులు, సుపర్వ = దేవతలు, తిర్యక్ మృగ= పశుపక్ష్యాదిజంతువులు, దితిజ=రాక్షసులు, సరీసృప = పాములు, ద్విజగణ = పక్షులగుంపులు, ఆది = మొదలగువానియందు, సంవ్యాప్తమును = బాగుగ వ్యాపించిన, సత్ = స్థిరమైనట్టియు, అసత్ = అస్థిర మయినట్టిదియునగు, విశేషంబును కైకొని = అవస్థలను పూని, మహదాది = మహత్తు మొదలగు వానికి, కారణంబునైన = కారణమయిన, విరాడ్విగ్రహంబు = విరాడ్రూప మును, నే నెఱుఁగుదు, కాని, తక్కిన = విరాడ్రూపమునకంటె మించిన, సుమంగళమునైన = మిక్కిలి మేలయిన, సంతత...రూపంబును-సంతత = నిత్య

ముగానున్న, మహిత = కొనియాడఁబడు, ఐశ్వర్యరూపంబును = అష్టైశ్వర్య రూపమయినదియు, భూరి...శూన్యమైన-భూరి = విస్తారమగు, శబ్దాది = శబ్దము స్పర్శము మొదలగు, వ్యాపార = క్రియలచే, శూన్యమైన=లేనట్టి, బ్రహ్మస్వరూపము=బ్రహ్మస్వరూపమును, ఏను, ఆత్మన్=మనసునందు, ఎఱుఁగను = తెలియను.

తా. ధ్రువుఁడు పరమేశుని స్తుతించుచున్నాఁడు:—నిర్మలాకారుఁడా! సంసారభయముఁ బోఁగొట్టువాఁడా! గొప్పమునులచేఁ కీర్తింపఁబడువాఁడా! యిష్టము నెడతెగకపొందువాఁడా! కమలాక్షుఁడా! లక్ష్మీవల్లభా! ఓపరమాత్మ స్వరూపుఁడా! మనుష్యులు, దేవతలు, పశుపక్ష్యాదులు, రాక్షసులు, సర్పములు పక్షిసమూహములు మొదలగువానిచే నిండినట్టియు, నిత్యానిత్య వస్తురూపము లందుఁజొచ్చి మహాదాదికారణమునగు నాదివిరాడ్విగ్రహమును మాత్రమే యే నెఱుఁగుదును. కాని నిత్యైశ్వర్యరూపమైనదియు, విస్తారమగు శబ్దాది వ్యాపార రహితమునైన పరబ్రహ్మస్వరూపము నాకుఁ దెలియదు.

సీ. సర్వేశ కల్పాంతసమయంబునందు నీ
యఖిలప్రపంచంబు నాహరించి
యనయంబు శేషసహాయుండ వై శేష
పర్యంకతలమునఁ బవ్వళించి
యోగనిద్రారతి నుండి నాభీసింధు
జస్వర్ణలోకకంజాతగర్భ
మందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు
రుచి నొప్పు బ్రహ్మస్వరూపి వైన
తే. నీకు మ్రొక్కెద నత్యంతనియమ మొప్ప
భవ్యచారిత్ర పంకజపత్రనేత్ర

చిరశుభా కార నిత్యలక్ష్మీవిహార
యవ్యయానంద గోవింద హరి ముకుంద. 72

టీ. భవ్యచారిత్ర=మంగళప్రదమైన చరిత్రముగలవాఁడా! పంకజపత్ర నేత్ర = పద్మపురేకులవంటి నేత్రములుగలవాఁడా! చిర...కార-చిర= నిత్యమై, శుభ = మంగళమైన, ఆకార = రూపముగలవాఁడా! నిత్య... హార-నిత్య = ఎల్లపుడును, లక్ష్మీ = లక్ష్మితో, విహార = విహరించువాఁడా! అవ్యయ ఆనంద = నాశరహితమయిన సంతోషముకలవాఁడా! గోవింద! హరి! ముకుంద! సర్వేశ = అన్నింటికిఁ బ్రభువా! కల్పాంతసమయంబునందు, ఈ, అఖిల ప్రపంచంబును = సమస్తమయిన ప్రపంచంబును, ఆహరించి = నశింపఁజేసి, అనయంబు=ఎల్లపుడును, శేషసహాయుండవై =భక్తులకు తోడ్పడువాఁడవై, శేషపర్యంకతలమునన్ =ఆదిశేషరూపమైన పానుపునందు, పవ్వళించి = నిద్రించి, యోగనిద్రారతినుండి = యోగనిద్రయందలి యాసక్తితో నుండి, నాభీ...మందున్ = నాభీసింధుజ = నాభీసముద్రమునుండి పుట్టిన స్వర్ణలోక = సువర్ణమయమగు, కంజాత = పద్మము నెడు, గర్భమందు = లోపలను, చతుర్ముఖున్ = బ్రహ్మదేవుని, పుట్టించుచు, రుచినొప్పు = ప్రకాశించుచున్న, బ్రహ్మస్వరూపివైన = పరబ్రహ్మస్వరూపమును దాల్చిన, నీకు, అత్యంత = మిక్కిలి, నియమము ఒప్పన్ = నియమముతో, మ్రొక్కెదను = నమస్కరించెదను.

తా. ధ్రువుఁడు పరమేశుని స్తుతించుచున్నాఁడు:—ఓపరమేశ్వరుఁడా! కల్పాంతమున సమస్తప్రపంచమును నశింపఁజేసి యెల్లపుడును శేషపాన్పుపైని పవ్వళించి శేషమాత్రసహాయుఁడవై యోగనిద్రాసక్తిచే నీయొక్క నాభియను సముద్రమునుండి యుదయించిన బంగారుపద్మమునుండి బ్రహ్మను బుట్టించుచు మిక్కిలి ప్రకాశమానుఁడవైనట్టియుం బరబ్రహ్మస్వరూపమును దాల్చినట్టి నీకు భక్తియుక్తముగా నమస్కారము లొనరించుచున్నాను.

వ. అట్లు యోగనిద్రాపరవశుండ వయ్యును జీవులకంటె నత్యంత విలక్షణుండవై యుండుదు వదియె ట్లనిన బుద్ధ్యవస్థానభేదం బున నఖండితం బయి స్వశక్తిం జేసి చూచులోకపాలననిమి త్తంబు యజ్ఞాధిష్ఠాతవు గావున నీవు నిత్యముక్తుండవును బరి శుద్ధుండవును సర్వజ్ఞుండవును నాత్మవును గూటస్థుండవును నాదిపురుషుండవును భగవంతుండవును గుణత్రయాధీశ్వ రుండవును నై వర్తింతువు భాగ్యహీనుం డైనజీవునియందు నీగుణంబులు గలుగ వే సర్వేశ్వరునం దేమి విరుద్ధగతులై వివిధశక్తి యుక్తంబులై నయవిద్యాదు లానుపూర్వ్యంబునం జేసి ప్రలీనంబులగు చుండు నట్టివిశ్వకారణంబు నేకంబు ననం తంబు నాద్యంబు నానందమాత్రంబు నవికారంబు నగు బ్రహ్మంబునకు నమస్కరించెద. మఱియు, దేవా! నీవ సర్వవిధి ఫలం బని చింతించునిష్కాము లయినవారికి రాజ్యాది కామితంబులలోనఁ బరమార్థంబయిన ఫలంబు సర్వార్థ రూపుండవైన భవదీయపాదపద్మముసేవనంబ యిట్లు నిశ్చి తంబయ్యెనను సకాము లైనదీనులను గోవు వత్సంబును స్తన్య పానంబు సేయించుచు వృకాదిభయంబువలన రక్షించు చందంబునం గామప్రదుండవై సంసారభయంబువలనఁ గాపుదువని యిట్లు సత్యసంకల్పుండును సుజ్ఞానియు నయిన ధ్రువునిచేత వినుతింపంబడి భృత్యానురక్తుం డైనభగవం తుండు సంతుష్టాంతరంగుండై యి ట్లనియె. 73

టీ. అట్లు, యోగనిద్రాపరవశుండవయ్యును = యోగనిద్రకు లోను వడైయున్నను, జీవులకంటెన్ = జీవాత్మలకంటె, అత్యంతవిలక్షణుండవై =

మిక్కిలి కోటియై, ఉండుదువు. అది, ఎట్లనిన, బుద్ధి=బుద్ధియొక్క, అవస్థాన భేదంబునన్ =స్థితిభేదముచే, అఖండితంబయి = నిత్యమై, స్వశక్తిం జేసి = తనశక్తిచేత, చూచు, లోకపాలన నిమిత్తంబు = లోకరక్షణనిమిత్తము, యజ్ఞాధిష్ఠాతవు = యజ్ఞమున కధిదైవతమవు, కావునన్ = కాఁబట్టి, నీవు, నిత్యముక్తుండవును=నిత్యము మోక్షమునొందినవాఁడవు, పరిశుద్ధుండవును, సర్వజ్ఞుండవును, ఆత్మవును = పరమాత్మవును, కూటస్థుండవును = కూటస్థ పురుషుండవును, ఆదిపురుషుండవును, భగవంతుఁడవును=షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవును, గుణత్రయ = సత్వరజస్తమోగుణములకు, అధీశ్వరుండవును = ప్రభువవును, ఐ, వర్తింతువు = ఉందువు. భాగ్యహీనుండైన = అదృష్టము లేని, జీవునియందు, ఈగుణంబులు, కలుగవు = ప్రసరింపనేరవు. సర్వేశ్వరునందు, ఏమి=ఎంతమాత్రము, విరుద్ధ = విరుద్ధమయిన, గతులై=గమనములు కలిగి, వివిధ...యుక్తంబులైన - వివిధ=నానావిధమైన, శక్తి=శక్తులతో, యుక్తములైన=కూడినట్టి, అవిద్యాదులు = అజ్ఞానము మొదలగునవి, ఆనుపూర్వ్యంబునం జేసి=వరుసగా, ప్రలీనంబులగుచుండును=నశించుచుండును. అట్టి విశ్వకారణంబును=ప్రపంచమునకు హేతువైన, ఏకంబున్ =ఒక్కఁడైన, ఆద్యంబును=మొదటిదియును, ఆనందమాత్రంబును = ఆనందస్వరూపంబును, అవికారంబును = మార్పుల నొందనిదియునైన, బ్రహ్మంబునకున్ =పరమాత్మకు, నమస్కరించెద, మఱియును, దేవా! నీవ=నీవే, సర్వవిధఫలంబు=సమస్తవిధమైన ప్రయోజనమని, చింతించు నిష్కాములైన వారికిన్ = తలంచునట్టి కోరికలు లేనివారికి, రాజ్యాదికామితంబులలోనన్ = రాజ్యము మొదలగుకోరికలలో, పరమార్థంబయిన ఫలము. సర్వార్థరూపుండవయిన, భవత్ =నీ పాదపద్మ = పాదపద్మములయొక్క, సేవనంబ = సేవయే, ఇట్లు, నిశ్చితంబయినను= నిరూపింపఁబడియున్నను, సకాములైన=కోరికగలిగినవారైన, దీనులను=మూఢులను, గోవు, వత్సంబును=దూడను, స్తన్యపానంబు చేయించుచున్ = పాలిచ్చుచు, వృకాది=తోఁడేళ్లు మొదలగుజంతువులవలని, భయంబువలన, రక్షించుచందంబునన్ =కాపాడువిధమున, కామప్రదుండవై=కోరికలనిచ్చుచు, సంసారభయం

ఋవలనక్ = సంసారభయమునుండి, పాపుదువు = తొలఁగింతువు. అని, ఇట్లు = ఈవిధమున, సత్య...ల్పుండును - సత్య = తప్పని, సంకల్పుండును = కోరికలు గలవాఁడును, సుజ్ఞానియుం = మంచిజ్ఞానముగలవాఁడును, అయిన, ధ్రువునిచే, వినుతింపంబడి = స్తోత్రముచేయఁబడి, భృత్య అనురక్తుండయిన = సేవకులయందు అనురాగముగల, భగవంతుఁడు, సంతుష్ట అంతరంగుండై = సంతసించిన మనస్సుకలవాఁడై, ఇట్లు = ఈచెప్పఁబోవురీతిని, అనియెక్ = పలికెను.

తా. ధ్రువుఁడు పరమేశుని వర్ణించుచున్నాఁడు:— అవిధముగ యోగనిద్రాపరవశుఁడవైనను జీవులకంటె వేఱుగా బుద్ధియొక్క స్థితిభేదము వలన, నీయొక్క మహిమచే లోకరక్షణార్థమై యజ్ఞమున కధీశ్వరుఁడవయితివి. కావున నిత్యముక్తుఁడవును కూటస్థపురుషుఁడవును నాదిపురుషుఁడవును నయిన నీవు సత్త్వాదిగుణత్రయమును ధిక్కరించియున్నావు. అదృష్టహీనునికి నీగుణకథనమెంతమాత్రమును సంభవింపవు. సర్వేశ్వరుఁడవైన నీకు విరుద్ధమయిన యనేకవిధములయిన శక్తులుగల యజ్ఞానాదులను నశింపఁజేయుచున్నట్టియుఁ, బ్రపంచమునకు ముఖ్యకారణమగునదియుం, నంతము లేనిదియుం, మొదటిదియుం, నానందస్వరూపమయినదియుం, వికారములు లేనిదియుం నగు నీపరబ్రహ్మస్వరూపమును నమస్కరించుచున్నాను. ఇంకను, నీవే సర్వవస్తువులకు ఫలమవని చింతించువారికి రాజ్యాదులకంటె గొప్పది నీపాదసేవయేగదా. ఇట్లయినను నీవు సకాములైనవారికి, గోవు తనదూడకుఁ బాలిచ్చి తోడేళ్లు మొదలగువానిభయంబువలన రక్షించుచున్నట్లు కోరికల నిచ్చి రక్షించుచున్నావు. ఈవిధమున స్తోత్రముచేయుచున్న ధ్రువునిఁజూచి సంతసించి పరమేశ్వరుఁడు ధ్రువునితో నిట్లు చెప్పెను.

క. ధీరవ్రత రాజన్యకు
మారక నీహృదయమందు మసలినకార్యం

బారూఢిగా నెఱుంగుదు
నారయ నది పొందరాని దైనను నిత్తున్. 74

టీ. ధీరవ్రత రాజన్యకుమారక = వ్రతమునుండి యించుకయుఁ దొలఁగని యోరాజపుత్త్రుఁడవగుధ్రువుఁడా! నీహృదయమందున్ = నీమనస్సునందు, మసలిన = ఉన్నట్టి, కార్యంబు, ఆరూఢిగా = నిశ్చయముగా, ఎఱుంగుదు = ఎఱుఁగుదును. ఆరయన్ = ఆలోచించగా, అది, పొందరానిదైనను = పొందుటకు వీలుకానిదైనను, ఇత్తున్ = ఇచ్చెదను.

తా. భగవంతుఁడు ధ్రువునితో నిట్లుచెప్పుచున్నాఁడు:—కఠినవ్రతముగలరాజపుత్త్రుఁడ వయిన యోధ్రువుఁడా! నీమనమునఁ గొట్లాడుచున్న విషయము నెఱుఁగుదును. అది యితరులకు వచ్చునది కాకపోయినను, దాని నీ కిచ్చుచున్నాను.

వ. అది యెట్టిదనిన నెందేని మేదినియందుఁ బరిభ్రామ్యమాణ గోచక్రంబునుబోలె గ్రహనక్షత్రతారాగణజ్యోతిశ్చక్రంబు నక్షత్రరూపంబు లయినధర్మాగ్నికశ్యపశక్రులును సప్తర్షులును దారకాసమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుండుదు రట్టి దురాపంబును నన్యాధిష్ఠితంబును లోకత్రయప్రళయకాలంబునందు నశ్వరంబు గాక ప్రకాశమానంబును నయిన ధ్రువక్షితి యనుపదంబు ముంచట నిరువదియాఱువేలేండ్లు సనం బ్రాపింతువు తత్పదప్రాప్తిపర్యంతంబు భవదీయజనకుండు వనవాసగతుం డైనం దద్రాజ్యంబు పూజ్యంబుగా ధర్మమార్గంబున జితేంద్రియుండవై చేయుదువు భవదనుజుం డగునుత్తముండు మృగయార్థంబు వనంబునకుం జని మృతుం డగుఁ దదన్వేషణార్థంబు తదాహితచిత్తయై తన్మాత

యు వనంబునకుం జని యందు దావదహననిమగ్న యగు
వెండియు. 75

టీ. అది = నీవుగోరుచున్నవిషయము, ఎట్టిదనినన్ = ఎటువంటి దనఁగా, ఎందేనిన్ = ప్రతివస్తువునందును, మేదినియందున్ = జ్ఞానియందు, పరి...చక్రంబునుంబోలె-పరిభ్రామ్యమాణ = తిరుగుచున్న, గోచక్రంబునుం బోలె = భూచక్రమువలె, గ్రహ...చక్రంబు - గ్రహ = గ్రహములును, నక్షత్ర = నక్షత్రములును, తారాగణ = ఇతరనక్షత్రములును, జ్యోతిశ్చక్రంబు = దిక్కులసమూహము, నక్షత్రరూపంబు లయిన = నక్షత్ర రూపమును దాల్చిన, ధర్మాగ్ని కశ్యప శక్రులును = యముఁడు, అగ్ని, కశ్యపుఁడు, ఇంద్రుఁడును, సప్తఋషులును, తారకాసమేతులై = నక్షత్రములతోఁగూడి, ప్రదక్షిణంబు దిరుగుచుందురు = ప్రదక్షిణము చేయుచుందురు. అట్టి = ఆవిధమయిన, దురాపంబును = పొందుటకు శక్యము కానిదియుం, అనన్యాధిష్ఠితంబును = ఇతరు లధిష్ఠింపఁగూడనిదియుం, లోక...శ్వరంబుగాక - లోకత్రయ = భూ పాతాళ స్వర్గలోకములు నశించుకాలంబునందు, నశ్వరంబుగాక = నశింపక, ప్రకాశమానంబును, అయిన, ధ్రువక్షితి యను, పదంబు=స్థానమును, ముందట = మొదట, ఇరువదియాఱు వేలేండ్లు చనన్ = ఇరువదియాఱువేలసంవత్సరములకు, ప్రాపింతువు = పొందెదవు. తత్పద = ఆపదముయొక్క, ప్రాప్తిపర్యంతము, భవదీయ జనకుండు = నీతండ్రియైనయుత్తానపాదుఁడు, వనవాసగతుండైనన్ = వనవాసమును బొందినను, తద్రాజ్యంబు, పూజ్యంబుగా, ధర్మమార్గంబునన్ = ధర్మమార్గముతో, జితేంద్రియుండవై, చేయుచుందువు. భవత్ = నీయొక్క, అనుజుండగు = తమ్ముఁడగు, ఉత్తముఁడు, మృగయార్థంబు=వేఁటకై, వనంబునకు, జని, మృతుండగున్ = చచ్చిపోవును. తత్ =ఆయుత్తముని, అన్వేషణార్థము = వెదకుటకు, తత్ = ఆయుత్తమునియందు, అహిత = కూర్చఁబడిన, చిత్తయై = మనసుకలదై, తన్మాతయుఁన్ = ఆయుత్తమునితల్లియును

వనంబునకుం జని, అందు, దావ...నిమగ్న - దావ దహన = కాఱుచిచ్చు నందు, నిమగ్న = మునిఁగినది, అగును, వెండియుం.

తా. ఓధ్రువుఁడా! నీవుకోరినపదము జ్ఞానినగునాయందు, నవగ్రహ ములు, నిరువదియేడునక్షత్రములు, నితరనక్షత్రములుఁ గూడఁ గలిగినట్టి, భూచక్రమువలె నక్షత్రరూపులైన ధర్మాగ్నికశ్యపశక్రులు, సప్తర్షులును నక్షత్రములఁగూడి తిరుగు చుందురుగాన నటువంటిదియు సామాన్యుల కంద రానిదియుం నెల్లప్పుడును నశింపక నిత్యముగాఁ బ్రకాశించు ధ్రువక్షితి యను పేరుగల పదమువద్ద నీ విరువదియాఱువేలయేం డ్లుండి తత్పదప్రాప్తిపర్యంత మున తండ్రి వనములోనున్నను దద్రాజ్యమును జితేంద్రియుండవైన నీవే పాలించెదవు. నీతమ్ముఁడగు నుత్తముఁ డనువాఁడు వేఁటకై యడవికిఁ బోయి, యచ్చట మృతినొందును. అట్టికుఱ్ఱవాని వెదకుటకు వానితల్లియగు సురుచి మిక్కిలి దుఃఖముతో నావనమును బ్రవేశించి, యందుఁ గాఱుచిచ్చునఁ బడి మృతినొందును.

సీ. అనఘాత్మ మఱి నీవు యజ్ఞరూపుం డనఁ
దగునన్ను సంపూర్ణ దక్షిణంబు
లగుమఖంబులచేత నర్చించి సత్యంబు
లగునిహాసౌఖ్యంబు లనుభవించి
యంత్యకాలమున న న్నాత్మఁ దలంచుచు
మఱి సర్వలోకనమస్కృతమును
మహిఁ బునరావృత్తిరహితంబు సప్తర్షి
మండలోన్నత మగుమామకీన

తే. పదము దగఁ బొందఁ గల వని పరమపురుషుఁ
డతనియభిలషితార్థంబు లర్థి నిచ్చి

యతఁడు గనుఁగొనుచుండంగ నాత్మపురికి
గరుడగమనుఁడు వేంచేసెఁ గౌతుకమున. 76

టీ. అనఘ ఆత్మ=నుంచి అంతఃకరణముకలవాఁడా! మఱి, యజ్ఞరూపుండనఁదగు, నన్ను, సం...ణంబులు-సంపూర్ణ=నిండు, దక్షిణంబులు=దక్షిణలుకలిగిన, మఖంబులచేతన్ = యజ్ఞములచే, అర్చించి=పూజించి, సత్యంబులగు, ఇహసౌఖ్యంబులు అనుభవించి = ఇహలోకసుఖములనుపొంది, అంత్యకాలమునన్=తుదను, నన్నున్, ఆత్మన్=మనస్సులో, తలంచుచు, మఱిన్ = మఱియు, సర్వ...తమును - సర్వలోక = సమస్తలోకములచేత, నమస్కృతమును = నమస్కరింపఁబడునదియు, మహిన్ = భూమియందు, పునరావృత్తిరహితంబు = పునర్జన్మములేనిది, సప్తర్షి = కశ్యపాది సప్తర్షులయొక్క, మండల=మండలములచేత, ఉన్నతమగు, మామకీన పదము = నాస్థానమును, తగన్ = ఒప్పునట్లుగా, పొందఁగలవు. అని = ఈవిధమున, పరమపురుషుఁడు, అతని అభిలషితార్థంబులు=ఆధ్రువుని కోరికలను, అర్థిన్ = ప్రీతితో, ఇచ్చి, అతఁడు, కనుఁగొనుచుండంగన్ = చూచుచుండఁగనే, ఆత్మపురికిన్=తనపట్టణమునకు, కౌతుకమునన్ = వేడుకతో, వేంచేసెన్ = వెళ్లిపోయెను.

తా. పరమేశ్వరుఁడు తన్ను పూజింపుమని ధ్రువునితోఁ జెప్పి తనపురమున కేఁగుచున్నాఁడు. ధ్రువుఁడా! యజ్ఞరూపినైన నన్ను సంపూర్ణ దక్షిణలుగల యజ్ఞములచేఁ బూజించి యిహలోకమునందలి సౌఖ్యము లనుభవించి యనంతరమునఁ బునర్జన్మరహితమును, సప్తర్షిమండలముకంటె నున్నతమయిన నాపదము నొందఁగలవని యాధ్రువునితోఁ జెప్పి వానికిఁ గావలసిన కోరికలనిచ్చి పరమేశ్వరుఁడు ఆధ్రువుని సమ్ముఖమునుండి స్వపురి కేగెను.

తే. అంత ధ్రువుఁడును బంకేరుహాక్షుపాద
కమలసేవోపపాదితఘనమనోర

థములఁ దనరియుఁ దనదుచిత్తంబులోనఁ
దుష్టిఁ బొందక చనియె విశిష్టచరిత. 77

టీ. విశిష్ట = గొప్ప, చరిత = చరిత్రముగలవాఁడా! అంతన్ = ఆపైని, ధ్రువుఁడును, పంకేరుహాక్షు = విష్ణువుయొక్క, పాదకమలసేవా = పాదపద్మములసేవచేత, ఉపపాదిత = కలిగింపఁబడిన, ఘనమనోరథములన్ = గొప్పకోరికలతో, తనరియుం = ఒప్పియుండియుం, తనదు చిత్తంబులోనన్ = తన మనస్సునందు, తుష్టిఁబొందక = తనివిఁజెందక, చనియెన్ = వెళ్లిపోయెను.

తా. పరమేశ్వరుఁ డట్లు వెళ్లిపోయినతరువాత నాధ్రువుఁడు హరిసేవఁ జేసి తనయభీష్టములను జెందియుం, వానితోఁ దృప్తిని జెందకయే వెళ్లిపోయెను.

క. అని మైత్రేయుఁడు ధ్రువుఁ డ
ట్లనయము హరిచేఁ గృతార్థుఁ డైనవిధం బె
ల్లను వినిపించిన విదురుఁడు
విని మునివరుఁ జూచి పలికె వినయం బెసఁగన్. 78

టీ. అని = ఈవిధముగా, ధ్రువుఁడు, అట్లు, అనయము = ఎల్లపుడును, హరిచేన్, కృతార్థుఁడయిన, విధం బెల్లను = రీతినంతను, మైత్రేయుఁడు, వినిపించినన్ = చెప్పినతోడనే, విదురుఁడు, విని, మునివరున్ = అట్లు తనకు వినిపించిన మైత్రేయుని, చూచి, వినయం బెసఁగన్ = వినయముతో, పలికెను.

తా. మైత్రేయుఁడను ఋషి విదురునితో ధ్రువునివృత్తాంతమును జెప్పుచున్నాఁడు. పైప్రకారము ధ్రువుఁడు పరమేశునివలన స్వాభీష్టములను నెఱవేర్చికొనెనని మైత్రేయుఁడను ఋషి విదురునితోఁ జెప్పఁగా, విదురుఁడు మైత్రేయునితో నిట్లు పలుకుచున్నాఁడు.

క. మునినాయక విను కాముక
జనదుష్ప్రాపంబు విష్ణుచరణాంబురుహా

ర్చన మునిజనసంప్రాప్యము
ననఁ గలపంకేరుహాక్షునవ్యయపదమున్. 79

టీ. మునినాయక = మునులకధీశుఁడైన యో మైత్రేయుఁడా! విను. విష్ణుచరణాంబురుహార్చన = విష్ణువుయొక్క కమలంబులఁ బోలుపాదములను పూజించుట, కామ...ప్రాప్యంబు - కాముకజన = కాముకులకు, దుష్ప్రాప్యంబు = పొందరానిది, మునిజన = మునీశ్వరులకు, సంప్రాప్యము=పొందఁ దగినదియు, అనఁగల=అనునట్టి, పంకేరుహాక్షు=విష్ణువుయొక్క, అవ్యయ= నాశనములేని, పదమున్ = స్థానమును, వైపద్యముతో నన్వయము.

తా. విదురుఁడు మైత్రేయునితో విష్ణుపదమాహాత్మ్యమును వర్ణించి చెప్పుచున్నాఁడు.—మైత్రేయుఁడా! తత్పదమాహాత్మ్యమును జెప్పుచుంటిని వినుము. సంసారసుఖముల నభిలషించు మనుజుల కెన్నటికిని నాపదము కలుగనేరదు. ఇఁక నెల్లపుడును విష్ణుపాదసేవను మాత్రమే చేయుచున్న యిహసౌఖ్యములఁ గోరనిమునులకుఁ దప్పక యది లభించును.

వ. పెక్కుజన్మంబులం గాని పొందరానిపదంబు దా నొక్క జన్మంబుననే పొందియుం దనమనంబునం దప్రాప్తమనోరథుండ నని పురుషార్థవేది యైనధ్రువుం డెట్లు దలంచె ననిన మైత్రేయుం డి ట్లనియె. 80

టీ. పెక్కుజన్మంబులంగాని = అనేకవేల జన్మముల నెత్తియైన పొందరాని = పొందలేని, పదంబు=అవిష్ణుపదమును, తాను=అధ్రువుఁడు, ఒక్కజన్మంబుననే = ఒక్కజన్మమునందే, పొందియుఁన్ = పొందియుండి యుం, తనమనంబునన్ = తనమనస్సునందు, అప్రాప్త...రథుఁడను-అప్రాప్త = పొందఁబడని, మనోరథుండను అని = కోరికగలవాఁడనని, పురుషార్థ = ధర్మార్థ కామమోక్షములను, వేదియైన = ఎఱింగిన, ధ్రువుండు, ఎట్లు, తలంచెను=

ఊహించెను. అనినన్ = అనినతోడనే, మైత్రేయుండు, ఇట్లు = ఈవిధముగా, అనియెన్ = పలికెను.

తా. కనుక నట్టి విష్ణుపదమనేక జన్మములెత్తినను బొందుటకు సాధ్యము కానిదైనను దాని నొక్కజన్మముననే పొందినప్పటికిని నేను మనోరథములను వేనిని బొందలేవని పురుషార్థముల నెఱింగిన ధ్రువుఁ డెట్లు తలంచెనని విదురుఁ డడుగఁగా మైత్రేయుఁ డిట్లు చెప్పుచున్నాఁడు:—

తే. అనఘ పినతల్లి దన్నుఁ బల్కినదురుక్తి
బాణవిద్ధాత్ముఁ డగుచుఁ దద్భాషణములు
చిత్తమందుఁ దలంచుటఁ జేసి ముక్తి
గోరమికి నాత్మలో వగఁ గూరుచుండె. 81

టీ. అనఘ = దోషరహితుఁడైన యో విదురుఁడా! పినతల్లి, తన్ను = ఆ ధ్రువునిఁగూర్చి, పల్కిన, దురుక్తి=దురుక్తులనెడు, బాణ = బాణములచే, విద్ధ = నాఁటఁబడిన, ఆత్ముఁడగుచు = మనస్సుకలవాఁడయి, తద్భాషణములు=అతనిపినతల్లి యాడినమాటలను, చిత్తమందుఁ దలంచుటఁ జేసి = మనసునఁ దలఁచుటచే, ముక్తిగోరమికి = ముక్తినిగోరకపోవుటకు, ఆత్మలోన్ = తనమనస్సునందు, వగన్ = దుఃఖమును, కూరుచుండెన్ = పొందుచుండెను.

తా. మైత్రేయుఁడు విదురునితో నిట్లు చెప్పుచున్నాఁడు.—ఓ విదురుఁడా! ధ్రువుఁడు, తనపినతల్లి యాడిన దురుక్తులు మనసునఁదగిలి నిరంతరము తద్ధ్యానమున మనస్సుచెడినవాఁడై దుఃఖముచేతఁ జింతించుచుఁగూర్చుండెను.

వ. అంత నాధ్రువుండు. 82

చ. అనఘ జితేంద్రియుల్ సుమహితాత్ములు నైనసనందనాదు
లెం, దనయము నైకజన్మసముపార్జితయోగసమాధిఁ జేసి
యొ, వ్వనిచరణారవిందములు వారనిభక్తి నెఱుంగు చుం

దు ర్గా, ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజ
య్యు నాద్యునిన్. 83

టీ. అనఘ = దోషరహితుఁడైన యో విదురుఁడా! జితేంద్రి
యుల్ = ఇంద్రియనిగ్రహము కలవారును, సుమహితాత్ములు = గొప్ప
యంతఃకరణతత్త్వము కలవారును నైన, సనందనాదులు, ఎందున్ = ఏ
సమయమునందును, అనయము = ఎల్లప్పుడును, నైక...మాధిన్ - నైక =
అనేకములైన, జన్మ = జన్మములయందు, సముపార్జిత = ఆర్జింపఁబడిన,
యోగ = యోగమునందలి, సమాధిఁజేసి = ఏకాగ్రతచేత, ఎవ్వ... వింద
ములు-ఎవ్వని = ఏవిష్ణువుయొక్క, చరణారవిందములు = పాదపద్మములు,
వారనిభక్తిన్ = తగ్గని పూర్ణమైన భక్తితో, ఎఱుంగుచుందురు = తెలిసికొను
చుందురో, ఆ పరమేశున్ = గొప్పప్రభువైనట్టియు, ఈశున్ = సమర్థుఁడై
నట్టియు, అవికారున్ =రజోవికారములను జెందనట్టియు, అమేయున్ =
ఊహింప శక్యముకానివాఁడును, అజయ్యున్ = జయింప శక్యము కాని
వాఁడును, ఆద్యునిన్ = ప్రపంచసృష్టికంటె ముందున్నవాఁడు నైన
యావిష్ణుని, ఏను షణ్మాసంబులు భజియించి, యని ముందువచనముతో
నన్వయము.

తా. మైత్రేయుఁడు విదురునితో నట్టి సమయమున ధ్రువుని దార్ఢ్య
స్థితిని జెప్పుచున్నాఁడు.—ఇంద్రియములను జయించిన గొప్పమహిమ గల
సనకసనందనాదికుమార్లు లెచ్చట సమాధియొనర్చి యేపరమేశుని చరణములు
సదా ధ్యానించి కనుగొనుచుందురో యట్టిపరమాత్ముని భజియించెదను.

వ. ఏను షణ్మాసంబులు భజియించి తత్పాదపద్మచ్ఛాయం బ్రా
పించియు భేదదర్శనుండ నైతి నక్కటా యిట్టిభాగ్యహీనుం
డ నైనయేను భవనాశకుం డైనయతనిం బొడఁగనియు న

శ్వరంబు లైనకామ్యంబు లడిగితి నిట్టిదౌరాత్మ్యం బెందేనిం గలదే తమపదంబులకంటె నున్నతపదంబు నొందుదునో యని సహింపంజాలని యీదేవతలచేత మదీయమతి గలుషితం బయ్యెం గాక నాఁడు నారదుం డాడినమాట తథ్యం బయ్యె నతనివాక్యంబు లంగీకరింపక యే నసత్తముండనై స్వప్నావస్థలం బొందినవాఁడు దైవికం బైనమాయం జెంది భిన్నదర్శనుండగుచందంబున నద్వితీయుండ నైనను భ్రాంతి యనుశత్రువుచేఁ బ్రాప్తం బైనదుఃఖంబు నొంది జగదాత్మకుండును సుప్రసాదుండును భవనాశకుండును నైనయీశ్వరు నారాధించి తత్ప్రసాదంబు వడసియు నాయుర్హీనుండైన రోగికిం బ్రయోగించు నౌషధంబుంబోలె నిరర్థకంబు లై నశ్వరంబు లైన యీకామితంబులు గోరితి నని వెండియు.

టీ. ఏను, షణ్మాసంబులు = ఆరునెలలు, భజియించి = సేవించి, తత్ ఛాయక్ - తత్ = ఆవిష్ణువుయొక్క, పాదపద్మ = కమలములవంటి పాదములయొక్క, ఛాయక్ = నీడను, ప్రాపించియుం = పొందియు, భేద దర్శనుండనైతి = భేదజ్ఞానము కలిగియుంటిని. అక్కటా = ఎంతకష్టము, ఇట్టి = ఈవిధమగు, భాగ్యహీనుండనైన = అదృష్టములేని, ఏను, భవనాశకుండైన = సంసారమును నశింపఁజేయు, ఆతనిక్ = ఆపరమేశుని, పొడగనియుఁక్ = కనుఁగొనినను, నశ్వరంబులైన = నశించునట్టి, కామ్యంబులు = కోరికలను, అడిగితిని. ఇట్టి, దౌరాత్మ్యంబు = దురదృష్టము, ఎందైనక్ = ఎచ్చటనైనను, కలదే = ఉన్నదా? తమపదంబులకంటె, ఉన్నతపదంబును, ఒందుదునో యని = పొందెదనేమో యని, సహింపంజాలని = సహింపలేని ఈదేవతలచేత, మదీయమతి = నాజ్ఞానము, కలుషితంబయ్యె = చెడినది, గాక = తప్ప, నాఁడు = ఆసమయమున, నారదుండాడినమాట, తథ్యం

బయ్యెన్ = యథార్థమాయెను. అతనివాక్యంబు లంగీకరింపక = నారదునిమాటలు చెవిఁబెట్టక, ఏను, అసత్తముండనై = నీచుఁడనై, స్వప్నావస్థలం బొందిన వాఁడు = కలఁగన్నవాఁడు, దైవికంబయిన మాయం బొంది = గ్రహచార వశమున వచ్చినమాయకులోనై, భిన్నదర్శుండగుచందంబునన్ = తాను భగవంతునికంటె వేఱను జ్ఞానమును పొందినరీతిని, అద్వితీయుండనైనను = రెండవది లేనివాఁడనయ్యు, భ్రాత = తోఁబుట్టువు, అను, శత్రువుచేన్ = శత్రువువలన, ప్రాప్తంబైన = సంభవించిన, దుఃఖంబునొంది, జగదాత్మకుండును = లోకమంతయు నాత్మయందుఁ గలిగినట్టియు, సుప్రసాదుండును = దయగలవాఁడును, భవనాశకుండును = సంసారమును నశింపఁ జేయు నట్టియుఁ, ఈశ్వరున్ = పరమేశుని, ఆరాధించి, తత్ప్రసాదంబు = ఆపరమేశుని యనుగ్రహమును, పడసియు = పొందియుఁ, ఆయుర్విహీనుండైన = ఆయుర్దాయము లేని, రోగికిన్, ప్రయోగించు ఔషధంబుం బోలె = ఇయ్యఁబడు ఔషధమువలె, నిరర్థకంబులై = ప్రయోజనము లేనివై, నశ్వరంబులైన = నశించునట్టి, ఈకామితంబులు = ఈకోరికలను, కోరితి = కోరితిని, అని = ఈప్రకారముగా, వెండియుం.

తా. మైత్రేయుఁడు ధ్రువుని విచారమును విదురునికిఁ జెప్పుచున్నాఁడు.—అట్టి పరమపురుషుని నే నాఱుమాసములు సేవించి తదనుగ్రహపాత్రుఁడనయ్యు నేను వారికంటె నుత్కృష్టమగు పదవి నెచ్చటఁ బొందుదునో యని దేవతలు భయమును బొందుచుండ మాయాంధకారమున మునిఁగి కామితంబులఁ గోరితినే. ఎంత జ్ఞానహీనుఁడను. అపుడీమాటను నాకు నారదుఁడు చెప్పిన నాతనిమాట యుల్లంఘించి యిట్లు వచ్చితిని. తుద కాతనిమాటయే నిజమయ్యెను. ఇంక సోదరుఁడనుశత్రువువలన వచ్చిన దుఃఖముఁ బొంది భవనాశకుఁడైన పరమపురుషునియనుగ్రహము తుదకుఁ బడసియుం నశ్వరంబులైన కామితములను గోరితినని ధ్రువుఁడు చింతాక్రాంతుఁ డయ్యెను.

మ. ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ ధాటిన్ ఫలీకార
మి, మ్మని యర్థించినరీతి ముక్తిఫలదుం డైనట్టి పంకేజలో,
చనుఁడే చాలఁ బ్రసన్నుఁ డైన నతనిన్ సాంసారికం బర్థిఁ
గో, రిననావంటివిమూఢమానసులు ధాత్రిం గల్గిరే యె
వ్వారున్. 85

టీ. ధనహీనుఁడు=ధనములేనివాఁడు, నృపాలున్ = రాజును, చేరి = పొంది, మిగులన్=మిక్కిలి, ధాటిన్=ధైర్యముతో, ఫలీకారము = నవధాన్యములను, ఇమ్మని అర్థించినరీతిన్ = యాచించినరీతిగా, ముక్తిఫలదుండైనట్టి = మోక్షమునిచ్చునట్టి, పంకేజలోచనుఁడే = శ్రీమన్నారాయణుఁడే, చాలన్, ప్రసన్నుఁడైనన్=దయగలవాఁడైనప్పటికి, అతనిన్=ఆయనను, సాంసారికంబు =సంసారసుఖమును, అర్థిన్ = ప్రీతితో, కోరిన, నావంటి, విమూఢమానసులు = మూఢబుద్ధులుగలవారు, ధాత్రిన్ = భూమియందు, ఎవ్వారున్ కల్గిరే = ఎవరైననుండిరా.

తా. ధ్రువుఁడు చింతించుచున్నాఁడు.—దరిద్రుఁడు గొప్పరాజు దగ్గఱకుఁ బోయి నవధాన్యముల నిప్పింపుమని ప్రేమతో నడిగినరీతిగా, ముక్తి నిచ్చునట్టి పరమేశ్వరునిఁ జెంది నశ్వర మయినసంసారసుఖమును గోరితిని గాన నావంటిమూఢబుద్ధు లీలోకమున నెచ్చటను నుండియుండ రని ధ్రువుఁడు చింతించెను.

—● ధ్రువుండు మరలఁ దనపురంబునకు వచ్చుట ●—

సీ. అని యిట్లు చింతించె ననుచున్న మైత్రేయ
ముని విదురునకు ని ట్లనియెఁ దండ్రి
కమనీయహరిపాదకమలరజోఽభిసం
స్కృతశరీరులును యాదృచ్ఛికముగ
సంప్రాప్త మగుదాన సంతుష్టచిత్తులై
వఱలుచు నుండు మీవంటివారు

తగ భగవత్పాదదాస్యంబు దక్కఁగ
నితరపదార్థంబు లెడఁదలందు
తే. మఱచియును గోర నొల్లకు మనుచరిత్ర
తవిలి యిట్లు హరిప్రసాదంబు నొంది
మరలి వచ్చుచు నున్న కుమారువార్తఁ
జారుచే విని యుత్తానచరణుఁ డపుడు. 86

టీ. అని, ఇట్లు=ఈవిధముగా, చింతించెననుచున్=ధ్రువుఁడు చింతించెనని, ఆమైత్రేయముని విదురున కిట్లనియె. తండ్రీ, కమ...రులును - కమనీయ = మనోహరమయిన, హరి = హరియొక్క, పాదకమల = పాదములను పద్మముయొక్క, రజః = ధూళిచేత, అభిసంస్కృత = సంస్కరింపఁబడిన, శరీరులును = శరీరములుగలవారును, యాదృచ్ఛికముగన్ = దైవవశముచేత, సంప్రాప్తమగుదానన్ = దొఱకినదానిచే, సం...చిత్తులై - సంతుష్ట=సంతోషమును బొందిన, చిత్తులై=మనసుకలవారై, వఱలుచునుండు = ప్రకాశించునట్టి మీవంటివారు, తగన్ = ఒప్పునట్లుగా, భగవత్ = భగవంతునియొక్క, పాదదాస్యంబు తక్కఁగ = పాదసేవతప్ప, ఇతరపదార్థంబులు = తక్కినసంగతులు, ఎడఁదలందున్ = మనసులందు, మఱచియున్ = మఱచిపోయికూడ, కోరనొల్లరు = కోరనేరరు మను = మనువంశమునందలి, చరిత్ర = చరిత్రకలవాఁడా! ఇట్లు, హరిప్రసాదంబును, ఒంది = పొంది, మరలివచ్చుచున్న, కుమారు = తనకుమారుఁడైన ధ్రువునియొక్క, వార్తను= వచ్చుచున్నాఁడను వార్తను, చారుచేన్ = చారునివలన, విని, ఉత్తానచరణుఁడు = ఉత్తానపాదుఁడు, అపుడు.

తా. మైత్రేయుఁడు విదురునికిఁ జెప్పుచున్నాఁడు — ఇట్లు చింతించి యేదోవిధముగా హరిప్రసాదమునొంది వచ్చుచున్న కుమారునిరాకను, నుత్తానపాదుఁడు చారునివలనఁ దెలిసికొని యాసమయమున.

వ. మనమ్మున నిట్లని తలంచె. 87

టీ. మనమ్మునన్ = మనస్సులో, ఇట్లని, తలంచెన్ = ఆలోచించెను.

క. చచ్చినవారలు క్రమ్మఱ
వచ్చుటయే కాక యిట్టివార్తలు గలవే
నిచ్చలు నమంగళుఁడ నగు
నిచ్చట మఱి నాకు శుభము లేల ఘటించున్. 88

టీ. చచ్చినవారలు, క్రమ్మఱన్ = తిరుగ, వచ్చుటయే = రావడ ముందునా! కాక, ఇట్టి=ఇటువంటి, వార్తలు, కలవే = ఉన్నవా? నిచ్చలు = ఎల్లప్పుడును, అమంగళుఁడనగు = శుభములేనివాఁడనగు, నాకు, ఇచ్చట, మఱి, శుభము లేల ఘటించున్=శుభము లెట్లు సమకూడును.

తా. అట్లు చారునివలనఁ దద్వృత్తాంతమును విని యుత్తానపాదుఁడు నా కంతటియదృష్టము సమకూడునా? ఏలన, నేను నిత్యము నమంగళమునే పొందుచుంటిని. ఇంతకును జచ్చినవారు తిరిగివత్తురా? కాన నేను నమ్మనని యనుచున్నాఁడు.

క. అని విశ్వసింప కుండియు
మనమున నానారదుఁడు గుమారుఁడు వేగం
బున రాఁగలఁ డనుచును బలి
కినపలుకులు దలఁచి నమ్మి కృతకృత్యుం డై. 89

టీ. అని=ఇట్లు పలికి, మనమునన్=మనస్సున, విశ్వసింపకుండియుంన్= నమ్మకుండియుం, ఆనారదుఁడు, కుమారుఁడు, వేగంబునన్=శీఘ్రముగా, రాఁగ లఁడు, అనుచున్, పలికినపలుకులు = చెప్పినమాటలను, తలఁచి = తలంచుకొని, నమ్మి, కృతకృత్యుండై = సంతసించినవాఁడై. పైపద్యముతో నన్వయము.

తా. ఈవిధమునఁ జారునివలన వినియుం నుత్తానపాదుఁడు తనసుతుని రాకను మొదట నమ్మక, నారదుఁడు నీకుమారుఁడు శీఘ్రముగా రాఁగలఁడని చెప్పినమాటను నమ్మి సంతసించెను.

క. తనసుతునిరాక సెప్పిన
ఘనునకు ధనములును మౌక్తికప్రహారములుఁ
మన మలర నిచ్చి తనయునిఁ
గనుఁగొనుసంతోష మాత్మఁ గడలుకొనంగన్. 90

టీ. తనసుతునిరాక చెప్పిన = తనకుమారుఁడు వచ్చుచుండెనని కబురు చెప్పిన, ఘనునకుఁ = పుణ్యాత్మునకు, ధనములును, మౌక్తికప్రహారములుఁ = ముత్యాలహారములును, మన మలరఁ = మిగుల సంతోషముతో, ఇచ్చి, తనయునిఁ =తనకుమారుని, కనుఁగొను=చూచునట్టి, సంతోషము, ఆత్మఁ = మనస్సునందు, కడలుకొనంగఁ = వ్యాపింపఁగా.

తా. ఉత్తానపాదుఁడు తనకుమారుఁడు వచ్చుచున్నాఁ డని చెప్పిన వానికి బహుమానముగా ముత్యాలహారములను ధనంబులను గూడ నిచ్చి తన కొడుకును జూచుసంతోషముతోఁగూడి.

సీ. వలను మీఱినసైంధవంబులఁ బూన్చిన
కనకరథంబు నుత్కంఠ నెక్కి
బ్రాహ్మణకులవృద్ధబంధుజనామాత్య
పరివృతుం డగుచు విస్ఫురణ మెఱసి
బ్రహ్మనిర్ఘోష తూర్యస్వన శంఖకా
హళ వేణురవము లందంద చెలఁగ
శిబిక లెక్కియు విభూషిత లై సునీతిసు
రుచు లుత్తముండు నారూఢి నడవ

తే. గరిమ దీపింప నతిశీఘ్రగమన మొప్ప
నాత్మనగరంబు వెలువడి యరుగుచుండి
బలసి నగరోపవనసమీపంబునందు
వచ్చుధ్రువుఁ గని మేదినీశ్వరుఁడు నంత. 91

టీ. వలనుమీఱిన = దిక్కులను జయించిన, సైంధవంబులన్ = గుఱ్ఱములను, పూన్చిన = కట్టినట్టి, కనకరథంబున్ = బంగారురథమును, ఉత్కంఠన్ = ఆశతో, ఎక్కి, బ్రాహ్మణ = బ్రాహ్మణులతోడను, కులవృద్ధ = కులవృద్ధులతోడను, బంధుజన = బంధువులతోడను, అమాత్య = మంత్రులతోడను, పరివృతుండగుచు = చుట్టుకోఁబడినవాఁడై, విస్ఫురణ మెఱసి = మిగులఁ బ్రకాశించి, బ్రహ్మ...వములు - బ్రహ్మనిర్ఘోష = వేదాధ్యయన ధ్వనులు, తూర్యస్వన = మద్దెల మొదలగు వాద్యములధ్వనులు, శంఖ = శంఖముల యొక్కయు, కాహళ = సన్నాయీలయొక్కయు, వేణు = పిల్లఁగ్రోవుల యొక్కయు, రవములు = ధ్వనులు, అందంద = ఆప్రదేశమంతయు, చెలఁగన్ = వ్యాపించుచుండఁగా, శిబిక లెక్కియున్ = పల్లకీల నెక్కియు, విభూషితులై = అలంకరించుకొన్నవారై, సునీతిసురుచులు, ఉత్తముండును = ఉత్తముఁడను సురుచికుమారుఁడును, అరూఢిన్ = సంతసముతో, నడవన్ = నడచుచుండఁగా, గరిమదీపింపన్ = గొప్పతనము ప్రకాశించుచుండ, అతిశీఘ్రగమన మొప్పన్ = మిగులవేగముగా, ఆత్మనగరంబు = తనపట్టణమునుండి, వెలువడి = బయలుదేఱి, అరుగుచుండి, బలసి = కూడి, నగర = పట్టణమునందలి, ఉపవన సమీపంబునందున్ = ఉద్యానవనముదగ్గర, వచ్చు = వచ్చుచున్న, ధ్రువుఁగని = ధ్రువునిఁజూచి, మేదినీశ్వరుఁడు = ఉత్తానపాదుఁడు, కని, అంతన్ = ఆపైని. ముందుపద్యముతో నన్వయము.

తా. సుతురాకను విని యుత్తానపాదుఁడు దిక్కులను జయించినగుఱ్ఱములు పూన్చిన బంగారురథము నధిష్ఠించి బ్రాహ్మణకులవృద్ధబంధువర్గములతోఁగూడి వేదాధ్యయన తూర్యశంఖకాహళధ్వనులు దిశలను బిక్కటిల్లఁ

జేయుచుండ అలంకరించుకొన్న సునీతిసురుచులు పల్లకి నెక్కి కుమారు నెదుర్కొనుటకు బయలువెడల, నుత్తముండు తనయన్నగారి నెదుర్కొనుసంతసమున ముందుఁ బాదచారియగుచుండ నుత్తానపాదుఁడు తత్పురోపవనము దాపున వచ్చుచున్న ధ్రువునిఁజూచి, అరదము డిగ్గి యని ముందుపద్యముతో నన్వయమ్ము.

చ. అరదము డిగ్గి ప్రేమదొలఁకాడ ససంభ్రముఁడై రమామనో
హరు చరణారవిందయుగళార్చన నిర్దళితాఖిలాఘునీ, శ్వ
రకరుణావలోకనసుజాతసమగ్రమనోరథున్ సుతుం, గర
మనురక్తి డాసి పులకల్ ననలొత్తఁ బ్రమోదితాత్ముఁడై.

టీ. అరదమున్ = రథమును, డిగ్గి = దిగిపోయి, ప్రేమ తొలఁకాడన్ = అనురాగ ముట్టిపడుచుండ, ససంభ్రముఁడై = తొట్రుగలవాఁడై, రమా...ఘున్-రమామనోహరు = విష్ణువుయొక్క, చరణారవింద = పాదపద్మముల, యుగళ = జంటయొక్క, అర్చన = పూజచే, నిర్దళిత = బ్రద్దలుచేయఁబడిన, అఖిల = సమస్తమగు, అఘున్ = పాపములుకలవాఁడును, ఈశ్వ...రథున్-ఈశ్వర = ఈశ్వరునియొక్క, కరుణావలోకన = దయార్ద్రదృష్టిచే, సుజాత = పుట్టిన, సమగ్ర = సంపూర్ణమయిన, మనోరథున్ = కోరికలుగల, సుతున్ = కుమారుఁడైన ధ్రువుని, కరము = మిక్కిలి, అనురక్తిన్ = అనురాగముతో, డాసి=సమీపించి, పులకల్ = గగ్గురుపాటు, ననలొత్తన్ = చిగిరించుచుండ (కలుగఁగా), ప్రమోదితఆత్ముఁడై = సంతోషమునుబొందిన అంతఃకరణముగలవాఁడై, బిగియఁగౌఁగిట అను ముందుపద్యముతో నన్వయము.

తా. ఆయుత్తానపాదుఁడు తనకెదురుగావచ్చుచున్న ధ్రువునిఁజూచి రథమునుండి దిగి యెదురుగఁబోయి విష్ణుపూజచే సకలమనోరథముల నొందినట్టి పాపరహితుఁడైన కుమారునిఁ జూడఁగనే, తదానందాతిశయమున నాతని శరీరమంతయుఁ బులకావృతమయ్యెను.

తే. బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెన్మొగము నివిరి
శిరము మూర్కొని చుబుకంబు సేతఁ బుణికి
యవ్యయానంద బాష్పధారాభిషిక్తుఁ
జేసి యాశీర్వదింప నాచిరయశుండు. 93

టీ. బిగియన్ = దృఢముగా, కౌఁగిటఁజేర్చి = కవుంగిలియం దుంచుకొని, నెన్మొగము = ఫాలప్రదేశమును, నివిరి=దువ్వి, శిరము = శిరస్సును, మూర్కొని = వాసనచూచి, చుబుకంబు = అతనిగడ్డము, చేతన్ = చేతితో, పుణికి = తడవి, అవ్య...షిక్తున్-అవ్యయ = నాశనములేని, ఆనంద=ఆనందపు, బాష్పధారా = కన్నీటిధారలచేత, అభిషిక్తున్ = అభిషేకముచేయఁబడినవానిఁగా, చేసి, ఆశీర్వదింపన్ = ఆశ్వీరచనముసేయఁగా, ఆచిరయశుండు = శాశ్వతకీర్తిగల ఆధ్రువుఁడు. జనకుని యను ముందుపద్యముతో నన్వయము.

తా. అట్లాయుత్తానపాదుఁడు ధ్రువుని దృఢముగాఁ గౌఁగిలించి ముఖమును నిమిరి శిరసు నాఘ్రాణించి ముద్దుపెట్టికొని, యాతని నానంద బాష్పములచే నభిషేకముచేయ నాధ్రువుఁడును మిక్కిలి సంతోషము కలిగియుండెను.

క. జనకుని యాశీర్వచనము
లనయముఁ గైకొని ప్రమోదియై తత్పదముల్
తనఫాలతలము సోఁకఁగ
వినతులు గావించి భక్తివిహ్వలుఁ డగుచున్. 94

టీ. జనకుని = తనతండ్రియైన యుత్తానపాదునియొక్క, ఆశీర్వచనములు = ఆశీస్సులను, అనయము = ఎల్లపుడును, కైకొని = స్వీకరించి, ప్రమోదియై = సంతోషముగలవాఁడై, తత్ పదముల్ = జనకునియొక్క పాదములు, తనఫాలతలము = తన నెన్నుదుటియందు, సోఁకఁగన్ = తగులుచుండఁగా,

వినతులుగావించి = తనశక్తికొలఁది స్తోత్రముచేసి, భక్తి = భక్తిచేతను, విహ్వలుఁడగుచున్ = పరవశుఁడయి. ముందుపద్యముతో నన్వయము.

తా. ఆధ్రువుఁడు తనతండ్రియాశీర్వచనముల శిరసావహించి తాసును భక్తియుక్తముగాఁ దండ్రికి బ్రణామముచేయుచుఁ దద్భక్తివశమున శరీర ముచు మఱచి యుండెను. అనఁగా భక్తిచేఁ దదేకధ్యానముకలవాఁ డయ్యె నని భావము.

తే. అంత నాసజ్జనాగ్రణి యైనధ్రువుఁడు
తల్లులకు భక్తి వినతులు దగ నొనర్చి
సురుచికిని మ్రొక్క నర్భకుఁ జూచి యెత్తి
నగుమొగంబున నాలింగనంబుసేసి. 95

టీ. అంతన్=ఆపైని, ఆసజ్జనాగ్రణి = సజ్జనులలోమిగులశ్రేష్ఠుఁడైన యాధ్రువుఁడు, తల్లులకున్ = తనతల్లులైన సునీతిసురుచులకు, భక్తివినతులు = భక్తితోఁగూడిన నమస్కారములను, తగన్=ఒప్పునట్లు, ఒనర్చి=చేసి, సురుచికిని=తనపినతల్లికి, మ్రొక్కన్ = నమస్కరింపఁగా, అర్భకున్=బాలుఁడైన యాధ్రువుని, ఎత్తి=ఎత్తుకొని, నగుమొగంబునన్ = నవ్వుచున్న మొగ ముతో, ఆలింగనంబు సేసి=కౌఁగిటఁజేర్చి. 'కరమొప్ప' అను ముందుపద్య ముతో నన్వయము.

తా. అంత సాధ్రువుఁ డిద్దఱుతల్లులకు నమస్కరించి సురుచియొద్దకుఁ బోయి నమస్కరింప, నామె యాతని నెత్తికొని నవ్వుచు నాలింగనము చేసెను.

సీ. కరమొప్ప నానందగద్గదస్వరమున
జీవింపు మనుచు నాశీర్వదించె
భగవంతుఁ డెవ్వనిపై మైత్రి వాటించు
సత్కృపానిరతిఁ బ్రసన్నుఁ డగుచు

నతనికిఁ దమయంత ననుకూలమై యుండు
సర్వభూతంబులు సమతఁ జేర్చి
మహిఁ దలపోయ నిమ్నప్రదేశములకు
ననయంబు చేరుతోయములపగిదిఁ

తే. గాన ఘను నమ్మహాత్ముని గారవించె
సురుచి పూర్వంబు దలఁపక సుజనచరిత
విష్ణుభక్తులు ధరను బవిత్రు లగుట
వారి కలుగరు ధరణి నెవ్వారు మఱియు. 96

టీ. కరమొప్పన్=మిక్కిలి, ఆనందగద్గదస్వరమునన్=ఆనందవశమున్నైన డగుత్తికతోఁగూడిన గొంతుతో, జీవింపుము, అనుచు, ఆశీర్వదించెన్ = ఆశీర్వచనమొనర్చెను, భగవంతుఁడు, ఎవ్వనిపై, సత్కృపానిరతిన్ = దయయొక్క ఔన్నత్యముచేత, ప్రసన్నుఁడగుచున్=దయకలవాఁడయి, మైత్రిన్= స్నేహమును, పాటించున్=చూపునో, అతనికి, మహిన్ = భూమియందు, తలపోయన్ = ఆలోచింప, నిమ్న=లోఁతయిన ప్రదేశములకు, అనయంబున్=ఎల్లప్పుడును, చేరు = చేరునట్టి, తోయములపగిదిన్ = ఉదకముల రీతిని, తమయంత = తమంతటఁదామే, సర్వభూతంబులు = సమస్తభూతములును, సమతఁజేర్చి=ప్రేమతో, అనుకూలమైయుండు, కానన్=కాఁబట్టి, ఘనున్ = గొప్పఁవాఁడైన, అమ్మహాత్మునిన్ = ఆధ్రువుని, సురుచి, పూర్వంబు = పూర్వపుసంగతిని, తలఁపక = చింతింపక, గారవించెను = గౌరవించెను. సుజనచరిత = ఓవిదురుఁడా! విష్ణుభక్తులు, ధరను = భూమియందు, పవిత్రులగుటన్=పరిశుద్ధులగుటచేత, వారికిన్=వారినిగూర్చి, ఎవ్వారును, ధరణిన్ = భూమిపైన, అలుగరు = కోపమునుజెందరు. మఱియుం.

తా. సురుచి యాధ్రువునిఁ గవుంగిలించి సంతోషముగా గద్గదస్వరముతో నాశీర్వదించెను. కాన నోవిదురుఁడా! భగవంతుఁ డెవనిని దయార

సదృష్టితోఁ జూచునో, నీరు మిట్టనుండి పల్లమునకుఁ బోవుమాడ్కి వానిని సకలభూతములు తామే ప్రేమించును. అందుచే నాసురుచి ధ్రువునిపూర్వ చరిత్రము జ్ఞాపక ముంచుకొనక యాతని గారవించిన దని మైత్రేయుండు విదురునితోఁ జెప్పెను.

వ. కావున నుత్తముండును ధ్రువుండును బ్రేమవిహ్వాలు లగుచు నన్యోన్యాలింగితులై పులకాంకురాలంకృతశరీరు లై యానందబాష్పంబుల నొప్పి రంత సునీతియుఁ దన ప్రాణంబులకంటెం బ్రియుఁ డైనసుతు నుపగూహనంబు నేసి తదవయవస్పర్శనంబుచేత నానందంబు నొంది విగతశోక యయ్యె నప్పుడు సంతోషబాష్పధారాసిక్తంబు లై చనుఁ బాలునుం గురిసె నంత. 97

టీ. కావునన్ = కాఁబట్టి, ఉత్తముండును, ధ్రువుండును, ప్రేమ విహ్వాలులగుచున్ = ప్రేమచే పరవశమును జెందినవా రగుచు, అన్యోన్య ఆలింగితులై = పరస్పరము ఆలింగనముఁ జేసికొనినవారై, పులకాంకుర అలంకృత శరీరులై = గగుర్పాటుగల శరీరముకలవారై, ఆనందబాష్పంబు లన్ = ఆనందబాష్పములతో, ఒప్పిరి = కూడియుండిరి. అంత = ఆసమయ మున, సునీతియుం, తనప్రాణంబులకంటెను, ప్రియుండైన= ప్రేమాస్పదుఁడైన, సుతుని, ఉపగూహనంబునేసి = కవుంగిలించి, తత్ అవయవ స్పర్శనంబు చేతన్ = ఆబాలునియొక్క అవయవములఁ దాఁకుటచే, ఆనందంబు నొంది, విగతశోకయయ్యెన్ = దుఃఖమును వదలినదయ్యెను. అప్పుడు, సంతోష= సంతోష యుక్తమయిన, బాష్పధారా = కన్నీటిధారలచే, సిక్తంబులై = తడిసినవై, చనులన్ = స్తనములనుండి, పాలునుం గురిసెన్ = పాలును స్రవించెను. అంత= ఆసమయమున.

తా. కావున ఉత్తముఁడును ధ్రువుఁడును నొండొరు లభిమానముకల వారై పరస్పరాలింగనము లొనర్చి పులకాంకురములతోడను నానందబాష్ప

ములతోడను నొప్పియున్నయెడ సునీతి వచ్చి, తనప్రాణములకంటెఁ బ్రియ మయిన కుమారుని జూచి యానందబాష్పములు విడువ, నానీటిచేఁ దడిసి తత్పుత్రస్పర్శనకౌతుకమునఁ జనుఁగవనుండి పాలు స్రవించినవి.

సీ. ఉన్నతసంతోష ముప్పతిల్లఁగఁ బౌర
జనము లాధ్రువుతల్లి నెనయఁ జూచి
తొడరినభవదీయదుఃఖనాశకుఁ డైన
యిట్టితనూజుఁ డెందేనిఁ బెద్ద
కాలంబు క్రిందటఁ గడఁగి నష్టుం డైన
వాఁ డిప్డు నిజభాగ్యవశముచేతఁ
బ్రతిలబ్ధుఁ డయ్యెను నితఁడు భూమండల
మెల్లను రక్షించు నిద్ధమహిమఁ
తే. గమలలోచనుఁ జింతించుఘనులు లోక
దుర్జయం బైనయట్టిమృత్యువును గెల్తు
రట్టి ప్రణతార్తిహరుఁ డైనయబ్జనాభుఁ
డర్థి నీచేతఁ బూజితుం డగుట నిజము. (౯౪)

టీ. ఉన్నతసంతోషము = గొప్పసంతోషము, ఉప్పతిల్లఁగన్ = పుట్టుచుండఁగా, పౌరజనములు = పురజనులందఱును, అధ్రువుతల్లిన్ = సునీతిని, ఎనయన్=సంతోషముతో, చూచి, తొడరిన=కలిగినట్టి, భవ...డైన-భవదీయ = నీ, దుఃఖ = దుఃఖమును, నాశకుఁడైన = నశింపఁజేయువాఁడైన, ఇట్టి, తనూజుఁడు = కుమారుఁడు, ఎందేనిన్ = ఏప్రదేశముననో, పెద్ద కాలంబు క్రిందట = చాలకాలముక్రిందట, కడఁగి=పూని, నష్టుండైనవాఁడు, ఇప్డు = ఇప్పుడు, నిజ=నిజమైన, భాగ్యవశముచేతన్ = యదృష్టమువలన, ప్రతిలబ్ధుఁడయ్యెను = తిరిగిపొందఁబడెను. ఇతఁడు=ఈధ్రువుఁడు, భూమండలమెల్లను = సమస్తభూమండలమును, ఇద్ధ = అభివృద్ధినిబొందిన, మహి-

మన్ = మహిమచే, రక్షించును. కమలలోచనున్ = విష్ణుని, చింతించు = ధ్యానించునట్టి, ఘనులు = గొప్పవారు, లోక=లోకమునకు, దుర్జయంబైన= జయింపశక్యముకాని, మృత్యువును, గెల్తురు = గెల్చెదరు. అట్టి = అవిధ మయిన, ప్రణత = నమ్రులయొక్క, ఆర్తి = దుఃఖములను, హారుఁడైన = హరించునట్టి, అబ్జనాభుఁడు = పరమేశ్వరుఁడు, అర్థిన్=ప్రీతితో, నీచేతన్, పూజింతుండగుట = పూజింపఁబడియుండుట, నిజము.

తా. గొప్పసంతోషముతో సునీతి తనపుత్రుని ముద్దాడుచుండఁ బుర జనులు చూచి యామెను ననేకవిధముల నిట్లు స్తుతించుచుండిరి. ధ్రువుని వంటిత్రపశ్చాలి యగు కుఱ్ఱవాఁడు పూర్వ మెందును జూడలేదనియు, నా సునీతి పూర్వపుణ్యవశమున నిట్టికుమారుఁ డుద్భవించి కనఁబడకపోయినను నామెకు లభించెననియుఁ, దప్పక నీలోకమునంతను నేకచ్ఛత్రాధిపత్యముగాఁ నతఁ డేలు ననియు, నెన్నటికిని భగవంతుఁడు తన్నుఁ గొల్చినవారిం గాపాడు చుండు ననియు, నందువలన సునీతి దేవునిఁ బూజించె ననియుఁ బలువిధము లుగా మాటలాడఁ జొచ్చిరి.

వ. అని ప్రశంసించి రట్లు పౌరజనంబులచేత నుపలాల్యమానుం డును సంస్తూయమానుండు నగుచు నుత్తానపాదుం డుత్తమ సమేతంబుగా ధ్రువుని గజారూఢునిం జేసి ప్రహృష్టాంత రంగుం డగుచుఁ బురాభిముఖుం డై చనుదెంచి. ౬౭

టీ. అని, ప్రశంసించిరి. అట్లు పౌరజనంబులచేత = పురజనులచేత, ఉపలాల్యమానుండును = లాలనచేయఁబడుచున్నవాఁడును, సంస్తూయమానుం డును = స్తోత్రముచేయఁబడినవాఁడును, అగుచు, ఉత్తానపాదుండు, ఉత్తమ సమేతంబుగా = ఉత్తమునితోఁగూడ, ధ్రువునిన్ = ధ్రువునిని, గజా రూఢునింజేసి=ఏనుఁగుపెక్కించి, ప్రహృష్ట అంతరంగుండగుచున్=సంతసించిన హృదయము కలవాఁడగుచు, పుర...డై-పుర = స్వపురమునకు, అభిము ఖుండై =ఎదురుగా, చనుదెంచి = వచ్చి.

తా. ఇట్లు పురజనులు ధ్రువుని ప్రశంసించి స్తోత్రముచేయ నుత్తాన పాదుఁ డుత్తమునితోఁగూడ ధ్రువుని గజముమీఁద నెక్కించి స్వపురమున కభిముఖముగా వచ్చెను.

సీ. స్వర్ణపరిచ్ఛదస్వచ్ఛకుడ్యద్వార
  లాలితగోపురాట్టాలకంబు
ఫలపుష్పమంజరీకలితరంభాస్తంభ
  పూగపోతాదివిభూషితంబు
ఘనసారకస్తూరికాగంధజలబంధు
  రాసిక్తవిపణిమార్గాంచితంబు
మానితనవరత్నమయరంగవల్లీవి
  రాజితప్రతిగృహప్రాంగణంబు
తే. శుభనదీజలకుంభసంశోభితంబు
తండులస్వర్ణలాజాక్షతప్రసూన
ఫలబలివ్రాతకలితవిభ్రాజితంబు
నగుచు సర్వతోలంకృత మైనపురము. 100

టీ. స్వర్ణ...కంబు - స్వర్ణ = బంగారువికారమయిన, పరిచ్ఛద = ఆవరణముగల, స్వచ్ఛ = తెల్లనైన, కుడ్య = గోడలను, ద్వార = ద్వారములను, లాలిత=ఒప్పునట్టి, గోపుర = పురద్వారములుగల, అట్టాలకంబు = కోటబురుజులు గలిగినటువంటిదియు, ఫల...తంబు-ఫల = ఫలములతోడను, పుష్పమంజరి=పూలగుత్తులతోడను, కలిత = ఒప్పుచున్న, రంభాస్తంభ=స్తంభములవంటి యరఁటిచెట్లచేతను, పూగ=పోకచెట్లుచేతను, పోత = మామిడిగున్నలచేతను, విభూషితంబు = అలంకరింపఁబడునదియుఁ, ఘన...చితంబు-ఘనసార= కర్పూరముయొక్కయు, కస్తూరికా=కస్తూరియొక్కయుఁ, గంధజల=గంధముగలయుదకముచే, బంధుర=దట్టముగ, సిక్త = తడుపఁబడిన, విపణిమార్గ =

బజారుమార్గములతో, అంచితంబు = ఒప్పునదియు, మా...ప్రాంగణంబు - మానిత = ఒప్పుచున్న, నవరత్నమయ = నవరత్నమయమయినది, రంగవల్లీ = ముగ్గులతో, విరాజిత = ప్రకాశించు, ప్రతిగృహ = ప్రతిగృహముయొక్క, ప్రాంగణంబు = ముంగిళ్లుగలుగునట్టిదియు, శుభ...తంబు-శుభ = మంగళప్రద మయిన, నదీజల = నద్యుదకములుగల, కుంభ = కడవలచే, సంశోభితంబు = ప్రకాశించునట్టిదియు, తండుల...జితంబు-తండుల=బియ్యముతోను, స్వర్ణ = బంగారుతోను, లాజ = పేలాలతోను, అక్షత = అక్షతలతోను, ప్రసూన = పుష్పములతోను, ఫల = పండ్లతోను, బలివ్రాత = బలులసమూహముతోను, కలిత = కూడినదై, విభ్రాజితంబు = మిక్కిలి ప్రకాశించునదియు, అగుచు, సర్వతః = అన్నిప్రక్కలను, అలంకృతమై = అలంకరింపఁబడిన, పురము = పట్టణమును, ప్రవేశించి యను పైవచనముతో నన్వయము.

తా. ఉత్తానపాదుఁడు తనయిరువురు కొమరులతోడను స్వపురమును బ్రవేశించుచుండ నాపట్టణ మి ట్లలంకరింపఁబడెను. బంగారువికారమయిన పచ్చని చాందినీలు గలిగి తెల్లనిగోడలతోను గోటబురుజులతోను ప్రకాశించుచుండెను. ఎటుచూచిన ఫలములతోను, పూవులతోడను నిండియున్న యరఁటి పోక మొదలగు సొగసైనచెట్లతో నలంకరింపఁబడియుండెను. వారు పోవుమార్గమున బజారులన్నియు, కర్పూరవాసనలతోను, కస్తూరిపరిమళములతోను వెలయుచుండె. ప్రతిగృహప్రాంగణములందు నవరత్నమయములైన ముగ్గులు పెట్టఁబడెను. పురమునం దంతటను ఉదకపూరితమైన పూర్ణకలశములు వరుసఁగ నుంచఁబడెను. పురమునందెల్ల తండులములు లాజలు, అక్షతలు, పుష్పఫలాదిపూజాద్రవ్యములే వెలయుచుండెను. అట్టి పురంబున.

వ. ప్రవేశించి రాజమార్గంబునఁ జనుదెంచునప్పుడు. 101

టీ. ప్రవేశించి, రాజమార్గంబునన్ = రాజమార్గముగుండ, చనుదెంచునప్పుడు = పోవుచున్నసమయమున.

మ. హరిమధ్యల్ పురకామినీతతులు సౌధాగ్రంబులం దుండి భా
స్వరసిద్ధార్థఫలాక్షతప్రసవదూర్వావ్రాతదధ్యంబువుల్
కరవల్లీమణిహేమకంకణఝణత్కారంబు శోభిల్లఁ జ
ల్లిరి యాభాగవతోత్తమోత్తమునిపై లీలాప్రమేయంబుగన్.

టీ. హరిమధ్యల్ = సింహముయొక్క నడుమువంటి నడుములు గల, పురకామినీతతులు = పురస్త్రీలు, సౌధాగ్రంబులందుండి = మేడల యొక్క శిఖరంబులందుండి, భాస్వర...అంబువుల్ - భాస్వర=ప్రకాశించు, సిద్ధార్థ = తెల్లయావాలను, ఫల = పండ్లను, అక్షత = అక్షతలను, ప్రసవ = పువ్వులను, దూర్వావ్రాత = గఱికెపోచలను, దధి = పెరుఁగును, అంబువుల్ = ఉదకమును (పన్నీరును), కరవల్లీ = లతలవంటిహస్తములందలి, మణి = మాణిక్యములుగల, హేమ = బంగారుతోఁ జేయఁబడిన, కంకణ= మురుఁగులయొక్క, ఝణత్కారంబు = ధ్వని, శోభిల్లన్ = అతిశయించుచుండఁగా, ఆభాగవతోత్తమోత్తమునిపైన్ = భగవద్భక్తాగ్రేసరులకంటె శ్రేష్ఠుఁ డగు ధ్రువునిమీఁద, లీలాప్రమేయంబుగన్ = వేడుకచే మితిమీఱు నట్లు, చల్లిరి

తా. అట్లు వారు రాజమార్గమునఁ బోవుచుండ నాపురస్త్రీలు స్వసౌధాగ్రముల నెక్కి లాజాక్షతపుష్పఫలాదులను, పన్నీరు మొదలగు సువాసనాద్రవ్యోదకములను, మాణిక్యములు తాపించిన వారి బంగారు కంకణములు ఘల్లుఘల్లు మనుచుండ సాధ్రువునిపై మిగుల సంతోషమునఁ జల్లిరి.

వ. ఇట్లు వాత్సల్యంబునం జల్లుచు సత్యవాక్యంబుల దీవించుచు సువర్ణపాత్రరచితమణిదీపనీరాజనంబుల నివాళింపం బౌర జానపదమిత్రామాత్యబంధుజనపరివృతుండై చనుదెంచి.

టీ. ఇట్లు, వాత్సల్యంబునన్ = ప్రేమతో, చల్లుచు, సత్యవాక్యంబులన్ = 'ఆయుష్మాన్ భూయాః, చిరంజీవే'త్యాది సత్యమైనవాక్యములచే,

దీవించుచు, సువ...నీరాజనంబులన్ - సువర్ణపాత్ర = బంగారుగిన్నె యందు, రచిత = ఉంచఁబడిన, మణిదీప = మాణిక్యమయ దీపములయొక్క, నీరాజనంబులన్ = ఆరతులచేత, నివాళింపన్ = హారతిచ్చుచుండఁగా,- పౌర = పురములతోడను, జానపద = పల్లెలవారితోడను, మిత్ర = స్నేహితులతోడను, అమాత్య = మంత్రులతోడను, బంధుజన = బంధుజనులతోడను, పరివృతుండై = ఆవరింపఁబడినవాఁడై, చనుదెంచి = వచ్చి,- (పైపద్యముతో నన్వయము.)

తా. ఈప్రకారముగఁ బురస్త్రీ లాధుస్త్రీని పై వాత్సల్యమునఁ జల్లుచు సత్యవాక్యముల దీవించుచు మాణిక్యదీపంబుల నీరాజనముల నిచ్చుచుండ సర్వజనపరివృతుండై వచ్చెను.

సీ. కాంచనమయమరకతకుడ్యమణిజాల
సంచయరాజితసౌధములను
వరసుధాఫేనపాండురరుక్మపరికరో
దాత్తపరిచ్ఛదతల్పములను
సురతరుశోభితశుకపికమిథునాళి
గానవిభాసితోద్యానములను
సుమహితవైదూర్యసోపానవిమలశో
భితజలపూర్ణవాపీచయముల

తే. వికచకహ్లారదర దరవిందకైర
వప్రదీపితబకచక్రవాక రాజ
హంససారసకారండవాది జలవి
హంగనినదాభిరామపద్మాకరముల. 104

టీ. కాంచ...ధములను - కాంచనమయ = బంగారుమయమయిన, మరకతకుడ్య = పచ్చలగోడలయందలి, మణిజాల = రత్నాలయొక్క,

సంచయ = సముదాయముచేత, రాజిత = ప్రకాశించుచున్న, సౌధములను = మేడలను, వర...తల్పములను - వర = శ్రేష్ఠమయిన, సుధా = సున్నము యొక్క, ఫేన=నురుగువలె, పాండుర = తెల్లనయినట్టివియు, రుక్మ = బంగారపు, పరికర = అలంకారములచే, ఉదాత్త = గంభీరములునైన, పరిచ్ఛద = తప్పుడువస్త్రములుగల, తల్పములను = పాన్పులను, సుర...ములను - సుర తరు = కల్పవృక్షాదులచేత, శోభిత = ప్రకాశించుచున్న, శుక = చిలుకలయొక్కయు, పిక = కోకిలలయొక్కయు, మిథున = జంటలయొక్కయు, అళి = తుమ్మెదలయొక్కయు, గాన = గానముచేత, విభాసిత = ప్రకాశించు, ఉద్యానములను = ఉద్యానవనములచేతను, సుమ ..యములన్ - సుమహిత = బాగుగాఁగొనియాడఁబడు, వైదూర్య = వైడూర్యమాణిక్యములయొక్క, సోపాన = మెట్లచేత, విమల = స్వచ్ఛముగా, శోభిత = ప్రకాశించునట్టి, జలపూర్ణ = నీటితోనిండిన, వాపీచయములన్ = అనేక బొడ్డునబావులచేతను, వికచ...కరములన్ - వికచ = వికసించిన, కహ్లార = ఎఱ్ఱతామరలతోడను, దరత్ = వికసించిన, అరవింద = పద్మములతోడను, కైరవ = తెల్లకలువలతోడను, ప్రదీపిత = బాగుగాఁబ్రకాశించు, బక = కొంగలు, చక్రవాక = చక్రవాకపుఁబక్షులు, రాజహంస = రాజహంసలు, సారస = బెగ్గురుపక్షులు, కారండవ = కన్నెలేడిపిట్టలు, ఆది = మొదలగు, జలవిహంగ = నీటిపక్షులయొక్క, నినద = ధ్వనులతోడను, అభిరామ = మనోహరమయిన, పద్మాకరములన్ =సరస్సుల, చూచె నని ముందు పద్యంబుతో నన్వయము

తా. ధ్రువుఁడు స్వపురములోనికిఁ బ్రవేశించునపు డాపురములోని సొగసైనవాని నెల్లను జూచుచుం బోయెను. అతఁడు చూచిన మేడలు బంగారుతోఁ గట్టఁబడి మరకతమాణిక్యములును, నితరమణులును జెక్కనవై యుండెను. శయ్యలు తెల్లనివై యుండి బంగారుజల్తారుగుడ్డలతోఁ గప్పఁబడియుండెను. ఉద్యానవనము లన్నియు శుకపికధ్వనులతో నిండి

యుండెను. బొడ్డనబావు లన్నియు, వైడూర్యమాణిక్యములతోఁ గట్టఁబడిన మెట్లు గలిగి స్వచ్ఛమయిననీటితో నిండియుండుటయే కాక యవి వికసించిన యెఱ్ఱతామరలు, పద్మములు, తెల్లగలువలు మొదలగువానితోఁ బ్రకాశించుచుఁ గొంగలు, చక్రవాకములు, రాజహంసలు, బెగ్గురుపక్షులు మొదలగు నీటిపక్షులయొక్క నినాదములతో నొప్పి యాసరస్సులు మఱియును ప్రకాశించుచుండెను. మీఁదఁ జెప్పఁబడినవాని నన్నిటిని జూచెను.

వ. మఱియును. 105

తే. చారుబహువిధవస్తువిస్తార మొప్ప
నంగనాయుక్త మగుచుఁ బెం పగ్గలించి
యర్థిఁ దనరారుజనకుగృహంబు సొచ్చె
నెలమిఁ ద్రిదివంబుసొచ్చు దేవేంద్రుపగిది. 106

టీ. చారు...స్తారము - చారు = సుందరమయినట్టి, బహువిధ = అనేకవిధములైన, వస్తు = వస్తువులయొక్క, విస్తారము = విరివి, ఒప్పన్ = చాలునట్లు, అంగనాయుక్తమగుచున్ = స్త్రీలతోఁగూడి, పెంపగ్గలించి = విస్తారమయిన యభివృద్ధిచేత, అర్థిన్ = ప్రీతితో, తనరారు = ప్రకాశించునట్టి, జనకుగృహంబు = తనతండ్రిగృహమును, త్రిదివంబుసొచ్చు దేవేంద్రుపగిదిన్ = స్వర్గపురమును బ్రవేశించు దేవేంద్రునిరీతిగా, ఎలమిన్ = సంతసముతో, చొచ్చెన్ = ప్రవేశించెను.

తా. ఇట్లుత్తానపాదుఁడు పైనిఁజెప్పఁబడిన సుందరములైన యనేకవస్తుసంపదఁ గలిగి మిగులఁ బ్రకాశించు తనతండ్రిగృహములోనికి, స్వర్గపురిలోనికిఁ బ్రవేశించు దేవేంద్రునిరీతిగా సంతసమునఁ బ్రవేశించెను.

వ. ఇట్లు ప్రవేశించిన రాజర్షి యైనయుత్తానపాదుండు సుతుని యాశ్చర్యకరంబైనప్రభావంబు వినియుం జూచియు మనంబున విస్మయంబు నొంది ప్రజానురక్తుండును బ్రజాసమ్మ

తుండును నవయౌవనపరిపూర్ణుండును నైనధ్రువుని రాజ్యాభి
షిక్తుంజేసి వృద్ధవయస్కుండైనతన్నుఁ దానయెఱింగి యా
త్మగతిఁ బొంద నిశ్చయించి విరక్తుండై వనంబునకుం జని
యె నంత నాధ్రువుండు శింశుమార ప్రజాపతికూఁతు రైన
భ్రమి యనుదాని వివాహం బై దానివలనఁ గల్పవత్సరు
లనునిద్దఱుకొడుకులం బడసి వెండియు వాయుపుత్రి యైన
యిల యనుభార్యయందు నుత్కలనామకుం డైనకొడుకు
నతిమనోహర యైనకన్యారత్నంబునుం గనియె నంతఁ
దద్భ్రాత యైనయుత్తముండు వివాహంబు లేకుండి మృగ
యార్థంబు వనంబున కరిగి హిమవంతంబున యక్షునిచేత
హతుం డయ్యె నతనితల్లియుఁ దద్దుఃఖంబున వనంబున కేగి
యందు గహనదహనంబున మృతిం బొందె ధ్రువుండు భ్రా
తృమరణంబు విని కోపామర్ష శోకవ్యాకులితచిత్తుండై జై
త్రం బగురథం బెక్కి యుత్తరాభిముఖుండై చని హిమవ
ద్ద్రోణియందు భూతగణసేవితంబును గుహ్యకసంకులంబును
నైనయలకాపురంబు వొడఁగని యమ్మహాబాహుండు. 107

టీ. ఇట్లు = ఈవిధముగా, ప్రవేశించిన, రాజర్షి యైన, ఉత్తానపా
దుండు, సుతుని=తనకుమారుఁడైన ధ్రువునియొక్క, ఆశ్చర్యకరం బైన=ఆశ్చ
ర్యమునుఁ గలుగఁజేయు, ప్రభావంబు=సామర్థ్యమును, వినియు, చూచియు,
మనంబునన్=మనసునందు, విస్మయంబునొంది=ఆశ్చర్యమునొంది, ప్రజా=
జనులకు, సమ్మతుండును=ఇష్టమైనవాఁడును, ప్రజా=ప్రజలయందు, అనురక్తుం
డును = అనురాగముగలవాఁడును, నవ...ర్ణుండును-నవ = నూతనమయిన,
యౌవన=యౌవనముతో, పరిపూర్ణుండును=నిండినవాఁడును, ఐన, ధ్రువుని,
రాజ్యా...షిక్తున్...రాజ్య=రాజ్యమునందు, అభిషిక్తున్=పట్టాభిషిక్తుని, చేసి,

వృద్ధవయస్కుండైన=ముదుసలితనమునొందిన, తన్నున్=తనను, తాన=తనం తటతానే, ఎఱింగి=తెలిసికొని, ఆత్మగతిన్ = ముక్తిమార్గమును, పొందన్, నిశ్చయించి, విరక్తుండై=విరక్తినిజెందినవాఁడై, వనంబునకున్ చనియెను = అడవికిఁ బోయెను. అంతన్ = ఆసమయమున, ఆధ్రువుండు, శింశుమార = శింశుమారుండను, ప్రజాపతి = బ్రహ్మయొక్క, కూఁతురైన, భ్రమియను దానిని, వివాహంబై=వివాహము చేసికొని, దానివలనన్=అభ్రమివలన, కల్ప వత్సరు లను = కల్పుఁడు, వత్సరుఁడు అనుపేర్లుగల, ఇద్దఱు కొడుకులన్, పడసి=పొంది, వెండియున్=మఱియు, వాయుపుత్రి = వాయుదేవుని కూఁతు రైన, ఇల యనుభార్యయందు, ఉత్కలనామకుండైన=ఉత్కలుండను పేరు గల, కొడుకును, అతిమనోహరయైన=మిగులసౌందర్యవతియగు, కన్యారత్నం బును=కుమారీరత్నంబును, కనియెన్=కనెను. అంతన్=ఆసమయమున, తత్ = ఆధ్రువునకు, భ్రాతయైన ఉత్తముండు, వివాహంబు, లేకుండి = లేకయే యుండి, మృగయార్థంబు = వేఁటనిమిత్తము, వనంబున కరిగి=వనమునకుఁ బోయి, హిమవంతంబునన్=హిమవత్పర్వతమునందు, యక్షునిచేతన్=ఒకా నొక యక్షునిచేత, హతుండయ్యెన్ = చంపఁబడెను. అతనితల్లియున్=ఆ యుత్తమునియొక్క తల్లియగు సురుచియు, తత్=అపుత్రునివలని, దుఃఖం బునన్=దుఃఖముచేత, వనంబునకున్=అడవికి, ఏగి=పోయి, అందు=ఆవనము నందు, గహనదహనంబునన్ = కాఱుచిచ్చునందు, మృతిన్=మరణమును, పొందన్=పొందెను. ధ్రువుండు, భ్రాతృమరణంబు=భ్రాతయగు నుత్తముని యొక్క చావును, విని, కోప...త్తుఁడై-కోప=కోపముచేతను, అమర్ష=అస హనముచేతను, శోక=దుఃఖముచేతను, వ్యాకులిత = వ్యాకులముగాఁజేయఁ బడిన, చిత్తుండై = మనస్సుకలవాఁడై, జైత్రంబగు=జయశీలమయిన, రథం బెక్కి=రథమునెక్కి, ఉత్తర = ఉత్తరదిక్కునకు, అభిముఖుండై = ఎదు రుగా, చని = పోయి, హిమవద్ద్రోణియందు = హిమవత్పర్వతమునందలి కోనయందు, భూతగణ = పిశాచగణములచే, సేవితంబును = సేవింపఁబడు నట్టిదియు, గుహ్యక = యక్షులచే, సంకులంబునైన = వ్యాపించినట్టిదియు

నైన, అలకాపురంబు = అలకాపట్టణమును, భొడఁగని = చూచి, అప్మహా బాహుండు=అధ్రువుండు (పైపద్యముతో నన్వయము.)

తా. ఉత్తానపాదుఁడు తనకుమారునియొక్క యమేయప్రభావము వినియుఁ జూచియు నాశ్చర్యపమేతుఁడై, ప్రజానురక్తుఁడును, నవయౌవన సమన్వితుఁడును, బ్రజాసమ్మతుండును నైన యాధ్రువుని రాజ్యాభిషిక్తునిఁజేసి తనకు వార్ధక్యము సంభవించె నని తెలిసికొని, ముక్తిమార్గమును సంపాదించు కొనుటకై సంసారమున విరక్తిఁజెంది వనమున కేగెను. అంత ధ్రువుఁడు సుఖముగా రాజ్యము చేయుచుశుంశుమారప్రజాపతికూఁతురైన భ్రమిని బెండ్లాడి దానియందుఁ గల్ప, వత్సరు లను నిరువురు తనయులఁ బడసి, మఱి వాయుపుత్రియైన యిల యను మఱియొకభార్యవలన నుత్కలుఁ డనుపేరు గల కుమారుని నొక కుమార్తెను గూడఁగని సుఖముగా నుండెను గాని యాతనిభ్రాతయగు నుత్తముఁడు పెండ్లి మానివేసి యుండి యొకసమయమున వేఁటనిమిత్త మడవికిఁ బోయి యచట నొకానొకయక్షునివలనఁ జంపఁ బడెను. అంత నాతల్లియైన సురుచి మిగుల దుఃఖాక్రాంతయై వనమున కేగి తద్దుఃఖవశంబున మృతి నొందెను. ధ్రువుఁడు తనభ్రాతృమరణమును విని శోకకోపామర్షములు కలవాఁడై జైత్రంబగు రథం బెక్కి యుత్తరాభిముఖుఁడై తద్వనమును బ్రవేశించి హిమవత్పర్వతమున యక్షవ్యాప్తమైన యల కాపురిని జూచెను.

ధ్రువుండు కుబేరానుచరులైనగుహ్యకులతో యుద్ధము చేయుట

మ. ఘనశౌర్యోన్నతితోడ సర్వకకుభాకాశంబులందుం బ్రతి
ధ్వను లోలిన్ నిగుడంగ శంఖము మహోద్యల్లీలఁ బూరింపఁ ద
న్నినదంబున్ విని యక్షకాంతలు భయాన్వితాత్మలై
రుగ్రసాధనులై యక్షభటుల్ పురిన్ వెడలి రుత్సాహంబు సంధిల్లఁగన్. 108

టీ. ఘన...తితోదర్క-ఘన = గొప్పదైన, శౌర్య=శౌర్యముయొక్క, ఉన్నతితోదర్క = ఔన్నత్యముతో, సర్వ = సమస్తమయిన, కకుభాకాశంబులందున్ = దిక్కులకొనలయందు, ప్రతిధ్వనులు = మాఱు మ్రోఁతలు, నిగుడంగన్ = వ్యాపించుచుండఁగా, శంఖము, మహాత్ ఉద్యత్ = గొప్పగాఁ గలిగిన, లీలన్ = విలాసముతో, పూరింపన్ = ఊఁదఁగా, తన్నినదంబున్ = ఆశంఖధ్వనిని, విని, యక్షకాంతలు, భయ = భయముతో, అన్విత = కూడిన, ఆత్మలైరి = అంతఃకరణము గలవారైరి. ఉగ్ర = తీక్ష్ణమయిన, సాధనులై = బాణఖడ్గాదిసాధనములు కలవారై, యక్షభటుల్, ఉత్సాహంబు=సంతసము, సంధిల్లఁగన్=కలుగఁగా, పురిన్=అలకాపురినుండి, వెడలిరి = బయలువెడలిరి.

తా. అంత ధ్రువుఁడు శౌర్యాతిశయమున శంఖమును బూరింప నాధ్వని దిగంతములవఱకు వ్యాపించి ప్రతిధ్వను లెసఁగుచుండ నాధ్వనిని విని, సహింపలేక యక్షకాంతలు భయమును జెందుచుండ, యక్షభటులు మిగుల నుత్సాహముతో తీవ్రములగు బాణములతో నలకాపురినుండి బయలు వెడలిరి.

వ. ఇట్లు వెడలి యాధ్రువునిం దాఁకిన. 108

టీ. ఇట్లు, వెడలి=తరలి, ఆధ్రువునిన్, తాఁకినన్=ముట్టడింపఁగా.

తా. అట్లు యక్షభటులు పోయి యాధ్రువుని ముట్టడించు సమయమున.

చ. కరము మహారథుండు భుజగర్వపరాక్రమశాలియుఁ దనుర్
ధరుఁడును శూరుఁ డౌధ్రువుఁడు దన్ను నెదిర్చినయక్షకోటిఁ
జెచ్చెరఁ బదుమూఁడువేల నొకచీరికిఁ గైకొన కొక్కపె
ట్టె భీకరముగ మూఁడుమూఁడు శితకాండములం దగఁ
గ్రువ్వ నేసినన్. 109

టీ. కరము=అత్యంతము, మహారథుండు = గొప్పరథము గలవాఁడును, భుజ = భుజములయొక్క, గర్వ = గర్వముతోఁ గూడిన, పరాక్రమ = బలముతో, శాలియుం౯ = ఒప్పువాఁడును, ధనుర్ధరుఁడును = ధనుస్సును ధరించినవాఁడును, శూరుఁడును, ఔ = అగు, ధ్రువుఁడు, తన్ను, ఎదిర్చిన, యక్ష కోటి౯=యక్షులగుంపును, చెచ్చెర౯=శీఘ్రముగా, పదుమూఁడువేల౯=పదుమూఁడువేలమందిని, ఒకచీరికి౯ = ఒకలక్ష్యమునకు, సైకొనక = స్వీకరింపక, ఒక్కపెట్ట౯ = ఒకదెబ్బచేత, భీకరముగ౯ = భయంకరముగా, మూఁడు మూఁడు = మూఁడేసి మూఁడేసి, శిత = తీక్ష్ణములయిన, కాండముల౯ = బాణములను, తగ౯ = ఒప్పునట్లు, క్రువ్వ౯ = క్రుచ్చుకొనునట్లు, ఏసిన౯ = ఏయఁగనే, ముందుపద్యముతో నన్వయము.

తా. అంత మిక్కిలి భుజబలముతో నొప్పిన శూరుఁడగు నాధ్రువుఁడు తన్నెదిర్చిన యక్షకోటిని బదుమూఁడువేలమందిని లెక్కగొనక యొక్కొక దెబ్బకు మూఁడేసి మూఁడేసి తీక్ష్ణబాణములను, వారిహృదయముల నాట నేసెను.

ఉ. వారులలాటముల్ పగిలివారకసోలియుఁ దేఱి యమ్మహో
దారపరాక్రమప్రకటధైర్యముఁ దత్కరలాఘవంబుఁ బ
ల్మాఱు నుతించుచుం గుపితమానసులై పదతాడితప్రదు
ష్టోరగకోటివోలెఁ జటులోగ్రభయంకరరోషమూర్తులై.

టీ. వారు = ఆయక్షభటులు, లలాటముల్ = లలాటప్రదేశములు, పగిలి=పగిలిపోవుటచే, వారక = పాఱిపోవక, సోలియుఁ౯ = అలసిపోయియు, తేఱి = కొంచెము సేదఁదేఱి, అమ్మహో...ర్యముఁ౯ - అమ్మహోదార = ఆమహాబలవంతుఁడైన ధ్రువునియొక్క, పరాక్రమ = బలమును, ప్రకట = హెచ్చయిన, ధైర్యముఁ౯, తత్ = ఆధ్రువుని, కర = చేతి, లాఘవంబుఁ౯ = చులకదనమును, పల్మాఱు = అనేకవిధములుగ, నుతించుచుఁ౯ = స్తోత్రము చేయుచు, కుపిత మానసులై = కోపముతోఁగూడిన మనస్సుకలవారై, పద...రగకోటివోలె౯-పద = పాదముచేత, తాడిత=తన్నఁబడిన, ప్రదుష్ట =

మిక్కిలిపెద్ద, ఉరగకోటివోలెన్ = సర్పసమూహంబువలె, చటుల = వేగము గలిగిన, ఉగ్ర = తీక్ష్ణమయిన, భయంకర = భయమును గలుగఁజేయు, రోష = రోషముతోఁగూడిన, మూర్తులై = ఆకారముగలవారై, 'అరథి కోత్తముం దోడరి' యను ముందుపద్యముతో నన్వయము.

తా. అర్జునునిచే గొట్టఁబడిన యక్షభటులకు లలాటములు పగులు టచే దర్పలశౌర్యములను కరలాఘవమును నుతించుచుఁ బెద్ద దెబ్బ తగిలినను సేదతేర్చుకొని కాలితోఁదన్నఁబడిన దుష్టసర్పకోటివలెఁ గోపము నొందిన వారై.

ఉ. ఆరథికోత్తముం దోడరి యందఱు నొక్కటఁ జుట్టు ముట్టి
పెం,పారఁగ బాణపఙ్క్తుల నంగములం బగులంగ నేసి
వి,స్ఫారగదా శర క్షురిక పట్టిస తోమర శూల ఖడ్గ
ముల్, సారథియుక్తుఁ డైనరథిసత్తముపైఁ గురియించి
రేపునన్. 111

టీ. ఆరథికోత్తమున్ = అర్జునుని, తోడరి=ఎదుర్కొని, అందఱు= ఆయక్షభటులందఱును, ఒక్కటన్ = ఒక్కమాఱుగా, చుట్టు = చుట్టును, ముట్టి = ముట్టడించి, పెంపారఁగన్ = బాగుగ, బాణపఙ్క్తులన్ = ఆ కేసి బాణములచే, అంగములన్ = అవయవములను, పగులంగన్=పగులునట్టు, ఏసి = గ్రుచ్చి, విస్ఫార = బలవంతమయిన, గదా=గదలను, శర = బాణము లను, క్షురిక = కత్తులను, పట్టిస = పట్టిసము లనునాయుధములను, తోమర = బల్లెములను, శూల = త్రిశూలములను, ఖడ్గములన్ = కత్తులను, సారథి యుక్తుఁడైన = సారథితోఁగూడిన. రథిసత్తముపైన్ = అర్జునునిమీఁద, ఏపునన్ = ఉత్సాహముతో, కురియించిరి = వర్షించిరి.

తా. ఆయక్షభటు లందఱును ధనుర్ధరుని నెదుర్కొని యాతని ముట్ట డించి యతనియంగములు పగిలిపోవునట్లు బాణములువేసి యనంతరము శరశుతోమరాదిసాధనముల నాతనిపై వర్షించిరి.

వ. అట్లు గురియించిన నతండు. 112

క. పెంపఱి యుండెను ధారా
సంపాతచ్ఛన్న మైన శైలముభంగిన్
గుంపులు గొని యాకసమునఁ
గంపించుచు నపుడు సిద్ధగణములు వరుసన్. 113

టీ. అట్లు కురియించినన్ = ఆప్రకారము బాణవర్షము కురిపింపఁగా, అతఁడు = ఆధ్రువుఁడు, ధారా...చ్ఛన్నము ఐన-ధారా = జడివానయొక్క, సంపాత = కురియుటచేత, ఛన్నమైన = కప్పఁబడిన, శైలముభంగిన్ = పర్వతమువలె, పెంపు అఱి = కాంతిలేక, ఉండెను. అపుడు = ఆసమయమందు, సిద్ధగణములు = సిద్ధులనెడి దేవయోనులగుంపులు, వరుసన్ = క్రమక్రమమున, ఆకసంబునన్ = ఆకాశమునందు, గుంపులు కొని = గుములుగఁగూడి, కంపించుచున్ = వణంకుచు. వైపద్యముతో నన్వయము.

తా. ఆధ్రువుఁ డుదకధారాసమూహములో మునిఁగి కానరాని పర్వతముభంగిని భటులు కప్పిన బాణమధ్యమున నుండి పెంపుదఱిగి యుండెను. అపుడు సిద్ధు లాకసంబున గుంపుఁగూడి మిక్కిలి దిగులొంది యుండిరి.

క. హాహాకారము లెసఁగఁగ
నోహో యీరీతి ధ్రువపయోరుహహితుఁ డు
త్సాహము సెడి యిటు దైత్యస
మూహార్ణవమందు నేఁడు మునిఁగెనె యకటా. 114

టీ. హాహాకారము లెసఁగఁగన్ = ఎంతకష్ట మనుమాటలు హెచ్చుచుండ, ఓహో = ఏమి యాశ్చర్యము, ఈరీతిన్ = ఈప్రకారము, ధ్రువ...తుఁడు-ధ్రువ = ధ్రువుఁడనెడి, పయోరుహహితుఁడు = సూర్యుఁడు, ఉత్సాహముచెడి = ఉత్సాహములేక, ఇట్టు, దైత్య...మందు - దైత్యసమూహ =

రాక్షస సమూహము చెడు, అర్ణవమందు = సముద్రమునందు, నేఁడు=ఈదినము, మునిఁగెనె = మునిఁగిపోయెనుగా. అకటా=అయ్యో.

తా. సిద్ధులందఱును ఆ ట్టాకసమున నుండి హాహాకారంబులు పలుకుచు నిట్టి బలవంతుఁ డగు ధ్రువుఁడు దైత్యసమూహమునఁ బడి చేతఁగానివానివలె ధైర్యము చెడి యుండెనుగదా యేమి యన్యాయము!

వ. అని చింతించుసమయంబున. 115

టీ. అని చింతించుసమయంబున = అని (దేవతలు) వగచు సమయములో.

క. తా మాతని గెలిచితి మని
యామనుజాశనులు వలుక నట నీహార
స్తోమము సమయించుమహో
ద్దాముం డగుసూర్యుఁ బోలి తద్దయుఁ దోఁచెన్. 116

టీ. తాము, ఆతనిన్=ఆధ్రువుని, గెలిచితి మని, ఆమనుజాశనులు = యక్షులు, పలుకన్=పలుకఁగా, అటన్ = ఆసమయమున, నీహార=మంచు యొక్క, స్తోమమున్ = సముదాయమును, సమయించు = నశింపఁజేయు, మహోద్దాముండగు = కడుగొప్పవాఁడైన, సూర్యున్ పోలి = సూర్యునితో సమానముగా, తద్దయున్=మిక్కిలి, తోఁచెన్ = అగపడెను.

తా. అపుడు యక్షు లాధ్రువుని గెల్చితి మని యనుచుండ ధ్రువుఁడు మంచును దెగఁగొట్టు సూర్యునివలె నచ్చటివారల మనస్సునకుఁ దోఁచెను.

వ. అట్లు దోఁచిన. 117

టీ. అట్లు = అవిధముగా, తోఁచినన్ = కన్పట్టఁగా.

తా. ఆప్రకారము కన్పడినతోడనె.

మ. అరిదుఃఖావహమైన కార్ముకము శౌర్యస్ఫూర్తితోఁ
దాల్చి భీకరబాణావళిఁ బింజపింజ గలవంగా నేసి జం
ఝానిలుం, డును మేఘావళిఁ బాఱఁ దోలుగతి నత్యుగ్రా

హిత క్రూరబంధురశస్త్రావళి రూపు మాపె విలసద్దోర్లీల సంధిల్లఁగన్. 118

టీ. అరి...వహమైన - అరి = శత్రువులకు, దుఃఖావహమైన = దుఃఖమును పుట్టించు, కార్ముకము = వింటిని, శౌర్య = ధైర్యముయొక్క, స్ఫూర్తితోన్ = ప్రకాశముతో, తాల్చి = ధరించి, భీ...ణావళిన్-భీకర= భయంకరమయిన, బాణావళిన్ = బాణపంక్తిచే, పింజపింజగ అవంగన్ = మిక్కిలి హింసించునట్లుగా, ఏసి, ఝంఝామారుతము = తుపాను, ఉరు = గొప్పదయిన, మేఘావళిన్ = మేఘపంక్తిని, పాఱఁదోలుగతిన్ = పటాపంచలగునట్లు పరుగెత్తించురీతిని, అత్యు...వళిన్-అత్యుగ్ర = మిగులఁ దీక్ష్ణముగా, అహిత = కూర్పఁబడిన, క్రూర = క్రూరమయిన, బంధుర = దట్టమయిన, శస్త్రావళిన్ = బాణపంక్తిచేత, విలసత్ = ప్రకాశించునట్టి, దోః= బాహువులయొక్క, లీల = విలాసము, సంధిల్లఁగన్ = కలుగఁగా, రూపుమాపెన్ = పోఁగొట్టెను.

తా. అంత సాధువృఁడు శత్రునాశక మగు ధనుస్సును ధరించి యందు భీకరమయిన బాణపరంపరల సంధిరించి, ఝంఝానిలము గొప్పమేఘముల సమూహమును బటాపంచలుగాఁ జేసినట్లు, అతఁడాయత్తుల నంగవికలులఁ జేసెను.

చ. మఱి యపు డమ్మహాత్ముఁ డసమానబలుండు మహోగ్ర బాణముల్, గఱిగఱిఁ దాఁక నేసి భుజగర్వ మెలర్ప విరోధి మర్మముల్, పఱియలు నేసి యంగములు భంగము నొందఁగఁ జేసె వ్రేల్మిడిన్, గిఱికొని పర్వతంబుల నొగిం దెగఁగొట్టెడు నింద్రుకైవడిన్. 119

టీ. మఱి = మఱియును, అపుడు, అసమానబలుండు = తనతో సమానములేని బలముకల, అమ్మహాత్ముఁడు=అధ్రువృఁడు, మహోగ్ర=మిక్కిలి

భయంకరమయిన, బాణముల్ = బాణములను, గ్రుచ్చి = గ్రుచ్చి, దాఁకనేసి = తెక్కలొండింటిఁ దాకునట్లు వేసి, భుజగర్వము = భుజబలమువలని గర్వము, ఎలర్పన్ = అభివృద్ధినొందఁగా, విరోధి = శత్రువులయొక్క, మర్మముల్ = మర్మస్థానములను, పఱియలు సేసి = బ్రద్దలు చేసి, వ్రేల్మిడిన్ = క్షణములోపల, గిఱికొని = చుట్టుకొని, పర్వతంబుల నొగిం దెగఁగొట్టెడు నింద్రుకైవడిన్ = పర్వతముల తెక్కలు తెగఁగొట్టిన యింద్రునిరీతిగా, అంగములు = ఆ శత్రువుల దేహములు, భంగము నొందఁగఁజేసెను.

తా. ఆ మహాబలుఁడైన ధ్రువుఁడు వాఁడిబాణములతో శత్రువుల యొక్క మర్మస్థానములు పీడఁగొట్టి పర్వతముల తెక్కల నొక్కమాఱు ద్రుంచినయింద్రునివలె వారియవయవముల విఱుగ నేసెను.

వ. అయ్యవసరంబున. 120

చ. అలఘుచరిత్రుఁ డమ్మనుకులాగ్రణిచే వికలాంగు లైనవా
  రల సకిరీటకుండలవిరాజితమస్తకకోటిచే సము
  జ్జ్వలమణికంకణాంగదలసద్భుజవర్గముచేత సంగర
  స్థల మతిరమ్యమై తనరె నంచితవీరమనోహరాకృతిన్. 121

టీ. అలఘుచరిత్రుఁడు = గొప్ప చరిత్ర కలిగిన, అమ్మనుకులాగ్రణి చేన్ = ఆధ్రువునిచే, వికలాంగులైనవారలన్, సకి...కోటిచే - సకిరీటకుండల = కిరీటకుండలములతోడి, విరాజిత = ప్రకాశింపఁజేయఁబడిన, మస్తకకోటిచేన్ = అనేకశిరస్సులచేతను, సము...ర్గముచేత - సముజ్జ్వల = ప్రకాశించుచున్న, మణి = మాణిక్యములు చెక్కిన, కంకణ = మురుఁగులు, అంగద = బాహుపురులు వీనితో, లసత్ = ప్రకాశించు, భుజవర్గముచేతన్ = బాహువులసమూహము చేతను, సంగరస్థలము = యుద్ధభూమి, అంచిత = కూడిన, వీర = భటులచే, మనోహర = సొగసైన, ఆకృతిన్ = ఆకారముతో, అతిరమ్యమై = మిక్కిలి సొగసు కలిగి, తనరెన్ = ప్రకాశించెను.

తా. ఆధ్రువుఁ డచ్చటియోధులను వికలాంగులఁజేసి చంపుటవలనఁ గిరీటకుండలములతోఁ గూడిన శిరఃపంక్తులచేతను, మణికంకణాంగదములతో నొప్పారుభుజసమూహములతోడను యుద్ధభూమి మిక్కిలి సొగసుగాఁ గనిపించుచుండెను.

వ. అంత హతశేషులు. 122

టీ. అంతట్ = ఆసమయమున, హత = చావఁగా, శేషులు = మిగిలినవారు.

క. వరబలుఁ డగుమను మనుమని
శరసంఛిన్నాంగు లగుచు సమరవిముఖులై
హరిరాజముఁ గని పఱచెడు
కరిబృందముఁబోలెఁ జనిరి కళవళపడుచున్. 123

టీ. వరబలుఁడగు = గొప్పబలము గలిగినవాఁడగు, మను=స్వాయంభువమనువుయొక్క, మనుమని, మనుమఁడైన ధ్రువునియొక్క, శర = బాణములచేత, సంఛిన్న = తెగఁగొట్టఁబడిన, అంగు లగుచున్ = అవయవములు కలవారగుచు, సమర = యుద్ధమునందు, విముఖులై = నిరాశను జెందినవారై, హరిరాజముఁగని = గొప్పసింహమును జూచి, పఱచెడు=పరుగెత్తు, కరిబృందముఁ బోలెన్ = ఏనుఁగులసముదాయమువలె, కళవళపడుచున్ = వెలవెలపాఱుచు, చనిరి = వెళ్లిపోయిరి.

తా. అట్లు చావఁగా మిగిలినవారు వికలాంగులై యుద్ధమున నిరాశను జెంది సింహరాజమును జూచి పఱుగెత్తుఏనుఁగుసముదాయముచందంబున నాతని బాణపాతంబుల కోర్వఁజాలక పరుగెత్తిపోయిరి.

క. అప్పుడు రాక్షసమాయలు
గప్పినఁ ధ్రువుఁ డసురవరులకార్యం బెఱుఁగం

జొప్పడక వారిఁ బోడఁగనఁ
దెప్పరమడుగుటయు సారథిం గని యంతన్. 124

టీ. అప్పుడు, రాక్షసమాయలు, కప్పినన్ = కప్పఁగా, ధ్రువుఁడు, అసురవరుల = రాక్షసులయొక్క, కార్యంబు = పనులను, ఎఱుఁగన్ = తెలిసికొనుటకు, చొప్పడక = లేక, వారిన్ = రాక్షసులను, పొడఁగనన్ = జాడ తెలిసికొనుటకు, దెప్పరము = దుస్సహవాక్యమును, అడుగుటయున్ = అడిగినతోడనే, అంతన్, సారథింగని = సారథినిజూచి.

తా. అంతట రాక్షసులు మాయలు పన్ని మొద లిడఁగాఁ దన్మాయలు తెలిసికొనఁజాలక, వారిని గనుఁగొనుట దుస్సాధ్య మని యనఁగనే యాధ్రువుఁ డట్టిసారథివైపుఁ జూచి పలుకుచుండెను.

క. తలపోయఁగ భువి మాయా
వులకృత్యం బెఱుఁగ నెవరు వోలుదు రనుచుం
బలుకుచుఁ దత్పురిఁ జొరఁగాఁ
దలఁపఁగ నది గాన రాక తద్దయు మానెన్. 125

టీ. తలపోయఁగన్ = ఆలోచింపఁగా, భువిన్ = భూమియందు, మాయావులకృత్యంబు = మాయలు గల రాక్షసులయొక్క కార్యములు, ఎఱుఁగన్ = తెలిసికొనుటకు, ఎవరు పోలుదురు=ఎవరుచాలుదురు? అనుచుం బలుకుచున్=ఇట్లనుచు, తత్పురిన్=అయలకాపురిలో, చొరఁగాన్ = ప్రవేశించుటకు, తలపన్ కన్=ఎంచఁగా, అది = ఆపురము, కానరాక = అగపడకపోవుటచేత, తద్దయుం = వెంటనె, మానెన్ = ఆప్రయత్నము వదలెను.

తా. ధ్రువుఁడు తనసారథితో మాయావులైన రాక్షసులకృత్యంబులు భూలోకమున నెవఁడును గనుఁగొనలేఁ డని పల్కుచుఁ దత్పురిలోనికిఁ బ్రవేశింప నది యచ్చట నగపడకపోఁగా నూఱకుండెను.

వ. అట్లు పురంబున కరుగుట మాని చిత్రరథుం డైనయాధ్రు
వుండు సప్రయత్నుం డయ్యును బరప్రతియోగశంకితుం
డై యుండె నయ్యెడ మహాజలధిఘోషంబు ననుకరించు
శబ్దంబు వినంబడె నంత సకలదిక్తటంబుల వాయుజనితం
బయినరజఃపటలంబు దోఁచెఁ దత్క్షణంబ యాకాశంబున
విస్ఫురత్తటిత్ప్రభాకలితగర్జారవయుక్తమేఘంబు లమో
ఘంబు లై భయంకరాకారంబు లై తోఁచె నంత. 126

టీ. అట్లు, పురంబునకున్ = పురములోనికి; అరుగుట, మాని, చిత్రరథుండైన = చిత్రరథము గల, ఆధ్రువుండు, సప్రయత్నుం డయ్యును = ప్రయత్నముఁగలిగియుండియు, పరప్రతియోగశంకితుండై = శత్రుప్రయోగమునకుఁ బ్రతిప్రయోగము నాలోచించుచున్నవాఁడై, ఉండెను. అయ్యెడన్ = ఆసమయమునందు, మహాజలధి = గొప్పసముద్రముయొక్క, ఘోషంబును = ధ్వనిని, అనుకరించు=పోలిన, శబ్దంబు=ధ్వని, వినంబడెను. అంత, సక...టంబులన్-సకల = సమస్తమయిన, దిక్తటంబులన్ = దిగంతములయందును, వాయుజనితంబైన=గాలిచేఁబుట్టిన, రజఃపటలంబు దోఁచెన్ = ధూళి అగపడెను. తత్క్షణంబ = ఆసమయమందే, ఆకాశంబునన్ = ఆకాశమునందు, విస్ఫురత్ = ప్రకాశించునట్టి, తటిత్ = మెరుపులయొక్క, ప్రభా=కాంతితో, కలిత = ఒప్పుచున్న, గర్జారవయుక్త = గర్జనాధ్వనులతోఁ గూడిన, మేఘంబులు, అమోఘంబులై = వ్యర్థములు కాక, భయంకర = భయయుక్తమయిన, ఆకారంబులై = రూపముకలవై, తోఁచెన్=కనుపించెను. అంత=తర్వాత.

తా. అంత నాధ్రువుం డాపురిలోనికిఁ బోక శత్రుప్రయోగమునకుఁ బ్రయత్నము గలిగియు ప్రతిప్రయోగమును జింతించుచుండ సమస్తదిక్కుల నుండి గాలి వెలువడెను. పెద్దధ్వనియుఁగూడ వినఁబడెను. ఆగాలి వీఁచుచుండ మెఱుపులతోఁగూడి బాగుగా నురుముచున్న మేఘములు భయంకరముగాఁ గనఁబడుచుండెను.

మ. అనయంబుల్ ధ్రువుమీఁద దైత్యకృతమాయాజాల మ
ట్లేచి భోరన మస్తిష్కపురీషమూత్రఫలదుర్గంధాస్థిమే-
దశ్శరాసన నిస్త్రింశ శరాసి తోమర గదా చక్ర
త్రిశూలాదిసాధనభూభృద్భుజగావళిం గురిసె నుద్దండ
క్రియాలోలతన్. 127

టీ. అనయంబుల్ = ఎల్లప్పుడును, ధ్రువుమీఁదన్, దైత్యకృత = రాక్షసులచేఁ జేయఁబడిన, మాయాజాలము = మాయ సముదాయము, అట్లు = ఆరీతిని, ఏచి = అభివృద్ధినిజెంది, భోరన = పెద్దధ్వనితో, మస్తి .. వళిన్ - మస్తిష్క = మాంసమును, పురీష = పురీషమును, మూత్రఫల = మూత్రఫలమును, దుర్గంధ = దుర్గంధముగల, అస్థి=ఎముకలను, మేదః = మెదడును, శరాసన = ధనుస్సులను, అసి = కత్తులను, తోమర = తోమరములను, గదా చక్ర త్రిశూలాది = గద చక్రము త్రిశూలము మొదలగు, సాధన = సాధనములను, భూభృత్ = పర్వతములను, భుజగావళిన్ = సర్పపంక్తిని, ఉద్దండ = తీక్ష్ణమయిన, క్రియా = కార్యమునందు, లోలతన్ = ఆసక్తిచేత, కురిసెన్ = వర్షించెను.

తా. అంత నాధ్రువునిమీఁద మస్తిష్కమూత్రపురీషాదులను దుర్గంధాస్థిశరాసనతోమరశూలాదులను పర్వతములను మొదలగు క్రూరజంతువులను రాక్షసులు కురిపించిరి

వ. మఱియు మత్తగజసింహవ్యాఘ్రసమూహంబులును నూర్మి
భయంకరంబై సర్వతఃప్లవనం బయినసముద్రంబును గానం
బడియె వెండియుం గల్పాంతంబునందుం బోలె భీషణం
బైనమహాహ్రాదంబునుం దోఁచె నివ్విధంబున నానావిధం

బులు ననేకంబులు నవిరళభయంకరంబులు నయినయసుర
మాయలు క్రూరప్రవర్తను లగుయత్నులచేత సృజ్యమానం
బులై యడరె నాసమయంబున. 128

టీ. మఱియు, మత్త = మదించిన, గజ సింహ వ్యాఘ్ర = ఏనుఁగులు, సింహములు, పులులు వీనియొక్క, సమూహంబులును, ఊర్మి = తరంగములచేత, భయంకరంబై, సర్వతః = అంతటను, ప్లవనంబయిన = పొరుచున్న, సముద్రంబును, కానంబడియె. వెండియుఁ = మఱియు, కల్పాంతంబునం దుంబోలెన్ = కల్పాంతకాలమునందువలె, భీషణంబైన = భయంకరమయిన, మహాహ్రదంబునుంబోలెఁచె = పెద్దసరస్సు కానంబడెను. ఇవ్విధంబున, నానావిధంబులును = పెక్కుతెఱంగులును, అనేకంబులును, అవిరళ = దట్టమయిన, భయంకరంబులు, అయిన, అసుర = రాక్షసులయొక్క, మాయలు, క్రూరప్రవర్తనులగు = క్రూరపునడతలుగలిగిన, యత్నులచేత, ఆసమయంబున, సృజ్యమానంబులై = పుట్టింపఁబడినవై, అడరెన్ = విజృంభించెను.

తా. ఆసమయంబున, ధ్రువునకు గజ సింహ వ్యాఘ్రాదులును, పెద్దతరంగములు గలిగి యంతటను ప్రవహించుసముద్రమును, కల్పాంతకాలమందు గనుపట్టురీతి మహాహ్రదంబును గనుపడె. ఈవిధముగా మాయావులును క్రూరులగుయత్నులు రాక్షసమాయలను సృజించిరి. అసమయమందు.

క. అనయంబును నయ్యత్నుల
ఘనమాయ లెఱింగి మునినికాయము వరుసన్
మనుమనుమని మను మను మని
మనమునఁ దలఁచుచును దత్సమత్నంబునకున్. 129

టీ. అనయంబును = ఎల్లప్పుడును, అయ్యత్నుల = ఆయత్నులయొక్క, ఘన=గొప్పదైన, మాయను, ఎఱింగి = తెలిసికొని, మునినికాయము = మునిసమూహము, వరుసన్=క్రమముగా, మనుమనుమని=ధ్రువుని, మను మనుమని=

బ్రతుకుము బ్రతుకు మని, మనమునన్ = మనస్సునందు, తలఁచుచును, తత్సమ. క్షంబునకున్ = అధ్రువునిసమీపమునకు.

వ. చనుదెంచి యాధ్రువుం గని యి ట్లనిరి. 130

టీ. చనుదెంచి = వచ్చి, అధ్రువుంగని, ఇ ట్లనిరి.

తా. మునీశ్వరులాయత్నులమాయలను దెలిసికొని, యాధ్రువుని జీవింపు మని మనసున దీవించుచు నాతనిసమక్షమునకు వచ్చి యిట్లనిరి.

సీ. అనఘాత్మ లోకు లెవ్వనిదివ్యనామంబు
సమత నాకర్ణించి సంస్మరించి
దుస్తరం బైనమృత్యువు నైన సుఖవృత్తిఁ
దరియింతు రట్టియీశ్వరుఁడు పరుఁడు
భగవంతుఁడును శార్ఙ్గపాణియు భక్తజ
నార్తిహరుండును నైనవిభుఁడు
భవదీయవిమతులఁ బరిమార్చుఁ గా కని
పలికిన మునులసంభాషణములు

తే. విని కృతాచమనుఁ డయి యావిభునిపాద
కమలము దలంచి రిపుభయంకరమహోగ్ర
నిశితనారాయణాస్త్రంబుఁ గార్ముకమునఁ
బూనఁ దడవఁ దదీయసంధానముననె. 131

టీ. అనఘాత్మ=ఓధ్రువుఁడా! లోకులు, ఎవ్వని దివ్యనామంబు = ఏభగవంతుని శ్రేష్ఠమైన నామమును, సమతన్ = సమానబుద్ధితో, ఆకర్ణించి = విని, సంస్మరించి = లెస్సగ ధ్యానించుటచేత, దుస్తరంబైన = దాఁట వీలుకాని, మృత్యువునైన = మరణంబునుకూడ, సుఖవృత్తిన్=సుఖముగా, తరియింతురు= దాఁటెదరో, అట్టి ఈశ్వరుఁడు, పరుఁడు, భగవంతుఁడును, శార్ఙ్గపాణియుం = శార్ఙ్గమనువింటిని చేతియందు ధరించినవాఁడును, భక్తజన ఆర్తిహరుండును =

భక్తులయొక్క దుఃఖముల హరించువాఁడును, ఐన, విభుఁడు = ప్రభువగువిష్ణుమూర్తి, భవదీయ విమతులన్ = నీయొక్క శత్రువులను, పరిమార్చుఁగాక = చంపునుగాక. అని పలికిన, మునుల సంభాషణములు, విని, కృతాచమనుఁడయి = ఆచమనముచేసికొని, యావిభుని = లక్ష్మికి భర్తయైన విష్ణువుని, పాదకమలముఁ, తలంచి, రిపు...స్త్రంబున్ - రిపు = శత్రువులకు, భయంకర = భయమును బుట్టించు, మహోగ్ర = మిగుల భయంకరముగా, నిశిత = వాఁడిచేయఁబడినట్టి, నారాయణాస్త్రంబున్ = నారాయణాస్త్రమును, కార్ముకమునన్ = ధనుస్సునందు, పూనన్ = కూర్చుటకు, తడవన్ = ఎత్తఁగా, తదీయ = ఆనారాయణాస్త్రము యొక్క, సంధానమునను = కూర్పుటచేత, వైపద్యముతో నన్వయము.

తా. అట్లు మునీశ్వరు లాధ్రువునియొద్దకు వచ్చి, యాతనితో నెవ్వని నామస్మరణమున దాఁటలేని మృత్యువునైతము దాఁటఁబడునో యట్టి పరమ పురుషుని దలఁచిన, తప్పక నీశత్రువులను సంహారింతువని చెప్పఁగానే యా ధ్రువుఁడు తత్పరమేశుని. సంస్మరించి యాచమనమొనర్చి తనధనుస్సున నారాయణాస్త్ర సంధానమొనర్చెను. అట్లు సంధింపఁగానే.

తే. కడఁగి గుహ్యకమాయాంధకార మపుడు
వెరవుసెడి దవ్వుదవ్వుల విరిసి పోయె
విమల మైనవివేకోదయమునఁ జేసి
సమయు రాగాదికంబులసరణి నంత. 132

టీ. అపుడు = అట్లు నారాయణశాస్త్రము సంధించినప్పుడు, గుహ్యక...కారము-గుహ్యక = యక్షులయొక్క, మాయా అంధకారము = మోసపుఁబనులనెడి చీఁకటి, విమలము ఐన = స్వచ్ఛమైన, వివేక ఉదయమునఁ జేసి = జ్ఞానము పుట్టుటచేత, సమ...సరణిన్ - సమయుం = నశించు, రాగ ఆదికంబులసరణిన్ = ఆశ మొదలగువానివలె, వెరవుసెడి = తోఁ

చక, దవ్వుదవ్వులన్ = దూరదూరముననే, కడఁగి = పూనికతో, విరిసి పోయెన్ = చెల్లాచెదరయ్యెను, అంతన్ = తర్వాత.

తా. ధ్రువుఁడు నారాయణాస్త్రము సంధింపఁగానే నిర్మలజ్ఞానో దయముచేత రాగద్వేషములు మొదలగునవి పటాపంచలగునట్లు, ఆయక్షుల మాయలనెడి చీఁకటి భయముచేఁ జెల్లాచెదరయి మూలమూలలకుఁ బోయెను.

మ. వరనారాయణదేవతాస్త్రభవదుర్వారప్రభాహేమపుం
ఖరుచిస్ఫారమరాళరాజసితపక్షక్రూరధారాపత
చ్ఛరసాహస్రము లోలి భీషణవిపక్షశ్రేణిపై వ్రాలె భీ
కరరావంబునఁ గానఁ జొచ్చుశిఖిసంఘాతంబుచందంబునన్.

టీ. వర...సహములు-వర=శ్రేష్ఠమయిన, నారాయణదేవతాస్త్రభవ= నారాయణాస్త్రమునుండి పుట్టిన, దుర్వార = వారింపరాని, ప్రభా=కాంతి గల, హేమ పుంఖ=సువర్ణమయమయిన ములుకులయొక్క, రుచి=కాంతుల చేత, స్ఫార = విస్తరించినట్టి, మరాళరాజ=రాజహంసలయొక్క, సితపక్ష= తెల్లనిరెక్కలవంటి, క్రూర=భయంకరమయిన, ధారా=అంచులతో, పతత్= పడుచున్న, శరసాహస్రముల్ = వేలకొలఁదియైనబాణములు, ఓలిన్=వరు సఁగా, నిలువక యని యర్థము. భీకరరావంబునన్ = భయంకరమయిన ధ్వనితో, కానఁజొచ్చు = కన్పడునట్టి, శిఖిసంఘాతంబుచందంబునన్ = అగ్నిసమూహము రీతిని, భీష...ణిపైన్ - భీషణ = భయంకరులైన, విపక్షశ్రేణిపైన్ = శత్రువులపైన, వ్రాలెన్ = పడెను.

తా. ఆధ్రువుఁడు పెద్దధ్వనితోఁ గానిపించు నగ్నిరీతిగాఁ, దనవర నారాయణాస్త్రముయొక్క కొనను బ్రకాశించు తెల్ల ఱెక్కలు గల యపరి మితములగు బాణములను దుర్వారు లగు శత్రువులమీఁద వేసెను.

వ. అట్లేసిన. 134

టీ. అట్లేసినన్ = అట్లు ధ్రువుఁడు బాణము లేయఁగా.

చ. ఖరనిశితప్రదీప్తఘనకాండపరంపరవృష్టిచేఁ బోరిం, బోరి వికలాంగు లై యడరి పుణ్యజనుల్ పృథుహేతిపాణు లై, గరుడునిఁ జూచి భూరిభుజగప్రకరంబు లెదిర్చి పేర్చెచె, చ్చెర నడతెంచుచందమునఁజిత్రరథుఁ బలుపూని తాఁకినన్.

టీ. ఖర...వృష్టిచేఁ - ఖర నిశిత = మిగులఁ దీక్ష్ణములై, ప్రదీప్త=ప్రకాశించునట్టి, ఘన = గొప్పవైన, కాండపరంపర = బాణసమూహము నెడి, వృష్టిచేఁ=వర్షముచే, పోరింబోరి=మిక్కిలి, వికలాంగులై=విఱిఁగిన యవయవములుకలవారై, అడరి=చెలఁగి, పుణ్యజనుల్ = రాక్షసులు (యక్షులు), పృథు...ణులై-పృథు=గొప్ప, హేతిపాణులై=కత్తులను ధరించి, గరుడునిఁ, చూచి, భూ...రంబులు - భూరి=విస్తారమయిన, భుజగప్రకరంబులు=పాములసముదాయములు, ఎదిర్చి=ఎదురుగా వెళ్లి, పేర్చి = సమముగాఁగూడి, చెచ్చెరన్=శీఘ్రముగా, అడతెంచుచందమునన్=వ్రాలినొందు రీతిగా, చిత్రరథుఁ = ధ్రువుని, బలుపూని = మిక్కిలి పూనికతో, తాఁకినన్ = తాఁకినతోడనే.

తా. ధ్రువునిబాణపరంపరలచే నంగవైకల్యమును గల్గియుఁ, గరుడునిఁ జూచి పాము లెదురుగఁ బోయి చచ్చురీతిని నాయక్షులు బలము నూని యాతనిఁ దాఁకఁగా.

ఉ. వారలఁ జండతీవ్రశరవర్గముచేత నికృత్తపాదజం
ఘోరుశిరోధరాంబకకరోదరకర్ణులఁ జేసి యోగి పం
కేరుహమిత్రమండలసకృద్భిద నెట్టిపదంబుఁ జెందు నా
భూరిపదంబునం బెలుచఁ బొందఁగఁ బంపె భుజావిజృంభియై.

టీ. వారలన్ = ఆయక్షులను, చండ...ముచేతన్ - చండ=భయంకరమయిన, తీవ్రశరవర్గముచేతన్ = తీవ్రమగుబాణసమూహముచే, నికృ...కర్ణులన్ - నికృత్త = ఛేదింపఁబడిన, పాద = పాదములు, జంఘా=పిక్క

లు, ఊరు = తొడలు, శిరోధరా = మెడలు, అంబక = కన్నులు, కర = హస్తములు, ఉదర = కడుపులు, కర్ణలన్ చేసి = చెవులను కలవారినిగాఁ జేసి, యోగి...భిదన్ - యోగి=యోగియగువాఁడు, పంకేరుహమిత్రమండల=సూర్యమండలముయొక్క, సకృద్భిదన్ = ఒక్కమాఱుగ భేదించుటచే, ఎట్టిపదంబున్ = ఎటువంటి పరమపదమును, చెందును=పొందునో, అభూరిపదంబునన్=అట్టిగొప్పపదవియందు, భుజావిభృంభియై=భుజబలము కలవాఁడై, వెలుచన్ = దట్టముగా, పొందఁగఁబంపెన్ = పొందించుచుండెను.

తా. ఆధ్రువుఁడు తీవ్రబాణపరంపరలచే నాయత్తులఁ బ్రత్యంగవికలులఁజేసి వారిని యోగీశ్వరులు సూర్యమండలమును భేదించి చెందు పరమపదమునకు నంపుచుండెను. (అనఁగా నాయత్తుల నందఱను ధ్రువుఁడవలీలగాఁ జంపుచుండె నని భావము.)

వ. ఇవ్విధంబున నాచిత్రరథుం డగు ధ్రువునిచేత నిహన్యమానులును నిరపరాధులును నయినగుహ్యకులం జూచి యతని పితామహుం డైనస్వాయంభువుండు ఋషిగణపరివృతుండై చను దెంచి ధ్రువునింజూచి యిట్లనియె వత్సా నిరపరాధులైన యీపుణ్యజనుల నెట్టిరోషంబున వధియించితి వట్టి నిరయహేతు వైనరోషంబు చాలు భాతృవత్సల భాతృవధాభితప్తుండవై కావించునీయత్నం బుడుగు మని. 137

టీ. ఇవ్విధంబునన్ = ఈలాగు, ఆచిత్రరథుండగు ధ్రువునిచేతన్ = వింతయైనరథముగల ఆధ్రువునిచేత, నిహన్యమానులును=చంపఁబడినవారును, నిరపరాధులును=అపరాధము లేనివారును, అయినగుహ్యకులం జూచి, అతని పితామహుండు = ఆధ్రువుని తాత, ఐన, స్వాయంభువుండు, ఋషి...తుండై-ఋషిగణ=మునిగణముతో, పరివృతుండై=కూడినవాఁడై, చను దెంచి=వచ్చి, ధ్రువునిఁజూచి, ఇట్లనియె. వత్సా! నిరపరాధులైన యీపుణ్యజనులను=తప్పు లేని యీయత్తులను, ఎట్టిరోషంబునన్ = ఏకోపముతో, వధి

యించితి=చంపితివో, అట్టి, నిరయ=నరకమునకు, హేతువైన = కారణమయిన, రోషంబు, చాలు=విడువుము. భ్రాతృవత్సల = తమ్మునందుఁ బ్రేమ గలవాఁడా! భ్రా...డవై-భ్రాతృవధ = భ్రాతృవధచేత, అభితప్తుండవై = తపించినవాఁడవై, కావించు = చేయు, ఈ యత్నంబు ఉడుగుము = ఈ పూనిక నిలుపుము.

క. అనఘా మనుకులమునఁ కిది
యనుచితకర్మంబ యొకనికై పెక్కండ్రు
ట్లని మొనఁ ద్రుంగిరి యిది నీ
కనయంబును వలవ దుడుగు మయ్య కుమారా! 133

టీ. అనఘా = ధ్రువుఁడా! మనుకులమునకున్, ఇది = ఈకార్యము, అనుచితకర్మంబ=తగనిపనియే. ఒకనికై=ఒక్క భ్రాతృవధనిమిత్తము, పెక్కండ్రు = అనేకులు, ఇట్లు, అని మొనన్ = యుద్ధమున, త్రుంగిరి = చచ్చిరి. ఇది, నీకు, అనయంబును = ఎప్పుడును, వలవదు = చేయఁదగదు, కుమారా! ఉడుగుము = ఈ ప్రయత్నమును చాలింపుము.

తా. ఓ ధ్రువుఁడా! ఒక్క భ్రాతృవధకై యింతమందిని నొక్కమాఱు చంపఁదగదు. మనవంశమున కిట్టిపని తగదు గాన నిట్టిదానిని నీవు చాలింపుము.

వ. అదియునుం గాక దేహాభిమానంబునం బశుప్రాయులై భూతహింస గావించుట హృషీకేశానువర్తులైన సాధువులకుం దగదు నీవు సర్వభూతంబుల నాత్మభావంబునఁ దలఁచి సర్వభూతావాసుండును దురారాధ్యుండును నైన విష్ణునిపదంబులఁ బూజించి తత్పరమపదంబును బొందితి వట్టిభగవంతుని హృదయంబున ననుధ్యాతుండవు భాగవతులచిత్తంబులకును సమ్మతుండవు మఱియు సాధువర్తనుండ వన నొ

ప్పునీ వీపాపకర్మం బెట్లు సేయ సమకట్టితి వేపురుషుం డై న నేమి మహాత్ములయందుఁ దితిక్షయు సములయందు మై త్రియు హీనులయందుఁ గృపయు నితరంబు లగుసమ స్తజం తువులయందు సమత్వంబును గలిగి వర్తించువానియందు సర్వాత్మకుం డైన భగవంతుండు ప్రసన్నుం డగు నతండు ప్రసన్నుం డయిన వాఁడు ప్రకృతిగుణంబులం బాసి లింగ శరీరభంగంబు గావించి బ్రహ్మానందంబునుం బొందు నదియు నుం గాక కార్యకారణసంఘాతరూపం బైనవిశ్వం బీశ్వరు నందు నయస్కాంతసన్నిధానంబు గలిగినలోహంబుచందం బున వర్తించు నందు సర్వేశరుండు నిమిత్తమాత్రంబుగాఁ బరిభ్రమించు నట్టి యీశ్వరుని మాయాగుణవ్యతికరంబున నారబ్ధంబులైన పంచభూతంబులచేత యోషిత్పురుషవ్య వాయంబువలన యోషిత్పురుషాదిరూపసంభూతి యగు ని వ్విధంబునఁ దత్సర్గంబు దత్సంస్థానంబుఁ దల్లయంబు నగు చు నుండు నిట్లు దుర్విభావం బైనకాలశక్తిం జేసి గుణ క్షోభంబున విభజ్యమానవీర్యుండు ననంతుండు ననాదియు నై జనంబులచేత జనంబులం బుట్టించుచుండుటం జేసి యా దికరుండును మృత్యుహేతువు లగుజనంబుల లయంబు నొం దించుటం జేసి యంతకరుండును ననాపి యగుటం జేసి యవ్య యుండును నైనభగవంతుండు జగత్కారణుం డగుం గా వున నీసృష్టిపాలనవిలయంబులకుం గర్తగానివాని వడు వున దానిఁ జేయుచుండు నిట్లు మృత్యురూపుండును బరుం డను సమవర్తియు నైన యీశ్వరునికి స్వపక్షపరపక్ష

బులు లేవు కర్మాధీనంబు లైనభూతసంఘంబులు రజంబు
లు మహావాయువు ననుసరించుచాడ్పున నస్వతంత్రంబు
లగుచు నతని ననువర్తించు నీశ్వరుండును జంతుచయాయు
రుపచయాపచయకరణంబులం దస్పృష్టుండును నగు జీ
వుండు గర్మబద్ధుం డగుటం జేసి కర్మంబ వానికి నాయురు
పచయాపచయంబులం జేయుచుండు మఱియు సర్వజగ
త్కర్మసాక్షి యగు సర్వేశ్వరుని. 139

టీ. అదియునుంగాక, దేహాభిమానంబునన్ = దేహమందలి మోహముచే, పశుప్రాయులై = పశువులతో సమానులై, భూతహింస = జంతువులకుబాధ, కావించుట = చేయుట, హృషీకేశానువర్తులైన = విష్ణుభక్తులైన, సాధువులకున్ = సజ్జనులకు, తగదు. నీవు, సర్వభూతంబులన్ = సమస్తజీవజంతువులను, ఆత్మభావంబునన్ = మనస్సులో, తలఁచి, సర్వ...సుండును-సర్వభూత = సమస్తభూతములయందు, ఆవాసుండును = ఉండువాఁడును, దురారాధ్యుండును = పూజింప శక్యముకానివాఁడును, ఐన, విష్ణునిపదంబులన్ = విష్ణుపాదములను, పూజించి, తత్ = ఆవిష్ణువుయొక్క, పరమపదంబును = ముఖ్యస్థలమును, పొందితివి. అట్టిభగవంతుని, హృదయంబునన్ = మనస్సునందు, అనుధ్యాతుండవు = సర్వదా తలఁపఁబడువాఁడవు, భాగవతుల చిత్తంబులకున్ = భగవద్భక్తుల యొక్కమనంబులకు, సమ్మతుండవు = ఇష్టుఁడవు. మఱియుఁ, సాధువర్తనుండవు = మంచినడవడికలవాఁడవు, అనన్ ఒప్పు = అనఁదగిన, నీవు, ఈపాప కర్మంబు, ఎట్లు = ఏవిధముగా, చేయన్ = చేయుటకు, సమకట్టితి = ఎంచితివో! ఏపురుషుండైనన్ ఏమి = ఎవఁడైననేమి, మహాత్ములయందున్, తితిక్షయు = ఓరిమియు, సములయందున్ = సమానులయెడ, మైత్రియుం = స్నేహముకలుగుటయుం, హీనులయందున్ = తగ్గువారియందు, కృపయుం = దయయు, ఇతరంబులగు సమస్త జంతువులయందు, సమత్వంబును = ఒకటేయనుతలంపును, కలిగి, వర్తించున్ =

ఉండునో,వానియందుఁ, సర్వాత్మకుండైన=సర్వస్వరూపుఁడగు, భగవంతుండు, ప్రసన్నుండగుఁ = దయకలవాఁడగును. అతండు = భగవంతుఁడు, ప్రసన్నుండయినఁ=అనుగ్రహించినచో, వాఁడు=భగవంతునియనుగ్రహసంపాదకుఁడు, ప్రకృతిగుణంబులఁ = సత్వరజస్తమోగుణములను, పాసి=విడిచి, లింగశరీరభంగంబు = కారణదేహముయొక్క నాశమును, కావించి, బ్రహ్మనందంబును, పొందును. అదియునుంగాక,కార్యకారణసంఘాతరూపంబయిన= కార్యములయుఁ కారణములయు సమూహముగ నేర్పడియున్న, విశ్వంబు= ప్రపంచము, ఈశ్వరునందు, అయ...నంబు-అయస్కాంత = సూదంటు రాయియొక్క, సన్నిధానంబు=సమీపంబును, కలిగిన=పొందిన, లోహంబు చందంబునఁ = లోహమురీతిని, వర్తించును. అందు, సర్వేశ్వరుండు, నిమిత్తమాత్రంబుగాఁ = కారణము మాత్రమై, పరిభ్రమించుఁ=తిరుగును. అట్టి యీశ్వరునిమాయాగుణవ్యతికరంబునఁ = అట్టిమహేశ్వరుని మాయాగుణ సంబంధముచేత, ఆరబ్ధంబులైన = ప్రారంభింపఁబడిన, పంచభూతంబులచేత, యోషిత్ = స్త్రీలయొక్కయు, పురుష=పురుషులయొక్కయు, వ్యవాయంబువలనఁ=కూడికచేత, యోషిత్పురుషాది = స్త్రీలు పురుషులు మొదలగు రూప = రూపములయొక్క, సంభూతి = పుట్టుక, అగును. ఇవ్విధంబున, తత్సర్గంబుఁ = ఆసృష్టిని, తత్=ఆసృజింపఁబడినవానియొక్క, సంస్థానంబుఁ = ఉనికిని, తత్=ఆయున్నవానియొక్క, లయంబును=నాశనమును, అగుచునుండు. ఇట్లు, దుర్విభావ్యంబైన = ఊహించుటకలవిగాని, కాలశక్తిం జేసి = కాలమనెడుశక్తిచేత, గుణ...ర్యుండు-గుణ = రూపస్పర్శాదిగుణములయొక్క, క్షోభంబునఁ=కలవరపాటుచేత, విభజ్యమాన=కొట్టివేయఁబడిన, వీర్యుండును=పరాక్రమముకలవాఁడును, అనంతుండును = అంతములేనివాఁడును, అనాదియుం=మొదలులేనివాఁడును, ఐ, జనంబులచేతఁ, జనంబులం బుట్టించుచుండుటంజేసి, ఆదికరుండును = పుట్టువు గల్గించువాఁడును, మృత్యుహేతువులగు=చావునకుఁ గారణభూతులయిన, జనంబులఁ=జనులను, అడఁపంబునొందించుటం జేసి=నాశము నొందించుటచేత, అంతకరుండును =

నాశముచేయువాఁడును, అనాదియగుటంజేసి = తనకంటెనాదిలేకపోవుట
చేత, అవ్యయుండును=నాశనము లేనివాఁడును, ఐన భగవంతుండు, జగత్ =
ప్రపంచమునకు, కారణుండగుచున్, కావునన్, సృ.. లకున్-సృష్టి = సృష్టికి,
పాలన = స్థితికి, విలయంబులకున్ = నాశనమునకును, కర్తగానివానివడు
వునన్ = కర్తగాకుండువానివలె, దానిని = ఆసృష్టిస్థితిలయములనువానిని,
చేయుచుండును. ఇట్లు, మృత్యురూపుండును, పరుండును = ఉత్తముఁడును,
సమవర్తియుఁ=సమానదృష్టికలవాఁడును, ఐనయీశ్వరునికిన్=అయినపరమాత్మ
నకు, స్వపక్షపరపక్షంబులు=తమవారు పొరుగువారనుట, లేవు. కర్మాధీనంబు
లైన=కర్మకులోనైన, భూతసంఘంబులు=ప్రాణికోట్లు, రజంబులు = ధూళి,
మహావాయువును=గొప్పగాలిని, అనుసరించు చాడ్పున = వెంబడించుతీరున,
అస్వతంత్రంబులగుచున్ = స్వతంత్రములు గాక, అతనిని = ఆభగవంతుని,
అనువర్తించును = వెంబడించును, ఈశ్వరుండును, జంతు...లందున్-జంతు
చయ=ప్రాణిసమూహముయొక్క, ఆయుః=ఆయుర్దాయముల, ఉపచయ=
అభివృద్ధియొక్క, అపచయ = నాశముయొక్క, కరణంబులందున్=చేయుంట
యందు, అస్పృష్టుండును = ముట్టనివాఁడును, అగును. జీవుండు, కర్మబద్ధుం
డగుటంజేసి = కర్మచేఁ గట్టఁబడినవాఁడగుటచేత, కర్మంబ=కర్మమే, వానికి=
ఆజంతువునకు, ఆయుః = ఆయుర్దాయముయొక్క, ఉపచయాపచయంబు
లన్ = వృద్ధిక్షయములను, చేయుచుండును. మఱియు, సర్వ...సాక్షి-
సర్వ=సమస్తమయిన, జగత్ = ప్రపంచముయొక్క, కర్మ=కర్మములకు, సాక్షి
యగు సర్వేశ్వరుని, వైపద్యముతో నన్వయము.

క. కొందఱు స్వభావ మందురు
 కొందఱు కర్మం బటండ్రు కొందఱు కాలం
 బందురు కొందఱు దైవం
 బందురు కొంద ఱొగిఁ గామ మండ్రు మహాత్మా! 140

టీ. మహాత్మా = గొప్పస్వభావము గలవాఁడా! కొందఱు, ఆభగవంతుని, స్వభావమందురు = స్వభావమని చెప్పుదురు. కొందఱు, కర్మంబు = కర్మమని, అటు అంద్రు = అట్లు అందురు. కొందఱు, కాలంబు అందురు. కొందఱు, దైవంబు = దైవమని, అందురు. కొందఱు, ఒగిన్ = వరుసగా, కామము = కోరిక యని, అంద్రు = అందురు.

తా. ఓమహాత్మా! ఆట్టిపరమేశుని స్వభావమనియుఁ, గర్మమనియు, గాలమనియు, దైవమనియుఁ, గామమనియు ననేకు లనేకరీతులుగాఁ జెప్పుదురు.

వ. ఇట్టి లవ్యక్తరూపుండును నప్రమేయుండును నానాశక్త్యుదయ హేతుభూతుండును నైనభగవంతుండు నేయుకార్యంబులు బ్రహ్మరుద్రాదు లెఱుంగ రఁట యతనితత్వంబు నెవ్వ రెఱుంగనోపుదు రది గావునఁ బుత్రా యిట్టిత్పత్తిస్థితిలయంబులకు దైవంబు కారణం బై యుండ నీధనదానుచరులు భవదీయభ్రాతృహంత లగుదురే భూతాత్మకుండు భూతేశుండు భూతభావనుండు సర్వేశ్వరుండుఁ బరాపరుండునగు నీశుండ మాయాయుక్తుం డై స్వశక్తిచే సృష్టిస్థితిలయంబులం జేయు నైన నహంకారంబునం జేసి గుణకర్మంబులచే నస్పృశ్యుండగుచు వర్తించు నదియునుంగాక యీ ప్రజాపతులు విశ్వసృణ్నామంబుల నియంత్రితులై ముకుఁద్రాళ్లఁ బెట్టినపశువులుంబోలె నెవ్వనియాజ్ఞాధీనకృత్యు లై వర్తింతు రట్టిదుష్టజనమృత్యువును సుజనామృతస్వరూపుండును సర్వాత్మకుండును జగత్పరాయణుండునునైన యీశ్వరుని సర్వప్రకారంబుల శరణంబుఁ బొందు మదియునుంగాక. 141

టీ. ఇట్టులు = ఈప్రకారము, అవ్యక్తరూపుండును = స్పష్టము గాని రూపము గలవాఁడును, అప్రమేయుండును=మితములేనివాఁడును, నానా... తుండును-నానా = అనేకవిధములయిన, శక్తి = ప్రభుమంత్రోత్సాహాదిశక్తుల యొక్క, ఉదయ=ఉత్పత్తికి, హేతుభూతుండును = కారణమయినవాఁడును, ఐన, భగవంతుండు చేయు, కార్యంబులు, బ్రహ్మరుద్రాదులును, ఎఱుంగరఁట = బ్రహ్మరుద్రాదులకుఁ దెలియవఁట, అతని తత్త్వంబు=ఆవిష్ణువుయొక్కయథార్థ స్థితి, ఎవ్వరు, ఎఱుంగన్ = తెలిసికొనుటకు, ఓపుదురు=సామర్థ్యము గలవారు, అదిగావునన్ = అందుచేత, పుత్రా ఇట్టు, ఉత్పత్తిస్థితిలయంబులకున్=పుట్టుట పెరుగుట నశించుటకు, దైవంబు, కారణంబై యుండఁగ = కారణమై యుండఁగ, ఈధనద = ఈకుబేరునియొక్క, అనుచరులు=సేవకులైనయక్షులు, భవదీయ = నీయొక్క, భ్రాతృహంతలు = తమ్ముని చంపినవారు, అగుదురే = అయియుందురా? భూతాత్మకుండు=సమస్తభూతముల నాత్మయందుఁ గలవాఁడు, భూతేశుండు = సమస్తభూతములకు నధిపుఁడును, భూతభావనుండు = సకలభూతములఁ పాలించువాఁడును, సర్వేశ్వరుండును = అన్నిటికిఁ బ్రభువును, పరాపరుండును అగు, జీవునికంటె నుత్తముఁడు నగు, ఈశుండ = ఈశ్వరుఁడే, మాయాయుక్తుండై = మాయతోఁ గూడినవాఁడై, స్వశక్తిచేన్ = తననేర్పుచే, సృష్టిస్థితిలయంబులన్ = పుట్టుక సంరక్షణ నాశములను, చేయును. ఐన యహంకారంబునం జేసి = అట్టి యహంకారమువలన, గుణకర్మంబులచేన్-గుణ = గుణములచేతను, కర్మంబులచేన్=కర్మల చేతను, అస్పృశ్యుండగుచున్ = దేనిచేతను ముట్టికొనఁబడనివాఁడై, వర్తించును = ఉండును. అదియునుంగాక, ఈప్రజాపతులు = ఈబ్రహ్మలు, విశ్వసృణ్ణామంబులన్ = ప్రపంచమును సృజించువార లను పేరులతో, నియంత్రితులై = నియమింపఁబడినవారై, ముకుఁద్రాళ్లఁ బెట్టిన = ముక్కునకుఁ ద్రాళ్లఁ గట్టఁబడిన, పశువులుంబోలెన్ = పశువులవలె, ఎవ్వని = ఏపరమేశునియొక్క, ఆజ్ఞా = ఆజ్ఞకు, అధీనకృత్యులై = లోఁబడిన కార్యములు కల

వారై, వర్తింతురు = ఉండెదరో, అట్టి, దుష్టజన=దుర్మార్గుల, మృత్యువును= చంపునదియును, సుజన = సన్మార్గులకు, అమృతస్వరూపుండును = అమృతమ వంటివాఁడును, సర్వాత్మకుండును = అంతట నిండియున్నవాఁడును, జగత్పరాయణుండును = లోకరక్షణయందు దాసక్తుఁడును, ఐన, ఈశ్వరుని, సర్వప్రకారంబులన్, శరణంబు, పొందుము. అదియునుంగాక.

తా. సులభము.

సీ. అనఘాత్మ నీవు పంచాబ్దవయస్కుండ
వై పినతల్లి నిన్నాడినట్టి
మాటల నిర్భిన్నమర్ముండ వగుచును
జనయిత్రి దిగనాడి వనము కేగి
తప మాచరించి యచ్చపుభక్తి నీశ్వరుఁ
బూజించి మహితవిభూతి మెఱసి
రమణఁ ద్రిలోకోత్తరం బైనపదమును
బొందితి వది గాన భూరిభేద

తే. రూప మైనప్రపంచంబు రూఢి నేమ
హాత్మునందుఁ బ్రతీతమై యలరు నట్టి
యగుణుఁ డద్వితీయుండును నక్షరుండు
నైనయీశ్వరుఁ బరమాత్ము ననుదినంబు. 142

టీ. అనఘ ఆత్మ = దోషరహిత మయిన అంతఃకరణము గలయో ధ్రువుఁడా! నీవు, పంచాబ్దవయస్కుండవై = అయిదు సంవత్సరముల వయస్సు కలిగి, పినతల్లి, నిన్నాడినట్టిమాటలచే, నిర్భిన్న = తెగఁగొట్టఁబడిన, మర్ముండ వగుచును = మనస్సుకలవాఁడవై, జనయిత్రిన్ = నీతల్లిని, దిగనాడి = విడిచిపెట్టి, వనముకేగి = వనమునకుఁ బోయి, తప మాచరించి = తపస్సుచేసి, అచ్చపుభక్తిచేన్ = నిజమైనభక్తితో, ఈశ్వరున్ = పరమేశుని, పూజించి, మహితవిభూతిన్ = ఎక్కువ యైశ్వర్యముతో, మెఱసి =

ప్రకాశించి, రమణన్ = ప్రేమతో, త్రిలోక = మూఁడులోకములకంటెను, ఉత్తరంబైన = శ్రేష్ఠమయిన, పదమును = పరమపదమును, పొందితివి. ఆదికారణన్ = ఆకారణమున, భూరి = విస్తారమగు, భేదరూపమైన = వేఱగు, ప్రపంచంబు = ప్రపంచము, రూఢిన్ = నిశ్చయముగా, ఏ మహాత్మునందు, ప్రతీతమై = ప్రసిద్ధమయినదై, అలరున్ = ప్రకాశించునో, అట్టి, అగుణుఁడు = సత్త్వాదిగుణరహితుఁడు, అద్వితీయుండును = తన కంటె వేఱు లేనివాఁడును, అక్షరుండును = ఎన్నటికి నాశము లేనివాఁడును, ఐన, ఈశ్వరున్ = ప్రభువైన, పరమాత్మున్ = పరమాత్ముని, అనుదినంబు = ప్రతిదినమును, కైకొని యను పైపద్యముతో నన్వయము.

తా. ఓధ్రువుఁడా ! నీ వయిదుసంవత్సరములు మాత్రమే వయసు కలిగియుండి నీతల్లి యాడిన పరుసనిమాటల కోర్వక యొంటరిగా వనమునకుఁ బోయి గొప్పతపస్సుచేసి నిజమైనభక్తితోఁ బద్మనాభుని బూజించితివి గావున నట్టి యాద్యుఁడును సర్వాత్ముఁడు నైన పరమేశుని ధ్యానింపు మని యాస్వా యంభువుండు మనుమనికిఁ జెప్పుచున్నాఁడు.

సీ. కైకొని శుద్ధంబు గతమత్సరంబును
  నమలంబు నగుహృదయంబునందు
పొలవ కన్వేషించుచును బ్రత్యగాత్ముండు
  భగవంతుఁడును బరబ్రహ్మమయుఁడు
నానందమాత్రుండు నవ్యయుఁ డుపపన్న
  సకలశక్తియుతుండు సగుణుఁ డజుఁడు
నయినసర్వేశ్వరునం దుత్తమం బైన
  సద్భక్తిఁ జేయుచు సమత నొప్పి
తే. రూఢి సోఽహమ్మమేతి ప్రరూఢ మగుచు
  ఘనత కెక్కు నవిద్య యన్ గ్రంథి నీవు

ద్రెంచి వైచితి కావున ధీవరేణ్య
సర్వశుభహాని యైనరోషంబు వలదు. 143

టీ. కైకొని = స్వీకరించి, శుద్ధంబు = పరిశుద్ధమైనది, గతమత్సరంబును = మాత్సర్యములేనిదియు, అమలంబును అగు = నిర్మలమయినదియు నగు, హృదయంబునందు, సొలవక = దుఃఖింపక, అన్వేషించుచును = వెదకుచును, ప్రత్యగాత్ముండును=చక్షురింద్రియమున కగోచరుఁడును, భగవంతుఁడును = షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును, పరబ్రహ్మమయుండును = పరబ్రహ్మస్వరూపుఁడును, ఆనందమాత్రుండు = ఆనందస్వరూపమైనవాఁడును, అవ్యయుండు = నాశనములేనివాఁడు, ఉప...యుంతుండును-ఉపపన్న=కూడిన, సకల = సమస్త, శక్తియుతుండు=శక్తికలవాఁడును, సగుణుఁడు=గుణములు గలవాఁడును, అజుఁడు=పుట్టుకలేనివాఁడును, ఐన, సర్వేశ్వరునందుఁన్, ఉత్తమంబైన = శ్రేష్ఠమయిన, సద్భక్తిన్ = మేటిభక్తిని, చేయుచు, సమతన్ = సమభావముతో, ఒప్పి, రూఢిన్ = నిశ్చయంబుగా, సోఽహమ్ = ఆపరమాత్మ నేనే, మమ ఇతి = అంతయు నాస్వరూపమే అని, ప్రరూఢమగుచున్ = నిశ్చయమయి, ఘనతకెక్కు = గొప్పదగునట్టి అవిద్యన్ = మాయయనునట్టి, గ్రంథిన్ = ముడిని, నీవు, త్రెంచివైచితివి. కావున = కాఁబట్టి, ధీవరేణ్య = మిగులబుద్ధిగలిగినవాఁడా! సర్వ = సమస్తమయిన, శుభ = మంగళములకు, హానియైన = హానిచేయు, రోషంబు = కోపము, వలదు = విడువుము.

తా. కాన నోధర్మపుత్రుఁడా! నీ వట్టిమహాపురుషు నాశ్రయించి మిగుల శక్తితోఁ బూజించి తత్స్వరూపివై సోఽహ మ్మనెడిజ్ఞానమును బొంది యుండియు, మాయ నంతను జయించియుంటివి. కాఁబట్టి సమస్తమంగళముల నపహరించుకోపంబును జూపకుము.

క. విను రోషహృదయుచేతను
నసయము లోకము నశించు నౌషధములచే

ఘనరోగములు నశించిన
యనువున నని గాన రోష మడఁపు మహాత్మా. 144

టీ. మహాత్మా = ఓధ్రువుఁడా! విను = వినుము. రోషహృదయుచేతను = కోపముగలమనుజునిచే, అనయము = ఎప్పుడును, లోకము, ఔషధములచే, రోగములు, నశించినయనువునన్ = రోగములన్నియు నశించురీతిని, నశించున్ = నాశమును పొందును. కానన్, రోషము, అడఁపు = అణఁచివేయుము.

తా. స్వాయంభువుఁడు ధ్రువునితోఁ జెప్పుచున్నాఁడు—ఓధ్రువుఁడా! నామాట వినుము. ఔషధములచే రోగములు నశించునట్లు, కోపముగలవానిచే లోకము నశించిపోవును గాన నీక కోపమును జాలింపుము.

తే. అనఘ నీదుసహోదరహంత లనుచుఁ
వెనఁచి యీపుణ్యజనులఁ జంపితి కడంగి
పరఁగ నిదియె సదాశివభ్రాత యైన
యర్థవిభునకు నపరాధ మయ్యెఁ గాన. 145

టీ. అనఘ = దోషరహితుఁడా! నీదుసహోదరహంతలు = నీతమ్మునిఁ జంపినవారు, అనుచున్, పెనఁచి = యుద్ధమొనర్చి, పుణ్యజనులన్ = యక్షులను, చంపితి = చంపివేసితివి. పరఁగన్ = ఆలోచింపఁగా, ఇదియె = ఈకారణమే, సదాశివభ్రాతయైన = ఎల్లపుడు శివునకు భ్రాతయగు, అర్థవిభునకున్ = కుబేరునకు, అపరాధమయ్యెన్ = అపరాధమాయెను. కానన్ = కాఁబట్టి.

తా. ఓధ్రువుఁడా! నీభ్రాతనుజంపి రనునుద్దేశమున నీయక్షుల నిట్లు యుద్ధమునఁ జంపితివి. ఇందుచే శివభ్రాత యగు కుబేరున కపరాధ మొనరించినవాఁడ వయితివి.

క. నతినుతులచేత నీ విప్రు
డతనిఁ బ్రసన్నునిఁగఁ జేయు మని మనువు దయా
మతిఁ జెప్పి ధ్రువునిచే స
త్కృతుఁ డై నయ మొప్పఁ జనియె బుషియుక్తుం డై. 146

టీ. నతి = నమస్కారముచేతను, నుతులచేతన్ = స్తోత్రములు చేయుటచేతను, నీ విప్రుడు, అతనిన్ = అకుబేరుని, ప్రసన్నునిగాన్=దయగల వానినిగా, చేయుం మని, మనువు = స్వాయంభువమనువు, దయామతిన్ = దయతోఁగూడినబుద్ధితో, చెప్పి, ధ్రువునిచే, నయ మొప్పన్ = నీతి వెలయం నట్లు, సత్కృతుఁడై = సత్కరింపఁబడినవాఁడై, బుషియుక్తుండై = బుషు లతోఁ గూడి, చనియెన్ = వెళ్లిపోయెను.

తా. ఓధ్రువుఁడా! నీ విపుడు నమస్కరించియు, స్తుతించియు,కుబే రుని సెట్టైన నీయందు దయావంతునిఁగాఁ జేసికొను మని స్వాయంభువ మనువు చెప్పెను. అనంతరమున ధ్రువుఁ డది విని యాతని సత్కరించిన తోడనే బుషులతో నాస్వాయంభువుఁడు నిజగృహమున కేగెను.

వ. అంత. 147

టీ. అంతన్ = అట్లు పోఁగానే.

తే. యక్షచారణసిద్ధవిద్యాధరాది
జనగణస్తూయమానుఁ డై ధనదుఁ డంతఁ
బుణ్యజనవైశసనివృత్తి భూరిరోష
రహితుఁ డై నట్టిధ్రువునిఁ జేరంగ వచ్చె. 148

టీ. యక్ష...మానుఁడై-యక్ష = యక్షులచేతను, చారణ = చార ణులచేతను, సిద్ధ = సిద్ధులచేతను, విద్యాధరాది = విద్యాధరులు మొదలగు, జనగణ=జనసముదాయములచేతను, స్తూయమానుఁడై = స్తోత్రముచేయఁబడిన వాఁడై, ధనదుఁడు=కుబేరుఁడు, అంతన్ = ఆసమయమునందు, పుణ్య...

నివృత్తున్-పుణ్యజన=యక్షులయొక్క, వైశస = వధమునుండి, నివృత్తున్ = మరలినవానిని, భూరి...హితుఁడైనట్టి - భూరి = విస్తారమయిన, రోషరహితుఁడైనట్టి=కోపములేని, ధ్రువుని, చేరఁగవచ్చెన్=సమీపమునకు వచ్చెను.

తా. యక్ష సిద్ధ చారణ విద్యాధరాదులచే స్తోత్రముచేయఁబడిన కుబేరుఁడు యక్షవధము చాలించినట్టియుఁ గోపరహితుఁడైనట్టియు ధ్రువునిఁ జూడ వచ్చెను.

సీ. చనుదెంచి వెసఁ గృతాంజలి యైనధ్రువుఁ జూచి
తివుట నిట్లనియె క్షత్రియకుమార
తగ భవదీయపితామహాదేశంబు
నను దుస్త్యజంబైనఘనవిరోధ
ముడిగితి వటు గాన యొనరంగ నిపుడు నీ
యందుఁ బ్రసన్నుండ నైతి భూత
జననలయంబుల కనయంబుఁ గాలంబె
కర్త యై వర్తించుఁ గాన యుష్మ

తే. దనుజుఁ జంపినవార లీయక్షవరులు
గారు తలపోయ నీయక్షగణము నిట్లు
నెఱి వధించినవాఁడవు నీవు గావు
వినుతగుణలీల మాటలు వేయు నేల. 149

టీ. చనుదెంచి = వచ్చి, వెసన్ = శీఘ్రముగా, కృతాంజలియైన = దోసిలియొగ్గిన, ధ్రువున్ = ధ్రువునిని, చూచి, తివుటన్ = తిరిగి, ఇట్లనియె, క్షత్రియకుమార = ఓధ్రువుఁడా! తగన్ = ఒప్పునట్లుగా, భవ.. శంబునను-భవదీయ = నీసంబంధమయిన, పితామహ = తాతయగుస్వాయంభువుయొక్క, ఆదేశంబునను = ఆజ్ఞచేత, దుస్త్యజంబైన = విడువరాని, ఘన = గొప్పదైన, విరోధమున్ = విరోధమును, ఉడిగితివి = మానితివి.

అటుగాన౯ = ఆకారణముచేత, ఒనరంగ౯ = సంతోషముగా, ఇపుడు, నీ
యందు౯, ప్రసన్నుండవయితి౯ = దయగలవాఁడ వయితివి. భూతజననలయంబు
లకు౯ = జంతువులసృష్టిస్థితిలయములకు, అనయంబు = ఎల్లప్పుడును, కాలంబె =
కాలమే, కర్తయై, వర్తించును = ప్రవర్తించును. కాన = కాఁబట్టి, యుష్మత్
అనుజు౯ = మీతమ్ముని, చంపినవారలు, ఈయక్షవరులు కారు. తలపోయఁగ౯ =
ఆలోచింపఁగా, ఈయక్షగణమును, ఇట్లు = ఈవిధమున, వెఱిఁ౯ = వ్యర్థ
ముగా, వధించినవాఁడవు = చంపినవాడవు, నీవు, కావు, వినుతగుణశీల =
పొగడఁబడుసుగుణములు నడవడి గలవాఁడా! మాటలువేయునేల = పలు
మాటలతో నుపయోగము లేదు.

తా. అంతఁ గుబేరుఁడు రాఁగానే ధ్రువుఁడు నమస్కరింప నాకుబే
రుఁడు ధ్రువునిఁగూర్చి యిట్లు ప్రసంగించెను. ఓధ్రువుఁడా! నీపితామహ
దేశంబునఁ బరిశుభ్రమయిన జ్ఞానము కల నీయందుఁ బ్రసన్నుఁడనయితి.
సృష్టిస్థితిలయంబుల నొనరించునది కాలము దప్ప వేఱు కాదు గాన నీతమ్ముని
నీయక్షులు చంపలేదు. ఇంతియగాక యీయక్షసమూహమును నిట్లు వధిం
చినవాఁడవు నీవును కావు; వేయి మాటలతో నేమి ప్రయోజనము.

వ. అదియునుంగాక యేబుద్ధిం జేసి కర్మసంబంధదుఃఖాదికంబు
లు దేహాత్మానుసంధానంబునం జేసి సంభవించు నట్టి యహం
త్వమ్మను నపార్థజ్ఞానంబు స్వప్నమందుంబోలెఁ బురుషునకుం
దోఁచు నది గావున సర్వభూతాత్మవిగ్రహుండును నధోక్షు
జుండును భవచ్ఛేదకుండును భజనీయపాదారవిందుండును
ననంతామేయశక్తియుక్తుండును గుణమయి యగునాత్మమా
యచే విరహితుండును నైనయీశ్వరుని సేవింపుము నీకు భ
ద్రం బయ్యెడు భవదీయమనోగతం బైనవరంబుఁ గోరుము
నీవంబుజనాభపాదారవిందసేవనంబుఁ దిరంబుగఁ జేయుదు.

వనిరియోఱుంగుదు ననిన రాజరాజుచేత నట్లు మహామతియు భాగవతోత్తముండు నైధ్రువుండు ప్రేరింపంబడి యేహరి స్మరణంబుచేత నప్రయత్నంబున దురత్యయంబైనయజ్ఞానం బుఁ దరియింతు రట్టిహరిస్మరణం బచలితం బగునట్లొసంగు మని యడిగిన నట్లకాక యని యంగీకరించి యంతం గుబేరుండు సంప్రీతచిత్తుండయి ధ్రువునికి శ్రీహరిస్మరణం బట్ల యనుగ్రహించి యంతర్ధానంబునొందె నంత ధ్రువుండు యక్షకిన్నరకింపురుషగణసంస్తూయమానవైభవుం డగుచు నాత్మీయపురంబునకు మరలి చనుదెంచి. 110

టీ. అదియునుం గాక, ఏబుద్ధిం జేసి = ఏజ్ఞానముచేత, కర్మసంబంధ= కర్మసంబంధమయిన, దుఃఖాదికంబులు = దుఃఖము మొదలగునవి, దేహ = దేహమునందు, ఆత్మ = జీవాత్మ, అనుసంధానంబునం జేసి = ఆరోపించు కొనుటచేత, సంభవించునో, అట్టి, అహం త్వ మ్మను=నేను నీ వనునట్టి, అపార్థజ్ఞానంబు=అజ్ఞానము, స్వప్నమందుంబోలెఁ = స్వప్నమునందువలె, పురుషునకుఁ, తోఁచును. అదికావున = ఆకారణముచే, సర్వభూతాత్మవిగ్రహుం డును = అన్నిశరీరములు తనరూపముగఁ గలవాఁడును, అధోక్షజుండును = జితేంద్రియుఁడును, భవచ్ఛేదకుండును = సంసారమును ఛేదించువాఁడును, భజనీయపాదారవిందుండును = స్తుతింపఁదగిన పాదపద్మములు గలవాఁడును, అనంత=అంతములేని, అమేయ=ఊహింపరాని, శక్తియుక్తుండును = సామర్థ్యముకలవాఁడును, గుణమయియగు=త్రిగుణస్వరూపయగు,ఆత్మమాయచేఁ =తనమాయచే, విరహితుండును=లేనివాఁడును, ఐనయీశ్వరుని, సేవింపుము. నీకుఁ, భద్రంబయ్యెడుఁ = మేలుగలుగు. భవదీయమనోగతంబైన=నీమనస్సును బొందిన, వరంబుఁ=వరమును, కోరుము. నీవు అంబు...నంబుఁ-అంబుజ నాభ=విష్ణువుయొక్క, పాదారవింద=పాదపద్మములయొక్క, సేవనంబుఁ=

సేవను, తిరంబుగన్ = దృఢముగ, చేయుందువని, ఎఱుంగుదును. అనిన = ఇట్లనినట్టి, రాజరాజుచేతన్ = కుబేరునిచేత, అట్లు, మహామతియుఁన్ = గొప్పబుద్ధిమంతుఁడును, భాగవతోత్తముండును = భగవద్భక్తులలో శ్రేష్ఠుఁడును, ఐన, ధ్రువుండు, ప్రేరేపింపంబడి = ప్రేరేపణచేయఁబడి, ఏహరి = ఏ విష్ణువుయొక్క, స్మరణంబుచేత, అప్రయత్నంబునన్ = ప్రయత్నము లేకుండఁగనే, దురత్యయంబైన = నాశనములేని, అజ్ఞానంబునన్ = అజ్ఞానమునుండి, తరియింతురు = తరించెదరో, అట్టి, హరిస్మరణంబు = భగవంతునిధ్యానము, అచలితంబగునట్లు = చలింపకుండునట్లు, ఒసంగుము = ఇమ్ము. అనిఅడిగినన్, అట్ల కాక, అని, అంగీకరించి = అట్లేయిచ్చి, అంతన్ = ఆపైని, కుబేరుండు, సంప్రీత = సంతోషించిన, చిత్తుండయి = మనస్సుకలవాఁడయి, ధ్రువునికిన్, శ్రీహరిస్మరణంబు, అట్ల = అతఁడు కోరినరీతిగా, అనుగ్రహించి = దయచేసి, అంతర్ధానంబు నొందెను = కనఁబడకపోయెను. అంతన్ = ఆసమయమున, ధ్రువుండు యక్ష కిన్నర కింపురుష గణ = యక్షులుమొదలగు దేవతలగణములచేత, సంస్తూయమాన = స్తోత్రము చేయఁబడిన, వైభవుండగుచు = ఐశ్వర్యముకలవాఁడగుచు, ఆత్మీయపురంబునకున్ = తనపట్టణమునకు, మరలి, చనుదెంచి = వచ్చి.

తా. ఏజ్ఞానముచేత కర్మసంబంధమయిన సుఖదుఃఖాదులు లేక దేహాత్మానుసంధానమునఁ గలుగు నహంత్వ మ్మనునజ్ఞానమును బాసి మాయావిరహిత మగు కేవలపరమాత్మజ్ఞానము కలుగునో, యట్టి పరమపురుషుఁ డగు శ్రీహరి ధ్యాన మొసఁగు మని కుబేరునిచేఁ జెప్పఁబడినవాఁడై కుబేరునిచేఁ బ్రేరేపణ చేయఁబడి నిత్యానందమగు పరబ్రహ్మస్వరూప మగు శ్రీహరిపదసేవారూప మైనవరమును బడసి జ్ఞానోపదేశమును బొందె నట్టియెడ సంతసించి కుబేరుఁ డంతర్ధానమును జెందఁగా ధ్రువుఁడు యక్ష కిన్నర కింపురుషాదులచే స్తోత్రముచేయఁబడి స్వపురమునకు సంతసమున మఱలిపోయె.

సీ. గణుతింప భూరిదక్షిణలచేఁ గడునొప్పు
యజ్ఞముల్ సేయ నయ్యజ్ఞవిభుఁడు

ద్రవ్యక్రియాదేవతాఫలరూపస
త్కర్మఫలప్రదాత యయి యొప్పు
పురుషోత్తముని నర్థిఁ బూజించి మఱియు స
ర్వోపాధివర్జితుఁ డుత్తముండు
సర్వాత్మకుఁడు నగు జలజాక్షునందుఁ దీ
వ్రం బైన ప్రవాహరూపంబు నైన
తే. భక్తి నలుపుచు నఖిలప్రపంచమందు
నలరఁ దనయందు నున్న మహాత్ము హరిని
జిదచిదానందమయుని లక్ష్మీవరుఁ బరము
నీశ్వరేశ్వరుఁ బొడఁగనె సిద్ధచరిత. 151

టీ. ఇద్ధచరిత = ప్రసిద్ధికెక్కినకీర్తిగల యోపరీక్షిన్మహారాజా! గణింపక్ = లెక్కపెట్టఁగా, భూ...లచే - భూరి = విస్తారమగు, దక్షిణలచేక్, కడు నొప్పుయజ్ఞముల్ చేయక్, అయ్యజ్ఞవిభుఁడు = ఆయజ్ఞములకు ప్రభువైన విష్ణువు, ద్రవ్య = యజ్ఞమునకు వలయు సోమలతాదులును, క్రియా = తత్ప్రక్రియలును, దేవతా=ఆయజ్ఞమునందలిదేవతలును, ఫల=తత్ఫలములును, రూప=రూపమయిన, సత్కర్మ = సత్కర్మలకు, ఫలప్రదాతయయి యొప్పు = ఫలమునిచ్చు, పురుషోత్తముని = విష్ణుని, అర్థిక్ = ప్రీతితో, పూజించి, మఱియు, సర్వ=సమస్తమయిన, ఉపాధివర్జితుఁడు = ఉపాధులు లేనివాఁడు, ఉత్తముండు, సర్వాత్మకుండు = తనయందు సమస్తప్రపంచము కలవాఁడు, అగు జలజాక్షునందుక్ = పరమేశునియందు, తీవ్రంబై=కఠినమైన, ప్రవాహరూపంబునైన, భక్తి నలుపుచుక్ = భక్తినొనర్చుచు, అఖిల = సమస్తమయిన, ప్రపంచమందుక్, అలరక్ = ప్రకాశముగా, తనయందుక్, ఉన్న, మహాత్ముక్ = గొప్పవాఁడైన, హరిని, చిదచిదానందమయుని = జ్ఞానస్వరూపుఁడు నజ్ఞాన

స్వరూపుఁడు నయిన యానందరూపుని, లక్ష్మీవరున్ = లక్ష్మికి భర్త యగు, పరమున్ = ఉత్కృష్టుఁడగు, ఈశ్వరేశ్వరున్ = ప్రభువులకుఁ బ్రభుఁడైన వాని, పొందఁగనెన్ = చూచెను.

తా. అథుర్వుఁడు స్వపురమునకుఁ బోయి యనేకయజ్ఞములు చేసి తదధీశుఁ డగుపరమేశ్వరునిఁ బూజించి, చిరకాలమున కాపరమేశునిఁ బొడఁ గనెను.

వ. ఇట్లు సుశీలసంపన్నుండును బ్రహ్మణ్యుండును ధర్మసేతురక్ష కుండును దీనవత్సలుండునయి యవని పాలించుధుర్వుండు తన్నుఁ బ్రజలు దండ్రి యని తలంప నిరువదియాఱువేలేండ్లు భోగంబులచేతం బుణ్యక్షయంబును నభోగంబులైన యాగాదులచేత నశుభక్షయంబునుం జేయుచు బహుకాలం బుదనుకఁ ద్రివర్గసాధనంబుగా రాజ్యంబు సేసి కొడుకున కుఁ బట్టంబు గట్టి యచలితేంద్రియుండై యవిద్యారచిత స్వప్నగంధర్వనగరోపమం బయిన దేహాదికం బగువిశ్వంబు భగవన్మాయారచితం బని యాత్మం దలంచుచు వెం డియు. 152

టీ. ఇట్లు, సుశీల సంపన్నుండును = మంచిస్వభావముతో కూడినవాఁ డును, బ్రహ్మణ్యుండును = బ్రాహ్మణభక్తికలవాఁడును, ధర్మ=ధర్మముయొక్క, సేతు = కట్టలను, రక్షకుండును = కాపాడువాఁడును, దీన = దీనుల యందు, వత్సలుండును=ప్రేమము కలవాఁడును, అయి, అవనిన్=భూమిని, పాలించు, ధుర్వుండు, తన్నున్ = తనను, ప్రజలు, తండ్రి యని తలంపన్, ఇరువదియాఱువేలేండ్లు, భోగంబులచేతన్ = సుఖములచేత, పుణ్యక్షయం

బును, అభోగంబులైన = భోగరూపములు కాని, యాగాదులచే, అశుభ = అమంగళములయొక్క, క్షయంబును = నాశనమును, చేయుచున్, బహుకాలంబుదనుకన్ = చాలకాలమువఱకు, త్రివర్గసాధనంబుగాన్ = మోక్షమునకు సాధనంబుగా, రాజ్యంబుసేసి, కొడుకునకు, పట్టంబుకట్టి, అచలిత = చలింపని, ఇంద్రియుండై = ఇంద్రియములు కలవాఁడై, అవి ..బయిన-అవిద్యా = మాయచేత, రచిత = రచింపఁబడిన, స్వప్న = స్వప్నమందలి, గంధర్వ = గంధర్వులయొక్క, నగర = పట్టణము, ఉపమంబయిన = సాటిగాఁగల, దేహాదికంబగు = దేహము మొదలుగాఁగల, విశ్వంబు=ప్రపంచము, భగ...బని-భగవత్ = భగవంతునియొక్క, మాయా=మాయచేత, రచితంబని = చేయఁబడినదని, ఆత్మన్ = మనస్సులో, తలంచుచున్, వెండియు = మఱియు.

తా. ఇట్లాధ్రువుఁడు సుశీలసంపన్నుఁడై ధర్మసేవితుఁడై యుండ నాప్రజ లెల్ల నాతనిఁ దండ్రి యని భావింప సకలసుఖము లనుభవించుచు నిరువదియాఱువేలేండ్లు స్వేచ్ఛగాఁ బ్రపంచమును బరిపాలించి యనంతరమున స్వారాజ్యమునఁ దనకొడుకును బట్టాభిషిక్తునిజేసి యీశరీరము మొదలగు ప్రపంచమంతయు మాయారూపమయిన దని యెంచి.

చ. మనునిభుఁ డంత భృత్యజనమంత్రిపురోహితబంధుమిత్రనం
దన పశువిత్తరత్నవనితాగృహరమ్యవిహారశైలవా
రినిధి పరీత భూతల హరిద్వీపముఖ్యపదార్థజాలముల్
ఘనమతిచే ననిత్యములు గాఁ దలపోసి విరక్తచిత్తుఁడై.

టీ. అంతన్ = తర్వాత, మనునిభుఁడు = మనువుతో సమానుఁడయిన ధ్రువుఁడు, భృత్య...లముల్ - భృత్యజన = సేవకులు, మంత్రి=మంత్రులు, పురోహిత = పురోహితులు, బంధు = చుట్టాలు, మిత్ర=స్నేహితులు, నందన=పుత్రులు, పశు=పసరములు, విత్త=ధనము, రత్న=మణులు, వనితా = స్త్రీలు (భార్యలు), గృహ = ఇండ్లు, రమ్య = సొగసైన, విహారశై

ళ = క్రీడాపర్వతములు, వారినిధి = సంద్రములు, వీనిచే, పరీత = చుట్టఁబడిన, భూతల=భూమి. హరి = గుఱ్ఱములు, ద్విప = ఏనుఁగులు, ముఖ్య= మొదలగు, పదార్థజాలముల్ = వస్తువులగుంపులు, ఘనమతిచేన్ = గొప్పబుద్ధితో, అనిత్యములుగాన్ =అశాశ్వతములుగా, తలపోసి, విరక్తచిత్తుఁడై = కోరికలు విడిచిన మనస్సుగలవాఁడై. వైపన్యముతో నన్వయము.

తా. ధ్రువుఁ డంత సమస్తభృత్యులు, మంత్రులు. పురోహితులు, స్నేహితులు, బంధువులు, భార్య, రమ్యవిహార శైలములు, గుఱ్ఱములు, ఏనుఁగులు, బంగారు మొదలగు ననేకభోగము లన్నియుం ననిత్యములే యని యెంచి.

సీ. పురము వెల్వడి చని పుణ్యభూబదరికా
  ఘనవిశాలానదీకలితమంగ
 ళాంబుపూరంబుల ననురక్తిమైఁ గ్రుంకి
  కమనీయపరిశుద్ధకరణుఁ డగుచుఁ
 బద్ధాసనస్థుఁడై పవనుని బంధించి
  నెలకొని ముకుళితనేత్రుఁ డగుచు
 హరిరూపవై భవధ్యానంబు సేయుచు
  భగవంతు నచ్యుతుఁ బద్మనేత్రు
తే. నందు సతతంబు నిశ్చలమైనయట్టి
 భక్తిఁ బ్రవహింపఁజేయుచుఁ బరమమోద
 బాష్పధారాభిషిక్తుఁడు భవ్యయశుఁడుఁ
 బులకితాంగుండు నగుచు నిమ్ములఁ దనర్చి. 154

టీ. పురము = పట్టణమునుండి, వెల్వడి=బయలుదేఱి, చని = పోయి, పుణ్య...రంబులన్ - పుణ్య = పవిత్రమయిన, భూ = భూమియందలి, (ఆర్యావర్తనమునందలి) బదరికా = బదరికాశ్రమమునందలి, ఘన =

గొప్పదైన, విశాలానదీ = విశాలానదియందలి, కలిత=కూడుకొన్న, పంగ
కాంబు = పరిశుద్ధములగు నుదకములయొక్క, పూరంబులన్ = ప్రవాహముల
యందు, అనురక్తిమైన్ = అనురాగముతో, క్రుంకి=మునిఁగి, కమ...రణుఁ
డగుచున్-కమనీయ = కొనియాడఁదగు, పరిశుద్ధ = నిర్మలమయిన, కరణుఁ
డగుచున్ = ఇంద్రియములు కలవాఁడగుచు, పద్మాసనస్థుఁడై = పద్మాసన
మునఁ గూర్చున్నవాఁడై, పవనుని బంధించి = వాయుబంధము చేసి, నెల
కొని = నిల్కడఁజెంది, ముకుళితనేత్రుఁడగుచున్ = నేత్రములు మూసికొన్న
వాఁడగుచు, హరి...సేయుచున్-హరిరూప = భగవంతుని రూపముయొక్క,
వైభవ=వేడుకయొక్క, ధ్యానంబుచేయుచు, భగవంతున్ = పూజ్యుఁడును
అచ్యుతున్ =నాశరహితుఁడును, పద్మనేత్రున్ =కమలనేత్రుని, అందున్ =ఆహరి
ధ్యానమునందు, సతతంబు = ఎల్లప్పుడును, నిశ్చలమైనయట్టి = కదలని,
భక్తి = భక్తిని, ప్రవహింపఁజేయుచున్ = పాఱఁజేయుచు, పర...
షిక్తుఁడు-పరమ = ఎక్కువ, మోద = సంతసమువలని, బాష్ప=బాష్పముల
యొక్క, ధారా = ధారలచేత, అభిషిక్తుఁడు = అభిషేకము చేయఁబడిన
వాఁడును, భవ్య...శుఁడు - భవ్య = మంగళమైన, యశుఁడు = కీర్తిగల
వాఁడును, పులకిత అంగుండు = గగుర్పాటుగల యవయవములు గల
వాఁడును, అగుచున్, ఇమ్ములన్ = సుఖముగా, తనర్చి = ఒప్పి. (వైపద్య
ముతో నన్వయము.)

తా. అట్టాధ్రువుఁడు తనపురము విడిచి, పవిత్ర మగుబదరికాశ్రమమును నొంటరిగఁజేరి యాయాశ్రమము ననుసరించియున్న విశాలానదిలో స్నానముఁ జేసికొని పరిశుద్ధమనస్కుఁడై పద్మాసనమును వేసి వాయుబంధము నొనర్చి యాహరిరూపధ్యానమును జేయుచు, లోకమును మఱచినవాఁడై తదేకధ్యానంబుగ నానందసముద్రమున మునిఁగియుండెను.

వ. మఱియు విగతక్లేశుండును ముక్తలింగుండును నై ధ్రువుఁడు
తన్నుఁ దా మఱచియుండుసమయంబున దశదిక్కుల ను

ద్యద్రాకానిశానాయకుండునుంబోలె వెలింగించుచు నాకాశంబుననుండి యొక్కవిమానంబు సనుదేర నందు దేవశ్రేష్ఠులును జతుర్భుజులును రక్తాంబుజేక్షణులును శ్యామవర్ణులును గదాధరులును సునాసులును గిరీటహారాంగదకుండలధరులును గౌమారవయస్కులును నుత్తమశ్లోకకింకరులు నయినవారల నిద్దఱం గని సంభ్రమంబున లేచి మధుసూదను నామంబులు సంస్మరించుచు వారల భగవత్కింకరులం గాఁదలంచి దండప్రణామంబు లాచరించినం గృష్ణపాదారవిందవిన్యస్తచిత్తుండుఁ గృతాంజలియు వినమితకంధరుఁడును నైన ధ్రువునిం గనుంగొని పుష్కరనాభభక్తులైన సునందనందులు ప్రీతియుక్తులై మందస్మితులగుచు నిట్లనిరి. 155

టీ. మఱియుఁ, విగ...శుండును - విగత = పోయిన, క్లేశుండును = దుఃఖముకలవాఁడును, ముక్త = విడిచిపెట్టఁబడిన, లింగుఁడును = లింగశరీరము కలవాఁడును, ఐ, ధ్రువుండు, తన్నుఁదాన్ = తన్నుఁదాను, మఱచియుండు సమయంబున, దశదిక్కులన్ = పదిదిక్కులను, ఉద్యత్ = బయలుదేరిన, రాకానిశానాయకుండునుంబోలె = పున్నమనాఁటి చంద్రుని వలె, వెలింగించుచున్ = ప్రకాశింపఁజేయుచు, ఆకాశంబుననుండి = ఆకాశమునందుండి, ఒక్కవిమానంబు, చనుదేరన్ = రాఁగా, అందున్ = అవిమానమునందు, దేవశ్రేష్ఠులును = వేల్పులలో మేటులయినవారును, చతుర్భుజులును = నాలుగుభుజములు కలవారును, రక్తా...క్షణులును-రక్తాంబుజ=ఎఱ్ఱదామరల వంటి, ఈక్షణులును = కన్నులుగలవారును, శ్యామ = నల్లని, వర్ణులును = చాయకలవారును, గదాధరులును=గదను ధరించినవారును, సునాసులును = చక్కనిముక్కులుకలవారును, కిరీట...లును - కిరీట = కిరీటములు, హార = ముత్యాలహారములు, అంగద=బాహుపురులు, కుండల=కుండలములు వీనిని

ధరులును=ధరించినవారును, కౌమారవయస్కులును=యౌవనవయసులోనున్న వారును, ఐన, ఉత్తమశ్లోక = దేవునియొక్క, కింకరులును = భృత్యులును, అయినవారలన్, ఇద్దఱన్, కని, సంభ్రమంబునన్ = తొట్రుపాటున, లేచి, మధుసూదను నామంబులు = విష్ణునియొక్క పేర్లను, సంస్మరించుచున్=తలంచుచు, వారలన్=ఆయిద్దఱను, భగవత్కింకరులంగాన్ = భగవంతుని భృత్యులనుగా, తలంచి=తలఁచుకొని, దండప్రణామంబు లాచరించినన్=నమస్కరించినతోడనే, కృష్ణపాదారవింద=శ్రీకృష్ణుని పాదపద్మములందు, విన్యస్త= ఉంచఁబడిన, చిత్తుండును=చిత్తము కలవాఁడు, కృతఅంజలియున్=చేయఁబడిన దోసిలికలవాఁడును (చేమోడ్చినవాఁడును), విన...రుఁడును-వినమిత=వంచఁబడిన, కంధరుఁడును = కంఠముగలవాఁడును, అయిన, ధ్రువునిన్, కనుంగొని= చూచి, పుష్కరనాభ = విష్ణువుయొక్క, భక్తులైన, సునందనందులు=సునంద నందు లను నిరువురును, ప్రీతియుక్తులై = సంతసించినవారై, మందస్మితులగుచున్=మందహాసమును జేయుచు, ఇట్లనిరి.

తా. ధ్రువుఁడు భగవంతునియందుఁ దదేకధ్యానచిత్తుఁడై యుండ నంత నొకవిమాన మాకసమునుండి దిగెను. అంత నాత్రఁ డావిమానముననుండు కౌమారవయస్సు గల భగవత్కింకరు లగు సునందనందులను విష్ణుభక్తులనుగా నెఱిఁగి వారలకు భక్తితో నమస్కరింప, వా రించుకంత మందహాసముతో నాతని కి ట్లనిరి.

ఉ. ఓనృప నీకు భద్రమగు నొప్పగుచున్నమదీయవాక్యముల్
వీనులయందుఁ జొన్పుము వివేకముతో నయిదేండ్లనాఁడు మే
ధానిధివై యొనర్చినయుదాత్తతపోవ్రతనిష్ఠచేతఁ దే
జోనయశాలివైయునమధుసూదనుఁ దృప్తి వహింపఁజేయవే.

టీ. ఓనృప = ఓరాజా ! నీకు, భద్రము=మేలు, అగున్, ఒప్పు, అగుచున్న, మదీయవాక్యముల్ = నావాక్యములు, వీనులయందున్ చొన్పుము =

శ్రద్ధగావినుము. వివేకముతోన్ = మంచిజ్ఞానముతో, అయిదేండ్లనాఁడు = అయిదేండ్లపరిమితమయినవయసునను, మేధానిధివై = మిక్కిలిమంచిబుద్ధికలిగిన వాఁడవై, ఒనర్చిన=చేసినట్టి, ఉదా...నిష్ఠచేన్-ఉదాత్త=ఉగ్రమయిన, తపో వ్రత=తపస్సునందును వ్రతములందును, నిష్ఠచేతన్ = నియమముచే, తేజో నయశాలివైన-తేజః = తేజస్సుచేతను, నయ=నీతిచేతను, శాలివైన = ఒప్పి యుండ్న, మధుసూదనున్ = విష్ణుమూర్తిని, తృప్తివహింపఁజేయవే = తృప్తిఁ బొందించితివిగదా.

తా. సునందనందులు ధ్రువునితో నిట్లు చెప్పుచున్నారు:— ఓ ధ్రువుఁడా! నీవు మామాట శ్రద్ధగా వినుము. నాఁడు నీ వయిదేండ్లు కలిగి యేనియమముచే విష్ణుని మిక్కిలి జ్ఞానమున నుపాసించియుంటివో, యా తపో వ్రతనియమముచే భగవంతుఁడు సంతుష్టుఁడై యుండెను.

ఆ. అట్టి శార్ఙ్గపాణి యఖిలజగద్భర్త
దేవదేవుఁ డతులదివ్యమూర్తి
మమ్ముఁ బనుప మేము మాధవపదమున
కర్థి నిన్నుఁ గొనుచు నరుగుటకును. 157

టీ. అట్టి = అటువంటి, శార్ఙ్గపాణి - శార్ఙ్గ = శార్ఙ్గమనుధనుస్సును పాణి = హస్తమందుఁ గలిగినట్టియు, అఖిల = సమస్తమయిన, జగత్ = ప్రపంచమునకు, భర్త = అధిపతియయినట్టియు, దేవదేవుఁడును = దేవతలకు దేవుఁడును, అతు...మూర్తి-అతుల = సమానములేని, దివ్య = మంగళప్రద మయిన, మూర్తి = రూపముకలిగిన విష్ణువు, మమ్మున్ బనుపన్ = మమ్ములను పంపఁగా, మేము, మాధవపదమునకున్ = విష్ణుస్థానమునకు, అర్థిన్ = ప్రీతి తో, నిన్నున్ = నిన్ను, కొనుచున్ = తీసికొనుచు, అరుగుటకును = పోవు టకై, పైపద్యముతో అన్వయము.

తా. అట్లు విష్ణువు సంతసించి నిన్నుఁ దోడ్కొని రమ్మని పంపఁగా మేము వచ్చితిమని సునందనందులు ధ్రువునితోఁ జెప్పిరి.

వ. వచ్చితిమి యేపదంబునేని సూరిజనంబులు సర్వోత్తమం బని పొందుదురు దేనిఁ జంద్రదివాకరగ్రహనక్షత్రతారాగణంబులు ప్రదక్షిణంబుగాఁ దిరుగుచుండు మఱియు నీదు పితరులచేతను నన్యులచేతను ననధిష్ఠితంబును జగద్వంద్యంబును భక్తజనాతిదుర్జయంబును నయిన విష్ణుపదంబుం బొందుదువు ర మ్మిదె విమానశ్రేష్ఠం బుత్తమశ్లోకజనమౌళిమణి యైన శ్రీహరి పుత్తెంచె దీని నెక్క నర్హుండ వనిన నురుక్రమప్రియుం డయినధ్రువుండు తన్మధురవాక్యంబులు విని కృతాభిషిక్తుం డయి యచ్చటిమునులకుఁ బ్రణమిల్లి తదాశీర్వాదంబులఁ గైకొని విమానంబునకుం బ్రదక్షిణార్చనంబులు గావించి హరిపార్శ్వదులైన సునందనందులకు వందన మాచరించి భగవద్రూపవిన్యస్తచక్షురంతఃకరణాదికుం డగుచు విమానాధిరోహణంబు గావించుటకు హిరణ్మయరూపంబు ధరియించె నప్పుడు. 158

టీ. వచ్చితిమి, ఏపదంబునేని = ఎట్టిపదంబును, సూరిజనంబులు = పండితులు, సర్వోత్తమంబని = అన్నిటికంటె మేలని, పొందుదురు = పొందెదరో, దేనిఁ = ఏపదమునందు, చంద్ర...ణంబులు-చంద్ర = చంద్రుఁడును, దివాకర = సూర్యుఁడును, గ్రహ = నవగ్రహములును, నక్షత్రతారాగణంబులు=నక్షత్రములు తారకలసమూహములును, ప్రదక్షిణంబుగా, తిరుగుచుండుఁ = తిరుగుచుండునో, మఱియు, నీదుపితరులచేతను = నీయొక్క తాతముత్తాతలచేతను, అన్యులచేతను, అనధిష్ఠితంబును = అధిష్ఠింపఁబడనిదియు, జగత్ = ప్రపంచమునకు, వంద్యంబును = పూజ్యమయినదియు, భక్త

జన=భక్తులకు, అతిదుర్జయంబును = మిక్కిలి జయింపరానిదియుం, అయిన, విష్ణుపదంబుఁ = మోక్షమును, పొందుదువు. రమ్ము. ఇదె=ఇదిగో, విమాన శ్రేష్ఠంబు, ఉత్తమశ్లోకజనచూళిమణియైన = గొప్పదేవతలలో అగ్రేసరుఁడైన, శ్రీహరి, పుత్తెంచెఁ=పంపించెను. దీనిఁ=ఈవిమానమును, ఎక్కఁ = ఎక్కుటకు, అర్హుండవు = తగినవాఁడవు, అనినఁ = అనినతోడనే ఉరుక్రమ = విష్ణువునకు, ప్రియుండయిన = ఇష్టుఁడయిన, ధ్రువుండు, తత్=ఆ, మధుర వాక్యంబులు, విని, కృత = చేయఁబడిన, అభిషిక్తుండయి = అభిషేకముకల వాఁడయి, అచ్చుటిమునులకుఁ = అచ్చటనుండు ఋషులకు, ప్రణమిల్లి = నమస్కరించి, తత్ ఆశీర్వాదంబులఁ = ఆమునులదీవనలు, కైకొని = స్వీకరించి, విమానంబునకుఁ, ప్రదక్షిణార్చనంబులు = ప్రదక్షిణమును పూజనలును, కావించి, హరిపార్షదులయిన = హరికింకరులయిన, సునందనందులకుఁ, వందనం బాచరించి = నమస్కరించి, భగ... అగుచు-భగవత్ = భగవంతుని యొక్క, రూప = ఆకారమునందు, విన్యస్త = ఉంచఁబడిన, చక్షూరంతఃకర ణాదికుండగుచుఁ = కన్నులు మనస్సు మొదలగునవి కలవాఁడగుచు విమాన అధిరోహణంబు గావించుటకు = విమానమును ఎక్కుటకు, హిరణ్మయ రూపంబు = బంగారువికారమయిన ఆకారమును, ధరియించెఁ = ధరించెను. అప్పుడు=ఆసమయంబున.

తా. అట్లు సునందనందులు చెప్పిన వాక్యమును ధ్రువుఁడు మిగుల నానందకందళితాంతరంగుండై విష్ణురూపమును సదా ధ్యానించియుండ సునంద నందులు విష్ణునిచేఁ బంపఁబడిన యీ విమానము నెక్క నీవు సమర్థుఁడవని చెప్పఁగా, నట్టిమధురవాక్యములను విని ధ్రువుఁడు విమానమునకుఁ బ్రదక్షిణ నమస్కారంబు లొనర్చి యాహరికింకరులకు భక్తితో నమస్కరించి విమానము నెక్కుటకు బంగారు కాంతి గలదేహమును ధరింపఁగా.

క. సురదుందుభిపణవానక
మురజాదులు మొరసె విరులముసురు గురిసెఁ గి

న్నరగంధర్వులపాటలు
భరితములై చెలఁగె నపుడు భవ్యచరిత్రా! 159

టీ. భవ్యచరిత్రా = మంచియాశయము గలవాఁడా! సుర = దేవతల యొక్క, దుందుభి పణవ ఆనక మురజ ఆదులు = దుందుభి మొదలగు వాద్యవిశేషములు, మొరసెన్ = వాఁగెను. విరులముసురు = పుష్పముల వాన, కురిసెన్ = వర్షించెను. కిన్న...పాటలు - కిన్నర = కిన్నరులయొక్కయు, గంధర్వుల = గంధర్వులయొక్కయు, పాటలు, భరితములై = పూర్తిగా, అపుడు, చెలఁగెన్ = వ్యాపించెను.

తా. అధ్రువుఁడు హిరణ్యరూపమును దాల్చఁగనే దేవతలు దుందుభి మురజాదులను మ్రోయించిరి. పుష్పవర్షములు కురిసినవి. కిన్నరగంధర్వాదులు పాటలు పాడిరి.

వ. అట్టి సమయంబున ధ్రువుండు దుర్గమం బగు త్రివిష్టపంబు నకు నేగువాఁ డగుచు దీన యగు జననిం దిగనాడి యెట్లు వోవుదు నని చింతించువానిం బార్షదు లవలోకించి యగ్ర భాగంబున విమానారూఢయై యేగుచున్న జననిం జూపిన సంతుష్టాంతరంగుం డగుచు. 160

టీ. అట్టి సమయంబున, ధ్రువుండు, దుర్గమంబగు = పొందశక్యము కాని, త్రివిష్టపంబునకున్ = స్వర్గమునకు, ఏగువాఁడగుచున్ = పోవ నిశ్చయించుచు, దీన యగు=మిక్కిలి దీనముగా నున్న, జననిన్=తల్లియగు సునీతిని, దిగనాడి = విడిచి, ఎట్లు = ఏవిధముగా, పోవుదు నని, చింతించు, వానిన్= అధ్రువుని, పార్షదులు = భగవత్కింకరు లగు సునందనందులు, అవలోకించి = చూచి, అగ్రభాగంబునన్ = తనకంటె నున్నత ప్రదేశమునం దుండి, విమాన = విమానమును, ఆరూఢయై = అధిష్ఠించినదై, ఏగుచున్న = స్వర్గమున కేగుచున్న, జననిన్ = తనతల్లియైనసునీతిని, చూపినన్ = చూ

పఁగానే, సంతుష్ట = సంతోషముగల, అంతరంగుండగుచున్ = మనస్సు గల-
వాఁడగుచు.

తా. ధ్రువుఁ డిట్లు విమానము నెక్కి పోవ నిశ్చయించుచు దీనురా-
లైన తల్లిని విడిచి యెట్లు పోఁగల నని విచారించుచుండిన ధ్రువుని చింతను
నెఱింగి వారాధ్రువునకు విమానము నెక్కి స్వర్గమునకుఁ బోవుచున్న తల్లిని
జూప మిక్కిలి సంతసమును జెందినవాఁ డయ్యెను.

క. జనని సునీతిని మును కనుఁ
గొని యవల విమాన మెక్కి గొనకొని విబుధుల్
దనమీఁదఁ బుష్పవర్షము
లనయముఁగురియింప ధ్రువుఁడు హర్షముతోడన్. 161

టీ. జనని = తల్లియైన, సునీతిని, మును = ముందుగా, కనుఁగొని =
చూచి, అవలన్ = అనంతరమున, విమానమెక్కి, గొనకొని = యత్నించి, విబు
ధుల్ = దేవతలు, తనమీఁదన్, పుష్పవర్షములు, అనయమున్ = ఎల్లప్పుడును,
కురియింపన్ = కురిపించుచుండ, ధ్రువుఁడు, హర్షముతోడన్ = సంతసముతో.

తా. ధ్రువుఁడు తనతల్లిని విమానగత యగుదానిఁ జూచి యనంతర
మున విమానము నెక్కఁగనే దేవతలు గొప్పప్రయత్నపూర్వకముగా నాతని
పై పుష్పవర్ష మవిరళముగాఁ గురియింప నపు డాధ్రువుఁడు మిగుల సంతుష్టాం-
తరంగుం డయ్యెను.

క. చని చని వెస గ్రహమండల
మును త్రైలోక్యంబు సప్తమునిమండలమున్
ఘనుఁ డుత్తరించి యవ్వలఁ
దనరెడుహరిపదము నొందెఁ దద్దయుఁ బ్రీతిన్. 162

టీ. చనిచని = వెళ్లివెళ్లి, వెసన్ = శీఘ్రముగా, గ్రహమండల-
మును, త్రైలోక్యంబున్ = మూఁడులోకములను, సప్తమునిమండలమున్ =

సప్తర్షులయొక్క సమూహమును, ఘనుఁడు = గొప్పవాఁడైనధ్రువుఁడు, ఉత్తరించి = దాఁటి, అవ్వలన్ = ఆసప్తర్షిమండలమునకు మీఁదుగా, తనరెడున్ = ప్రకాశించునట్టి, హరిపదమున్ = విష్ణుస్థానమును, తద్దయున్ = మిక్కిలి, ప్రీతిన్ = సంతోషముతో, ఒందెన్ = పొందెను.

తా. ధ్రువుఁ డట్లు వెళ్లి వెళ్లి బ్రహ్మమండలమును సప్తర్షిమండలమును దాఁటి యావలఁ బ్రకాశించు విష్ణుపదమును గాంచెను.

వ. అది మఱియు నిజకాంతిచేతం ద్రిలోకంబులం బ్రకాశింపం జేయుచు నిర్దయాగమ్యంబును శాంతులును సమదర్శనులు శుద్ధులు సర్వభూతానురంజనులు నచ్యుతభక్తబాంధవులు నయిన భద్రాచారులకు సుగమ్యంబును నయి గంభీరవేగంబు ననిమిషంబు నగుజ్యోతిశ్చక్రంబు సమాహితం బై గోగణంబు మేధియందుంబోలె నెందుఁ బరిభ్రమించు చుండు నట్టి యచ్యుతపదంబునుం బొంది విష్ణుపరాయణుం డైన ధ్రువుండు త్రిలోకచూడామణియై యొప్పుచుండె నప్పుడు భగవంతుం డైననారదుండు ధ్రువుని మహిమం గనుంగొని ప్రచేతస్సత్రంబునందు వీణ వాయించుచు. 163

టీ. అది, మఱియుం, నిజకాంతిచేన్ = తనప్రకాశముచేతను, త్రిలోకంబులన్ = మూఁడులోకములను, ప్రకాశింపంజేయుచు, నిర్దయ = దయలేనివారిచేత, అగమ్యంబును = పొందవీలుకానిదియుం, శాంతులును, సమదర్శనులు = అన్నింటసమదృష్టి కలవారు, శుద్ధులు = పరిశుద్ధులును, సర్వ=సమస్తమయిన, భూత = జనులను, అనురంజనులు = రంజింపఁజేయువారు, అచ్యుతభక్త = విష్ణువుయొక్క భక్తులకు, బాంధవులును = చుట్టములునయిన, భద్ర = మంగళప్రదమైన, ఆచారులకున్ = ఆచారవంతులకు, సుగమ్యంబును = సులభముగాఁ బొందఁదగినదియుం, ఐ, గంభీరవేగంబును = గంభీరమయిన వేగము

కలదియు, అనిమిషంబును = ఱెప్పపాటులేనదియు, అగు, జ్యోతిశ్చక్రంబు, సమాహితంబై = కూర్పఁబడినదై, గోగణంబు = భూచక్రము, మేథియందుంబోలెన్ = పరమాత్మయందువలె ఎందున్ = దేనియందు, పరిభ్రమించుచుండును = తిరుగుచుండునో, అట్టి, అచ్యుతపదంబునున్ పొంది = విష్ణుపదము నొంది, విష్ణుపరాయణుండైన=విష్ణుభక్తితత్పరుండైన, ధ్రువుండు, త్రిలోక చూడామణియై = మూఁడులోకములకు శిరోభూషణమై, ఒప్పుచుండె = ప్రకాశించుచుండెను. అప్పుడు, భగవంతుండైన = షడ్గుణైశ్వర్యసంపన్నుండైన నారదుండు, ధ్రువునిమహిమన్ =ధ్రువునిసామర్థ్యమును, కనుంగొని = చూచి, ప్రచేతస్సత్రంబునందు = వరుణదేవునియొక్క సభయందు, వీణ వాయించుచు.

తా. అపు డాధ్రువుఁడు కాంతిచేత మూఁడులోకములఁ బ్రకాశింపఁజేయు వెలుతురు గలదియు, దుర్జనులకు గోచరముకానిదియు, శాంతులు సమృద్ధులు సర్వభూతానురంజకులు నగువారికిఁ బొందునట్టిదియు, దేనియందు భూచక్ర మెడతెగక తిరుగుచుండునో యట్టివిష్ణుపదమును బొంది ధ్రువుఁడు సర్వలోకశ్రేష్ఠుండై యుండ వరుణసభయం దున్న నారదుఁడు ధ్రువునిమహిమను జూచి వీణ వాయించుచు.

సీ. పతియె దైవంబుగా భావంబులోపలఁ
దలఁచుసునీతినందనుతపః ప్ర
భావము క్రియ ధర్మభవ్యనిష్ఠలఁ బొందఁ
జాలరు బ్రహ్మర్షిజనము లనిన
క్షత్త్రియకులు నెన్నఁగా నేల యెవ్వఁడు
పంచసంవత్సరప్రాయమునను
సురుచిదురుక్త్యుగ్రశరభిన్నహృదయుఁడై
మద్వాక్య హితబోధమతిఁ దనర్చి

తే. వనమునకు నేగి హరిభక్తివశత నొంది
యజితుఁ డగుహరి తనవశుఁ డై చరింపఁ
జేసి వెసఁ దత్పదంబును జెందె నట్టి
హరిపదంబును బొంద నెవ్వరికిఁ దరము. 164

టీ. (ఆర్యస్తుతా = సజ్జనులచేఁ బొగడఁబడువాఁడా !) పతియె = తనయధిపతియే, దైవంబుగా, భావంబులోపలన్ = హృదయమునందు, తలఁచుచు = స్మరించునట్టి, సునీతినందను = సునీతికొడుకైన ధ్రువునియొక్క, తపః = తపస్సుయొక్క, ప్రభావముక్రియన్ = మహిమను, ధర్మ = నీతిచేత, భవ్య = ఒప్పిన, నిష్ఠలన్ = నియమములచేత, బ్రహ్మర్షిజనములు, పొందన్ = పొందుటకు, చాలరు = సమర్థులు కారో, అనిన, క్షత్రియకులన్ = క్షత్రియకులమునం దుదయించినవాని, ఎన్నఁగా నేల = ఎన్నుటతో నేమి ప్రయోజనము ? పంచసంవత్సరప్రాయమునను = అయిదేండ్లవయసునందు, ఎవ్వఁడు, సురు... దయుఁడై-సురుచి=పిన్నతల్లియగు సురుచియొక్క, దురుక్తి=దురుక్తియనెడు, ఉగ్ర = తీక్ష్ణమయిన, శర = బాణములచేత, భిన్న = భేదింపఁబడిన, హృదయుఁడై = హృదయముకలవాఁడై, మద్వా...మతిన్ - మద్వాక్య = నావాక్యమునందైన, హిత = మేలైన, బోధమతిన్ = బోధనారూపమైన బుద్ధితో, తనర్చి = ప్రకాశించి, వనమునకు, ఏగి = వెళ్లి, హరిభక్తివశతన్ = విష్ణుభక్తికివైవశ్యమును, ఒంది, అజితుఁ డగు = ఎవరిచే జయింపఁబడని, హరి, తనవశుఁడై = ధ్రువునకు స్వాధీనుఁడై, చరింపఁజేసి = సంచరించునట్లు చేసి, వెసన్ = శీఘ్రముగా, తత్పదంబును = ఆవిష్ణుపదమును, చెందెను = పొందెనో, అట్టి, హరిపదంబును, పొందన్ = పొందుటకు, ఎవ్వరికిన్ = ఏజనులకు, తరము = సాధ్యము? (ఎవరికిని సాధ్యము కాదని భావము.)

తా. నారదుఁడు వరుణసత్రంబున ధ్రువ ప్రభావమును వర్ణించుచున్నాఁడు:- పతినే దైవముగాఁ దలఁచి ధ్రువునిరీతిగా లోకమున నెవరును నట్టితపః

భావము బ్రహ్మర్షులు తమదృష్టులచేఁ బొందలే రన, క్షత్రియకుమారునింగూర్చి చెప్ప నేల? ఆధ్రువుఁడు సురుచియాడినదురుక్త లనుబాణములచేఁ గొట్టఁబడి జ్ఞానబోధ ననుసరించినవాఁడై వనమున కేగి తప మొనరించి యెవరికిని సాధ్యుఁడు కానిహరిని దనస్వాధీనము చేసికొని ధ్రువుఁడు పూజ్యులకుఁగూడ నందఁగరాని యేపదము నందెనో యట్టిహరిపద మెవ్వరును బొంద లేరు.

క. అని పాడె ననుచు విదురున
కనఘుఁడు మైత్రేయుఁ డనియె నంచితభక్తిన్
వినుతోద్దామయశస్కుం
డనఁ గలయాధ్రువునిచరిత మార్యస్తుత్యా. 165

టీ. ఆర్యస్తుత్యా = సుజనులచేఁ గొనియాడఁబడు ఓవిదురా! అని = ఈప్రకారముగా, పాడెననుచున్ = నారదుఁడు పాడెననుచు, అనఘుఁడు = పాపరహితుఁడైన, మైత్రేయుఁడు, అంచితభక్తిన్ = ఒప్పుచున్నభక్తితో, విదురున కనియెన్ = విదురునిఁగూర్చి చెప్పెను. విను...శస్కుండు-వినుత = స్తోత్రముచేయఁబడిన, ఉద్దామ = హెచ్చయిన, యశస్కుండు = కీర్తికలవాఁడు, అనన్ కల = అనఁదగిన, ఆధ్రువుని = ఆధ్రువునియొక్క, చరితము.

తా. ఇట్లు వరుణసత్త్రమున నారదుఁడు పాడె నని పుణ్యవంతుఁడైన మైత్రేయుఁడు విదురునిఁ గూర్చి భక్తితోఁ జెప్పెను. మిక్కిలి కొనియాడఁ దగిన యీధ్రువచరిత్రమును.

సీ. మహితసత్పురుషసమ్మతమును ధన్యంబు
స్వర్గప్రదంబు యశస్కరంబు
నాయుష్కరంబుఁ బుణ్యప్రదాయకమును
మంగళకర మఘమర్షణంబు
సౌమనస్యముఁ బ్రశంసాయోగమును బాప
హరమును ధ్రువపదప్రాపకంబు

నై యొప్పునీయుపాఖ్యానంబుఁ దగ నీకు
నెఱిఁగించితిని దీని నెవ్వఁడేనిఁ
తే. దివుట శ్రద్ధాగరిష్ఠుఁ డై తీర్థపాద
చరణసరసీరుహద్వయాశ్రయుఁడు నైన
భవ్యచరితు దినాంత ప్రభాతవేళ
నలఘుమతిఁ బూర్ణిమావాస్యలందు మఱియు. 166

టీ. మహిత = స్తోత్రముచేయఁదగిన, సత్పురుష = సత్పురుషులకు, సమ్మతమును=ఇష్టమైనదియు, ధన్యంబును = గొప్పదియు, స్వర్గప్రదంబు = స్వర్గము నొసంగునదియు, యశస్కరంబు = కీర్తికరమైనదియు, ఆయుష్కరంబు = ఆయువు నిచ్చునదియు, పుణ్యప్రదాయకమును = పుణ్యమును గల్గఁజేయునదియు, మంగళకరము = మంగళకారియు; అఘమర్షణంబు = పాపములఁ బోఁగొట్టునదియు, సౌమనస్యముఁన్ = దేవతా సంబంధమయినదియు, ప్రశంసాయోగ్యమును = స్మరింపఁదగినదియు, పాపహారమును=పాపముల హరించునదియు, ధ్రువపదప్రాపకంబును=నిత్యపదము నొందించునదియు, ఐ, ఒప్పు, ఈయుపాఖ్యానంబున్=ఈకథను, తగన్ = ఒప్పునట్లు, నీకు, ఎఱిఁగించితిని = తెలియఁజెప్పితిని. దీనిన్ = ఈధ్రువో పాఖ్యానమును, ఎవ్వఁడేనిన్ = ఎవఁడైనను, తివుటన్=కోరికతో, శ్రద్ధా గరిష్ఠుఁడై = మంచిశ్రద్ధకలవాఁడై, తీర్థ...శ్రయుఁడును-తీర్థపాద=గురువగు విష్ణువుయొక్క, చరణసరసీరుహ=కమలములవంటి పాదములయొక్క, ద్వయ=జంటయే, ఆశ్రయుఁడును=ఆధారముగాఁ గలవాఁడును, ఐన, భవ్యచరితున్ = మంచినడవడిగల ధ్రువుని, అలఘుమతిన్ = గొప్పబుద్ధితో, దినాంతప్రభాతవేళన్=సాయంకాలమునను ప్రాతఃకాలమునను, మఱియు, పూర్ణిమా అమావాస్యలందును = పున్నమనాఁడును అమావాస్యనాఁడును.

తా. సులభము.

తే. ద్వాదశిని బద్మబాంధవవాసరమున
శ్రవణనక్షత్రమున దినక్షయమునందుఁ
బరఁగ సంక్రమణవ్యతీపాతలందు
సభల భక్తిని వినునట్టి సజ్జనులకు. 167

టీ. ద్వాదశిని = ద్వాదశియందును, పద్మబాంధవవాసరమునన్ = ఆదివారము నాఁడును, శ్రవణనక్షత్రమునను, దినక్షయమునందున్ = సాయంకాలమునందును, పరఁగన్ = ఒప్పునట్లు, సంక్రమణవ్యతీపాతలందున్ = సంక్రమణమునందును వ్యతీపాతయోగమునందును, సభలన్ = సభలయందును, భక్తిని = భక్తితో, వినునట్టి సజ్జనులకున్ = ఆలకించు సత్పురుషులకును.

తా. సులభము.

వ. క్లేశనాశంబును మహాప్రకాశంబును నైనభగవద్భక్తియు శీలాదిగుణంబులును గలుగు మఱియుఁ దేజఃకామునకుఁ దేజంబును మనఃకామునకు మనంబును నిష్కామునకుఁ దత్త్వవిజ్ఞానంబును గలుగు దీని వినిపించువారికి దేవతానుగ్రహంబు గలుగు నిట్టియుపాఖ్యానంబు నీ కెఱింగించితి నని మైత్రేయుండు విదురునకుఁ జెప్పినక్రమంబున శుకయోగి పరీక్షిత్తున కెఱింగించినతెఱంగు సూతుండు శౌనకాదులకు వినిపించెను. 168

టీ. క్లేశనాశంబును = ఆపదను దీర్చునదియు, మహాప్రకాశంబును = ఎక్కువవెలుఁగునదియు, ఐన, భగవద్భక్తియు = భగవంతునందు భక్తియు, శీలాదిగుణంబులును = ఆచారము మొదలగు సుగుణములును, కలుగును. మఱియును, తేజఃకామునకున్ = వర్చస్సునుకోరువానికి, తేజంబును = వెలుఁగును. మనఃకామునకున్ = బుద్ధినిగోరువానికి, మనంబును = బుద్ధియును,

నిష్కామునకున్ = కోరికలులేనివానికి, తత్త్వవిజ్ఞానంబును = పరతత్త్వము: గూర్చినయాత్మజ్ఞానమును, కలుగును. దీని, వినిపించువారికిన్ = జనులకుం జెప్పువారికి, దేవతానుగ్రహంబును = దేవతలవలని దయయు, కలుగును. ఇట్టి యుపాఖ్యానంబును = ఇట్టిచరిత్రమును, నీకున్ (విదురునకు), ఎఱింగించితిని, అని, మైత్రేయుండు, విదురునకున్, చెప్పినక్రమంబునన్ = చెప్పినట్లు, శుకయోగి = శుకమహాముని, పరీక్షిత్తునకున్, ఎఱింగించిన తెఱంగు=ఎఱిగించిన విధమును సూతుండు = సూతమహాముని, శౌనకాదులకున్, వినిపించెను.

తా. సులభము.

ధ్రువోపాఖ్యానము సంపూర్ణము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1953.